శ్రీరామ సహాయమ్.

# శ్రీమదాంధ్రాధ్యాత్మరామాయణము

(పద్యకావ్యము)

## అయోధ్యాకాండము



బ్రహ్మశ్రీ

వేమూరి జానకిరామ ప్రణీతము.

ప్రథమ ముద్రణము.

1000 ప్రతులు.

ఆంధ్ర గ్రంథాలయ ముద్రాక్షరశాలయందు
క. [illegible] రామయ్యగారిచే
ముద్రింపబడెను.

1929

కాపీరైటు రిజిస్టర్డు] [వెల రు 1-8-0

శ్రీ

# శ్రీమదాంధ్రాధ్యాత్మరామాయణము

(పద్యకావ్యము)



## అయోధ్యాకాండము



బ్రహ్మశ్రీ

వేలమూరి జానకిరామ ప్రణీతము.

ప్రథమ ముద్రణము.

1000 ప్రతులు.

బెజవాడ:
ఆంధ్ర గ్రంథాలయ ముద్రాక్షరశాలయందు
క. కోదండరామయ్యగారిచే
ముద్రింపబడియె.

1929

[వెల రు 1-4-0

# విజ్ఞప్తి



భాషాభిమానులారా !

బాలకాండము నెట్టులో శ్రీయుత బూరగడ్డ కోటీశ్వరరావు గారు అయినాబత్తిని శేషపున్నయ్యగారి వాక్సహాయమున నిరాటంకముగ ముద్రింపఁ జేయఁగలిగితిని.

అయోధ్యాకాండము ద్రోణాచలముతాలూకా వెలుదుర్తి గ్రామనివాసులు శ్రీయుత బి. రామిరెడ్డిగారు, అనుముల జానకి రామయ్యశ్రేష్ఠిగారు, గిడ్డయ్యశ్రేష్ఠిగారు మున్నగు వదాన్యులసహాయమున ముద్రణమైనదని తెలుపుటకెంతయు కృతజ్ఞుడను.

ముద్రణార్థ పర్యటనమున దారిబత్తెమునకైన లేనిసమయమున నీ వెలుదుర్తి గ్రామమున మార్గవ్యయమునకైన లభ్యముకాదా యని ధూమశకటముఁడిగ్గి వెలుదుర్తికి నేగి శ్రీయుత రామిరెడ్డిగారిని దర్శింప ప్రప్రథమమున చందామార్గములన్నియు నేర్పరచి రాజపోషకుల మగుదుమని యుత్సాహంబున నంగీకరించుటయు, నా వెనుక నీయయోధ్యకాండమునకెల్ల సహాయకులుగ నుండుటయు, సేవల ప్రశంసాపాత్రులని నామనఃపూర్వకముగ నభినందించుచున్నాడను. పత్తికొండ తాలూకా మద్దికెర రక్షకశాలాధ్యక్షులగు శ్రీయుత వాడ్రేవు వెంకటరావుగార లీ రామాయణ ముద్రణార్థము వాక్సహాయమొనర్చి కొంతద్రవ్యము సంపాదించి నాకొసఁగుటకెంతయు సంతసము, ఈ గ్రామముననే శ్రీయుత నేటీవుడాక్టరు వెంకోబరావుగారు భజనసంఘనాయకుఁడగు రంగప్పగారు శ్రీరామకార్యమునకు తోడుపడుట కెంతయు సంతసము.

"ప్రమాదో ధీమతామపి" యను విధమున నీగ్రంథమున నచ్చటచ్చట లేఖకప్రమాదాది దోషముల నాచెంతకు రాకుండ తమకార్యముగ నెంచి సవరించి యాదరించి ముద్రింపించిన శ్రీయుత క. కోదండరామయ్యగారి కనేక వందనములని తెలుపుట కెంతయో బ్రహ్మానందముగ నున్నది. ఇక నరణ్యకాండ మేసత్పురుషుల సహాయమున నెఱవేరవలసి యున్నదో మాబ్రహ్మేశ్వరున కే గోచరము.

ఇట్లు
బుధజనవిధేయుఁడు,
జానకిరామశాస్త్రి



ఓం.

# అరణ్యారోదనము



బాలకాండ మెట్టెట్టులో ముద్రింపఁ బడెఁగదా యని మనంబున నొక్కింత యువ్విళ్లూరుచు నయోధ్యాకాండమును ముద్రణాశాలకిచ్చుటాయె. మాపర్యటనము మానవాశ్రయంబునకు దూరమై కేవలము భగవంతునిపై యాధార పడియున్నది. ప్రాపంచికులలో నవ నాగరికు లందరు రామాయణమన్న నొక్కి పెట్టున 'రామాయణమా' యని నిరసించుటయకాక యిదివరకున్నవే కదా యని సాక్షేపముగ నొక్కి వక్కాణింతురు. ఈమాటలకొక చిన్న నవ్వువచ్చును. 'గ్రహచారము చాలక యీరామాయణము నేల వ్రాసితిమా' యనిపించు. కాని చేసినపని చేయుట ప్రపంచమున నిత్యము. సూర్యోదయము మొదలు బాహ్యకృత్యములాది సాయంత్రము కాంతాసంగమంబుదనుక నిత్యము జరుగునవియా, కావా? ఆసంగతు లీ నవనాగరిక మహామహులు తెలిసికొనజాలక 'రామాయణమా?' అని చప్పరింతురు. పైకృత్యములు వేరువేరుగ బ్రతినిత్యము మార్చుకొన్నచో నీ రామాయణము నథఃపాత మొనరించి యేరంకుపురాణములనో రామాయణముగ బారాయణము చేయవచ్చును. వారి వారి యిష్టార్థముల దీర్చుకొనవచ్చును. సామాన్యమానవుని కథానాయకునిగ గైకొని వర్ణజాలము మనస్వతంత్రములో నున్నదని గ్రామ్యాంతర్గత భాష గైకొని బండబూతుల గొన్నిటి గూర్చి ముద్రాశాలలు దండిగ నున్నవని యంత్రసహాయమున కాగితములకు లెక్క లేదని. నూతనమార్గము గనిపెట్టితిమని నవలలని రచించు మహాపురుషుల జీవితము లటుంచుడు. ఆనవలల బారాయణ మొనర్చు సత్పురుషు లెంతటి యాస్తికులో తెలియరాకున్నది. నవీనమార్గముల గనిపెట్టి యుద్ధరించు చున్నారమని పత్రికాముఖమున బ్రకటించుట స్వగౌరవార్థమో, లోకోపకారార్థమో, లోకాపకారార్థమో తెలియరాకున్నది. ఈనవలా మహాగ్రంథములు జనులకెంతటి యుపయోగకరములగునో గోచరించుట లేదు.

కాని రెండువిషయములు మాత్రము స్ఫుటముగ జదువరుల కెల్లరకు బట్టు పడగలవు. అవి యేవన స్త్రీపురుషులకు సహజముగ జారత్వము నేర్పుటకు మూలమై సంఘమూలమును బెరుకుటకు మార్గ దర్శనము లగుచున్నవని సామాన్య లోకజ్ఞానముగల మహనీయుల కెల్లరకు నవగతమేయని నాతలంపు. రెండవది చోరత్వము, హత్య - చేయుటకు వెనుదీయక యీకార్యముల జేయుట సహజమని తలంచి అందరు తదీయ మార్గాలోచనలయందే కాలము బుచ్చుచు వీలైనప్పుడు తదాచరణకు గడంగుచు నీగ్రంథములలో బఠించిన యంశముల దలచుకొని తద్వ్యక్తుల నాచరించిన మనము విజయము నంద గలమని యాచరింపక యూరకుందురా? లోకాపకారమునకు పాపమునకు వెనుదీయక యాచరింతురు. ఆగ్రంథముల యందలి యంశములన్నియు బాగుగ గమనించి చూచిన జగంబునకు జార చోరత్వంబుల నొనరింప మార్గదర్శకములు. హత్యల కుపదేశకములు వేరొక్క ధర్మముగాని పురుషార్థముగాని లేని యట్టి నిరర్థకములు ప్రకృతార్థకరములైన, జనుల కనర్థకరములని గ్రహింపక యుండుట ప్రకృతస్థితి ననుసరించి సమంజస మనుకొందము. ఇందు మరియొక యనర్థక మున్నది. సహజముగ నుండు లోకుల జ్ఞానము బోగొట్ట వెనుదీయక యున్నట్టి భాషాజ్ఞానమావంతయు లేని యిట్టి మహాగ్రంథముల కావ్యములవలె బాఠశాల యందుంచి బాలురకు నేర్పించు విద్యాశాఖాధికారు లెంతటి లోకోపకారులోకాని కేవలము చింత్యము. ఇన్నియేల, దేశభాషయన్న నేవగించు నేస్వేతముఖులో లేక యేపరదేశీయుడో భాషాగ్రంథము లేశమేని తెలియని విబుధులు సర్వాధికారులై విద్యాశాఖకు దొరతనమువారు స్వాతంత్ర్యము నిచ్చితిమనుట చేతనో వారీదేశభాష మనకెందులకు సేవకావృత్తికిదగిన రాజభాషను నేర్పించినజాలు ననియో, యెంచి నిరసించుటచేతనో యిట్టియవస్థబట్టె. ఇంక బ్రాథమిక విద్యార్థులన్ననో నానాటికి యథోగమనము చేయుచు బాఠశాలంబున బలిచక్రవర్తి చెంత కేగిన వృద్ధికిరాగలమని యెంచుచున్నవి. ఎట్టులన పైవిద్యాశాఖాధ్యక్షులు నిర్ణయించిన ప్రకారము చెప్పుటయేకాక పూర్వాచార మెట్టిదో యెరుగనివారు. సామాన్య

గ్రంథముల జదువజాలనివారు పద్యకావ్యమనిన మాపాలిటి పెనుభూత మని తలచువారు భాషయనిననేమియో తెలియనివారు మఱికొన్ని వ్రాయగూడని సుగుణములుగల చండప్రచండ మధ్యందినమార్తాండు లగు మండలనాయకులు ప్రథమాభ్యసనాది శాలాధికారముల బూను కొనుటయు నుపాధ్యాయులనిన వారికి శరణ్యులై పరిచర్యలొనరించు వారలే యగుటవలన విద్యాగంథమెరుగనివారే, బోధనాభ్యసన కళా శాలలో నుత్తీర్ణులగుట పరమధర్మముగాన వారే యుపాధ్యాయులు. కర్మముచాలక నూటికొక్కరు వారిజన్మాంతరపుణ్యమున నేర్చినవిద్యా వంతులకు నధోలోకమేకాని వేరులేదు. కాన నిట్టిపరిస్థితుల బాలు రెంతమాత్రము వృద్ధికిరాగలరో స్వధర్మము లేపాటి ముందంజవేయ గలవో మనశ్శక్తి యెంత దినదినాభివృద్ధియగునో పరమేశ్వరునకే యెరుక. ఒకవేళ పైయధికారుల యిందుసత్కృత్యమున కొందరు విజ్ఞులుండి లోలోన నవ్వుకొనుచు భాషాయోషామణికిట్టి యుపస్థగలి గెనేయని చింతతో నేమిచేయవీలులేని యిక్కట్టునబడి యుందురను టకు సందియము లేదు కాని యీపరిస్థితులన్నియు కేవలము దత్తమండ లముననే తటస్థించినవి. ఏలనన్న నే ద్రవిడదేశమునుండియో వచ్చి యున్నతాధికారముల జలాయించుటయు నీమండలమున నచ్చటచ్చట నెవ్వరైన యుండిన నిరాశ్రయులగుటయు మండలాధిపతుల కీరహ స్యము తెలియక గర్వించుటయు కాక వారే కావలెననుటయు బూర్వ మునుండియు శాస్త్రజన్యజ్ఞానమునకన్న ననుభవజ్ఞాన మెక్కుడని పర మార్థతత్పరులైయుండి రానురాను మూఢత్వ మాపాదించుటయు నొక్కరొక్క రీలోపముల సవరింపవలెనని పట్టుబట్టిన నైకమత్యతలేక యుండుటయు, నన్నికార్యముల నామూలము బోకార్పఁగల సోమరితన మను కాలాహి వీరివెన్నాడి విడువకయుండుటయు నెవరెట్లున్న మాకే మియను నరసనంబును మున్నగు కారణంబుల కొలవాలమై యున్నది.

ఇంక లోకమునగల మానవులన్నలో తాముచేయు దుర్వ్యాపా రములకు పురుషార్థరహితములై యసమంజసములై పరాపకారభూయిష్ట ములై యుండు కార్యములకు గావలెనన్న వెచ్చించుటకాలోచింపక

ధర్మకార్యమనిన 'మాకీసంవత్సర మనేక ధనవ్యయమైనది, మాచేతగా' దనువారును కలెక్టరు తహసిలుదారులు మున్నగు రాజకీయోద్యోగులు వచ్చిన మెరమెచ్చులకు వేలాంతరములు వెచ్చించి మర్యాదబడయు వారును, ధర్మమన్న నసహ్యముగ నుండువారును గల యీ ప్రపంచమున మాదృశులు సంచరించుట దుష్టసత్వఘోంకారయుతమై మార్గసంచరిష్ణుల కతిభీతి దార్కొనజేయు మహాకంటకావృత కీకారణ్యమున దారిగానక కంటకములద్రొక్కుచు చనుచున్నవారి చందంబున నరణ్యరోదనమైనది. కాని యరణ్యమున నచ్చటచ్చట సహజపరోపకారభూయిష్టము లగు సంతానభూజంబులునా వదాన్యు లుండుటంబట్టి యెట్టులో శ్రీమదధ్యాత్మరామాయణ మహాసాగరంబునబడి యద్దరి జేరుటకు బ్రయత్నించి రెండుతరంగములు వెనుకంబడునట్లు మహాదాయాసంబున నీదగలిగితి. నింక నాలుగు మహాత్తరంగము లెదురెక్కి వచ్చుచున్నయవి. వానినెట్టు దప్పించుకొని గట్టుజేరగలనా యని చింతింతును గాని వదాన్యకల్పభూజంబులీప్రపంచ మహాదరణ్యముననుండుట కొంత ధైర్యము నాహృదయంబున నిక్కిచూచుచున్నది. వెలలేని యానందమగుచున్నది. ఆనాలుగు తరంగముల నొక్కత్రుటిలో దాటగలనని తోచుచున్నది. ఏలనన మదుపాసనాదైవము కోదండరాముండీకార్యము తనదిగా భావించుటయే చేయూత. గ్రంథవిస్తరభీతిచే మానవలసె.

ఇట్లు

సర్వబుధజనవిధేయుడు,

గ్రంథకర్త.



# అయోధ్యాకాండ సహాయకులు.



—♦ రాజపోషకులు ♦—

శ్రీయుత బీ. రామిరెడ్డిగారు, వెలుదుర్తి, డోను తాలూకా.

—♦ ప్రధానపోషకులు ♦—

శ్రీయుత కీర్తిశేషులగు ఐతా పెద్దస్వామిశ్రేష్ఠిగారు, కర్నూలుతాలూకా, పుల్లిందకొండ.

,, ములుకట్ల వెంకటసుబ్బయ్యగారు, రామళ్ళకోట.

,, దర్శి హనుమంతప్పగారు, బురుజుల, పత్తికొండతాలూకా.

—♦ ప్రతికాండసహాయకులు ♦—

శ్రీయుత కన్నెగంటి పిచ్చయ్యశ్రేష్ఠిగారు, పత్తికొండతాలూకా, నల్లచలమల.

,, ప్రత్తియీశ్వరయ్యశ్రేష్ఠిగారు, తుగ్గలి.

యక్కలగురుస్వామిశ్రేష్ఠిగారు, తుగ్గలి.

రెడ్డి వెంకటరెడ్డిగారు, యడవల్లి, పత్తికొండతాలూకా.

మ॥ ధనసాహాయ్యము వాక్సహాయమును చిత్తప్రీతిగాఁజేసి చెం
దిన మోదంబున గీర్తిగాంచెడు మహాధీరాళి నెల్లప్పుడున్
వనజాక్షుండు శంకరుండు వరసంపత్పుత్రపౌత్రాదులం
దనివారంగ జిరాయురున్నతుల నిత్యంబిచ్చి రక్షించుతన్.



# శ్రీయుత కృష్ణగిరి లింగప్ప.

పెండేకల్లు గ్రామవాసి. కేవల దరిద్రుడై నను రామభక్తి కలిగినవాఁ డగుట కతన నయాచితముగ నాలుగు యకరముల భూమిని శ్రీరామ మందిరమును నిర్మించిన చోటనే ధారాదత్త మనోదత్త పూర్వకముగ నొసఁగితి నని తెలుపుచు మందిర నిర్మాణమునకు శక్తివంచనలేని శరీర సహాయ మొనర్తు ననుట కెంతయో ముద మావహిల్లు. అవ్యాకృతు లగువార లీ విధంబున బ్రపంచమున లెక్కలేని ధర్మకార్యములకు సహాయకరు లగుచుందురు. శ్రీ లింగప్పగారికి పుత్రపౌత్ర పారంపర్యముగ శ్రీరాముఁ డనంత సౌభాగ్యము లొసఁగుత.

# తప్పొప్పుల పట్టిక.



| పేజి. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 4 | 6 | శుధ | సిద్ధ |
| 7 | 20 | మరిమ | మరిమరి |
| 11 | 22 | భాషిత | భూషిత |
| 17 | 16 | రేడు | ఱేడు |
| 18 | 11 | త్వాత్మవనీశు | త్వాత్మతలేశు |
| 29 | 8 | విడూయు | విదూయు |
| 40 | 25 | వనవధిఁ | వనధిఁ |
| 41 | 25 | గొమ్ముమా | గొమ్మయా |
| 46 | 11 | నిరాభాసుఁ, గరుణు నీలో త్పల♦వరశరీరు | రాభాసు నీలోత్పల♦లా భు గరుణు |
| 49 | 3 | విను | విన |
| ,, | 4 | నీ కేటికిఁ | మీ కేటికిఁ |
| ,, | 23 | యాశించు | నాశించు |
| 72 | 13 | కరకంపిత | రకంపిత |
| 75 | 15 | ధశరథుండు | దశరథుండు |
| 79 | 17 | దలంతును | దలంతుము |
| 89 | 6 | దరమెప్పారెడు | దరమైయొప్పెడు |
| 105 | 10 | భూషణంబులఁ | భాషణంబులఁ |
| 106 | 3 | నన్ను నిరీక్షణ | ననునిరీక్షు |
| 111 | 23 | వాతామృత | వాంతామృత |
| 115 | 16 | వేచి | లేచి |
| 118 | 27 | దహింప | దహియింప |

| పేజి. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 124 | 9 | పసిష్ఠు | వసిష్ఠు |
| 129 | 12 | స్తృతణంబు | స్తరణంబు |
| 132 | 14 | వురంబువీడియుఁ | కృతవ్రితా ! |
| 139 | 8 | వశిష్ఠుని | వసిష్ఠుని |
| 143 | 18 | దుల | దున |
| 151 | 10 | బూర్వ | పూర్వ |
| ,, | 19 | సదువవిష్ణు | సదుపవిష్టు |
| 158 | 20 | యునునాత్మను | యన నెంతయు |



# విషయసూచిక.

—♦ చతుర్థాశ్వాసము ♦—



శ్రీరామ సహాయమ్

# శ్రీమదాంధ్రాధ్యాత్మరామాయణము



## అయోధ్యాకాండము.



### ప్రథమాశ్వాసము.



రామతారకామృత
సారాస్వాదనవిలాస ♦ సదమలచరితా
ధీరా రుద్రాక్షధరా
నారదశితికంఠ దివ్య ♦ నామా భీమా! 1

వ॥ అక్కథకునిం గాంచి పర్వతరాజపుత్రియగు నక్కాళికాంబ
హర్షాశ్రుకణంబులు జనుగట్టుల నటింపఁ గర్వపర్వంబుగా నిట్లనె. 2

క॥ ధరణీనాయక శంకర
కరుణాకర భుజగహార ♦ కంఠాభరణా
మరి యేమిచేసె రాముఁడు
బరమమతిఁ విస్తరింపు ♦ భవభయహరణా! 3

వ॥ అంత శంకరుండు దాక్షాయణి నీక్షించి యవ్వలికథా
విధానంబు వినుమని భాషింపఁ దొడఁగె. 4

సీ॥ అంతఃపురంబున ♦ నతిసుఖంబున రామ
చంద్రుం డొక్కెడ మోద ♦ సాంద్రి లీల
సకలభూషణకళా ♦ సంపన్నుఁడై యొప్పి
నీలోత్పలశ్యామ ♦ నిర్మలాంగ
భాసమానము గాఁగ ♦ వరకౌస్తుభాన్విత
ముక్త కంధరుఁడయ్యు ♦ భూరిరత్న
చయవిరాజిత దివ్య ♦ జాంబూనదాంచిత
సింహాసనస్థుఁడై ♦ చెలువు మించ
తే॥ గీ॥ రత్న దండభాసిత చామ♦రమున సీత
శ్రీమను వాపంగఁ దాంబూల ♦ చర్వణాది
సరస సల్లాప ముల్లాస ♦ చతురవచన
రచనకలితాను మోహుఁ డై ♦ రాజిలంగ. 5

వ॥ ఉండు సమయంబున నంబరతలంబున హాటాదుత్పన్నమై
వర్ణింప నలవిగాని సకల హృదయ భ్రిమమూణ తేజఃపుంజ మొండు. 6

—♦ నారదాగమనము ♦—

చ॥ శరదభిచంద్రి కామల వి♦శాల తనుప్రిభ మిన్నుగప్పి యు
ప్పరముననుండి భూవలయ♦భాగము లుద్గతి నావతించ సు
స్థిర ధవళప్రిభాకలిత ♦ సిద్ధి నతర్కిత గమ్యమానుఁడౌ
నిరుపమదివ్యదర్శను ము♦నిప్రివరుం గనె నారదాఖ్యునిన్॥ 7

చ॥ మునివరు గాంచి లేచి యతి♦మోద మెలర్పఁ గృతాంజలుండునై
జనకజతోడ రత్నవిల♦సన్మణి మస్తకమూనభూమిపై
ఘనముగ మ్రొక్కులిడి సలిపి ♦ కాంతకృతాసనుగా నొనర్చి ప్రీ
తిని బరమాదరాప్తి దను ♦ దివ్యపదమ్మును గాంచి తే ననెన్. 8

క॥ ఘన మాయావిషయిక వా
సనచేతను లైచరించు ♦ సంసారులకో

మునివర నీసంగదర్శన
మన దుర్లభమనఘ యస్మ♦దాదుల కెందున్. 9

చ॥ జననుత యుష్మదాదులగు ♦ సంయమిచంద్రులు గేహజాల వ
ర్తనులగు మాదృశాఘుల ను♦దారతఁగాంచఁగ రాఁగడంగుటల్
ఘనము శుభంబు పూర్వకృత ♦ కల్మషనాశన కారణంబు పా
వనములు గేహముల్ సులభ ♦ పద్ధతియే మహనీయు లబ్బుటల్. 10

ఆ॥వె॥ పూర్వజన్మసుకృత ♦ పుణ్యమహోదయం
బునన వాప్తమయ్యె ♦ మునివరేణ్య!
సత్సమాగమంబు ♦ సంసారులకుఁగూడ
నెపుడొ కలుగవచ్చు ♦ నీశ్వరేచ్ఛ. 11

క॥ మునివర కృతార్థుఁడనయితి
ఘనులగు మీదర్శనంబు ♦ గలుగుటకతనన్
మునుకొని నాచేయఁగఁదగు
పనులెవ్వియొ వేఁగఁదెలుప♦వలయు మహాత్మా! 12

వ॥ భవాదృశులగు పూజ్యులు సంప్రాప్తించుట కేవలవిశేషము గావున దమ చిత్తానుమతంబున సమకూర్తు నన నక్కులపాశనుండు నిండారుముదంబున. 13

తే॥ భక్తవత్సలు రాఘవు ♦ బరగఁగాంచి
యనఘ! లోకానుసార వా♦క్యముల మోహ
మందఁజేసెద వదియేల ♦ నయ్య రామ!
యనియు భాషింపఁ దొడఁగె న♦త్యాప్తసరణి. 14

తే॥ నేను సంసారి నని నీవు ♦ నియతిబలుకు
మాటసత్యంబె యేలన్న ♦ మహికి నాది
భూతయగునట్టి మాయయు ♦ బుండరీక
నయన గృహిణియై నీకు స♦న్నాహమయ్యె. 15

మ॥ అరయన్ సత్త్వరజస్తమో గుణములన్ ♦ వ్యాపించి నీచుట్టమై
సరసంజేరియు నాశ్రయించి నిను నీ ♦ సంబంధముం గాంచి యే
వర మాయా సతి కీర్తిగాంచె నదియే ♦ భావింప నిద్ధాత్రిలో
సరసీజాత హరీశ్వరాఖ్యు లనఁగా ♦ జన్మింపఁగాఁ జేసెడిన్. 16

తే॥ శుక్లకృష్ణ లోహితములన్ ♦ సూటి బ్రజల
సృష్టి నొనరించు నిరతంబు ♦ శుద్ధచరిత
భువనగేహంబునందు నా♦పోడిమి నిఁక
గొప్ప సంసారి వననొప్పుఁ ♦ గువలయేశ! 17

తే॥ విష్ణుఁడవు నీవు జానకి ♦ వెలయ లక్ష్మి
సీత పార్వతి శంకర ♦ ఖ్యాతిఁజెంది
నావు వాణి సీత విరించి ♦ వీవు ఛాయ
జనకజాత సూర్యుఁడవు నీ♦వనఘచరిత! 18

క॥ అల శుభలక్షణ రోహిణి
లలితాంగి ధరిత్రిజాత ♦ లక్షణగుణ ని
శ్చలగతి జంద్రుండవు నీ
వలయక భావింప రామ ♦ యమలోద్దామా! 19

క॥ పౌలోమి సీత నీ వన
నాలోచింపఁగ సురేంద్రుఁ ♦ డనఁ దగెదవు స్వా
హాలలనామణి జానకి
యా లలితగుణా యనలుఁడ ♦ వయ్యెద వనఘా! 20

తే॥ కాలరూపంబు నందిన ♦ కాలయముఁడ
వీవు సీత సంయమినియా ♦ నీవు దలఁప
నైఋతి కధిశుఁడవు సీత ♦ నయగుణాఢ్య
శుభచరిత్రి తామసి నాగ ♦ నభినుతంబు. 21

క॥ వరుణుఁడ వీ వని తెలియుము
ధరణీతనుజాత పూత ♦ ధర్మసునీతి

స్ఫురదుపగతి భార్గవి నా
గరముపముగఁ గాంచనౌను ♦ కమలాక్షు హరీ! 22

క॥ అనిలుఁడ వీవు సదాగతి
జనకాత్మజ యువగధీశ ♦ సంగతి వీవా
ఘనసంపద్దేవియు భూ
తనయ యథార్థముగ రామ ♦ ధైర్యోద్దామా! 23

క॥ రుద్రాణి జానకీసతి
రుద్రుండవు నీవు రామ! ♦ లోకము లెల్లన్
రౌద్రాకారత మీర
క్షుద్రగతిం బూదిఁ జేయుఁ ♦ గోరుదు రొకటన్. 24

క॥ స్త్రీరూప వస్తు వెల్లను
వారక జానకి యనంగ ♦ భావింపఁ దగున్
బూరుషరూప వితానము
ధారుణి నీవంచు నెంచఁ♦దగునో రామా! 25

క॥ కావున ముల్లోకములన్
భావించియు నాత్మఁగాంచఁ ♦ బలుగతుల నిలన్
దేవా! మీ యిరువు రనం
గా విదితం బగు న్యాపీక ♦ గణనాథ! హరీ! 26

సీ॥ భవదీయసంబంధ ♦ వర్తియౌ జ్ఞానంబె
యవ్యాకృతం బని ♦ యందు రెందు
నద్దాన దనరు మ♦హత్తత్వ మద్దాన
జనియించె సూత్రంబు ♦ సరవి ధరణి
నది లింగదేహంబు ♦ నై యొప్పు సర్వాత్మ
కం బది కాంచ లిం♦గం బనంగఁ
బొరి నహంకారంబు ♦ బుద్ధియుఁ బ్రాణేంద్రి
యంబులు పదిగూడి ♦ యలరు నదియు

తే॥ గీ॥ జన్మ మృత్యు సుఖాది మ♦త్సర్వకాల
గతుల లింగదేహంబు ను♦త్కర్ష గాంచు
ననియుఁ బ్రాజ్ఞులచే నిట్లు ♦ వినఁగఁబడియె
రామ! జానకీరామ! శ్రీ♦రామ! రామ! 27

ఆ॥ వె॥ అదియె జీవ సంజ్ఞ♦యై జగన్మయ మయ్యుఁ
దగు నవాచ్య మనియుఁ ♦ దగి యనాద్య
మని యవిద్య యనియుఁ ♦ దనరారి కారణో
పాధిఁ జెందు నందు♦రయ్య రామ! 28

తే॥ గీ॥ స్థూల సూక్ష్మ కారణములం ♦ దొడరి కాంచఁ
జిత్తున కుపాధు లీమూఁడు ♦ జీవుఁ డన్న
దేహములు మూఁడు గలవాఁడు ♦ తివిరి వీని
విడువఁ బడు వాఁడు పరమాత్మ ♦ విశ్వనాథ! 29

చ॥ కలయును గాఢనిద్రయును ♦ గాంచఁగ జాగ్రతయుక్ గ్రమంబునన్
మెలఁగియు సంసృతిం దిరుగు ♦ మేదిని దానికి వేరు సాక్షియై
చెలఁగుచుఁ జిత్స్వరూపమునఁ ♦ జెందక దానిన యుందు వీవు ని
శ్చల పరిపూర్ణ నిర్మలయ♦శః పరిభాసిత రాఘవాగ్రణీ! 30

క॥ నీయందు జగము బుట్టును
నీయందే నిలిచియుండు ♦ నిఖిలంబు గనన్
నీయందె లయము జెందెడి
నీయెడఁ గన సర్వకార ♦ ణేశ్వరుఁడ వీవే. 31

తే॥ రజ్జువును గాంచి పా మను ♦ భ్రాంతి భయముఁ
దనరినటుల దన్ను జీవిగాఁ ♦ దలఁచి భీతిఁ
జెందు పరమాత్ముఁడే నంచుఁ ♦ జిత్తమందుఁ
దలఁచి భయ దుఃఖముల వీడి ♦ మెలఁగ వలయు. 32

తే॥ పరవి చైతన్య మాత్ర తే♦జంబువలన
సర్వదేహంబు లందున ♦ సకల. బుద్ధు

లెంపుచేతఁ బ్రకాశింప♦నుండు దాన
నీవు సర్వాత్మకుఁడ వంచు ♦ నెగడినావు. 33

చ॥ తెలియమిఁ ద్రాఁడు సర్వ మను ♦ తీరున నీయెడ సర్వసంగతుల్
కలవని చెప్పుచుండెద రిఁ♦కన్ నిను గన్గొను జ్ఞాన మబ్బినం
గలదు లయంబు సర్వమును ♦ గావున నయ్యది యభ్యసింపఁగా
వలసిన దంచు నెంచెద న♦వార్యగతిన్ రఘువంశధీమణీ! 34

తే॥ అనఘ! నీపాద భక్త భ♦క్తాళి కెనయుఁ
గ్రమత విజ్ఞాన మద్దాన ♦ రామచంద్ర!
నీకు భక్తు లెవ్వరో వారె ♦ నెమ్మి ముక్తి
భాజను లటంచు భువిలోన ♦ బలుకవలయు. 35

తే॥ ఏను నీభక్త భక్తుల ♦ కేపు మీఱు
భక్తులకుఁ గింకరుండను ♦ వారిజాక్ష!
కాన నన్ననుగ్రహ బుద్ధిఁ ♦ గాంతు గాని
మాయకుం జిక్కవడనీకు♦మా మురారి! 36

క॥ పరమేశ నీదు పొక్కిలి
సరసీజాతంబునందు ♦ జనియించిన యా
పరమేష్ఠి కాత్మసుతుఁడను
వరకరుణా నీకు నేను ♦ బౌత్రుఁడ నగుదున్. 37

క॥ ఆనందాశ్రుపరిప్లుత
మానసుఁడై మ్రొక్కులిడుచు ♦ మఱిమ విధియున్
మానుగఁ దెలిపిన గోప్యము
నే నింపొప్పంగఁ దెలియ ♦ నిపుడె వచింతున్. 38

వ॥ విరించిచోదితుండ నయి యిట కరుదెంచి నీతో ముచ్చటింపఁదగిన సమయమున దదీయ రహస్యవిషయమునంతయు జ్ఞప్తికి వచ్చునట్లు సంభాషణ మాచరించి చనవలయు నని యెంచితి నవ్వాలి విధానం బెఱింగించెద. 39

చ॥ అమల మనీష ! రావణ వ♦ధార్థము నీవు జనించినావు సం
భ్రమమున నీదు తండ్రి యని♦వార్య ముదంబునఁ బొంగి యిప్పు
క్రమముగ నిన్ను రాజ్య పరి♦రక్షణకై యభిషిక్తుఁ జేయు నా
కుమతి సురారిరావణుఁడు ♦ కూలఁడు రాలురు రాక్షసాధముల్. 40

తే॥ ఇపుడు రాజ్యాభి సంసక్త ♦ హృదయుఁడ వయి
రావణు వధింపకయ యున్న ♦ రామ ! నీ వ
నంత భూభార. హరణార్థ ♦ మవతరించి
తను ప్రతిజ్ఞయుఁ గాంచంగ ♦ వ్యర్థమింక. 41

క॥ అది సత్యం బొనరింపుము
సదయత రాజేంద్ర సత్య♦సంధుఁడ వని నా
రదమౌని యనగ సస్మిత
వదనుం డయి రఘుకులప్ర♦వరుఁడు ముదమునన్. 42

చ॥ విని మునివాక్యజాలములు ♦ వీనుల విందుగ మందహాస మ
ల్లన వదనాంబుజాతమున ♦ నంద మెలర్ప మునీశుఁ గాంచి యి
ట్లనె మది నాకు నేటి విది♦తావిదితంబులు మున్నె నా ప్రతి
జ్ఞను నెర వేర్పఁబూనితి న♦సంశయమొప్పగఁ జిత్తగించుమా. 43

తే॥ పరగఁ గాలానురోధత ♦ వారివారి
పూర్వ కృతదోష సంక్షయం♦బున వధింతు
సర్వ భూభార ఘోర రా♦క్షస సమూహ
ములను లోకంబు లతిభీతి ♦ దొలఁగి మెలఁగ. 44

చ॥ అరయుఁడి మీరు రావణ వ♦ధార్థము చేసె ప్రయాణమో మునీ
శ్వరతిలకా! చతుర్దశ సు♦వర్షము లారసి దండకావనిం
దిరిగి సురారి మూఁకలను ♦ దీర్చెద నే మునివేషధారినై
దురము నొనర్చి సీత మిష♦తో సకలంబుగ దుష్టసంతతిన్. 45

వ॥ అనిన నారదుండు దండిముదంబున నిండిన మనంబున బుండ
రీక నయను నవలోకించి. 46

చ॥ మునుకొని త్రిప్రదక్షిణము ♦ పూని యొనర్చి నుతించి మ్రొక్కి రా
మునకుఁ దదాజ్ఞఁ జేకొనియు ♦ మోద మెలర్పఁగఁ దాను సత్వరం
బునఁ జనె దేవమౌనిగణ♦పూజ్యుఁడు నారదసంయమీంద్రుఁడుర్
మునులు పరోపకారగుణ ♦ భూషణులే కద యెట్టి వేళలన్. 47

చ॥ వరముని రామచంద్రుల వి♦వాదము నెవ్వరుగాని భక్తి సం
భరిత మతిం బఠించినను ♦ నారక విన్నను సంస్మరించినన్
సురల కలభ్యమైన పరి♦శుద్ధ విమోక్షము సత్వరంబునన్
విరతి పురస్సరంబుగను ♦ వీలగు జెందఁగ సక్రమంబుగన్. 48

—*రామ యువరాజ్యాభిషేచనార్థము దశరథుండు వశిష్ఠునితో
యోచన జేయుట.*—

సీ॥ దశరథాధీశుండు ♦ తాపసేంద్రు వసిష్ఠుఁ
దనకులాచార్యుఁ దాఁ ♦ గని రహస్య
సౌధంబునందుండి ♦ సంతసం బొప్పంగ
నాహ్వాన మొనరించి ♦ యధికభక్తి
గూర్చుండ నియమించి ♦ గొబ్బున భాషించె
వినయ సంపన్నుఁడై ♦ వెలయునట్టి
తనకూర్మి తనయు రా♦ముని గాంచి సాకేత
నగరాధివాసులు ♦ నైగమాళు
తే॥ లతి వయోవృద్ధులు నమాత్యు♦ లార్యసమితి
గౌరవార్హ్యులు మిగులంగ ♦ గౌరవింత్రు
మరి విశేషించి భాషింత్రు ♦ మంత్రివరులు
సుధను జిలికెడు మా రాము ♦ కథలు వినఁగ॥ 49

శా॥ రాజీవాక్షుఁడు రామచంద్రునకు నీ ♦ రాజ్యాభిషేకంబు వి
భ్రాజల్లీల నొనర్పఁగాఁ దలఁచి దే♦వా! మిమ్ము దైవజ్ఞులం
దేజశ్శిష్ట ముహూర్త మొక్కటి నసం♦దేహంబుగం దెల్పఁగం
బూజార్హాత్ముల గోరినాఁడను మన♦స్ఫూర్తిన్ వచింపం దగున్. 50

మ॥ యువరాజన్యుని జేయఁగావలయు న♦త్యుత్సాహమేపార రా
ఘవునిం దేవగురూత్తమా! తమఱు సం♦కల్పించి తద్యోగ్య సం
భవ సంభారము లన్ని కూర్పవలె నీ♦ పట్టాభిషేకోత్సవం
బఱుదాఁకం గడు శ్రద్ధతో మనుఁడీ వృ♦ద్ధాప్యంబు నా కెంతయున్.
చ॥ తనయులఁ బెద్దవాఁడతఁ డు♦దారుఁడు రాముఁడె యౌవరాజ్యమం
దున నివసింప నర్హుఁడగుఁ ♦ దోయజనేత్రుని రాముఁ దోడితె
మ్మని సెలవిందు నిందుమతి♦నార్యవతంసమ! యోగ్యులౌ సుతుల్
తనరిన వారికిన్ సుఖ ము♦దంబులు గల్గవె వార్ధకంబునన్. 52
చ॥ దినదిన వర్ధమానమయి ♦ తీరెను బాల్యము యౌవనంబు ద
న్మునుకొనె వార్ధకంపుఁ బెను ♦ భూతము నన్నడపంగఁ జొచ్చె నా
తనయుఁడు రామచంద్రుఁడిఁక ♦ ధాత్రి భరింపఁగ నోపి దోర్బలం
బున దశదిగ్విశాలమగు ♦ పూజ్య యశంబును బొందనయ్యెడిన్. 53
క॥ భరతుఁడు మాతులు గాంచఁగ
నరిగెను శత్రుఘ్నుతోడ ♦ నరముగ రేపే
సరసత నభిషేకించెదఁ
దిరముగ నను మోదమతిని ♦ దెలుపు మహాత్మా! 54
మ॥ ధరనిక్ష్వాకుల ధర్మముల్ విదితమే తథ్యంబె మీ కెల్ల నే
బరిపాలించితిఁ బూర్వపద్ధతి వయో♦భారంబు పైఁ గప్పె వి
స్తర నిత్యోదయ సంపదాన్వితము నే♦ తద్రాజ్యభారంబు వి
స్ఫురితామోదత రామచంద్రునకిడన్ ♦ సూచించి భాషించితిన్. 55
తే॥ విరివి శైశవ మభ్యస్త ♦ విద్య యౌవ
నంబు విషయాభివాంఛఁ గా♦లంబు గడపి
వార్ధకంబున మునివృత్తి ♦ బ్రాణి చనఁగ
యోగమున సూర్యకులజుల ♦ కొప్పు నెపుడు. 56
సీ॥ పరగున మీరలు ♦ పట్టాభిషేకార్థ
సంభారములఁ గూర్చి సంతసమున

జనుల నియోగించి ♦ సత్వరంబుగఁ జని
యామంత్రణము జేయు ♦ రామచంద్రు
నానావిధానూన ♦ మానిత నవరత్న
రాజత్పతాకముల్ ♦ తేజరిల్ల
నగరి నెల్లెడనిల్పఁ ♦ దగునింక స్వర్ణ ము
క్తా యుక్త తోరణ ♦ కాండముల న
తే॥ లంకరింపంగ వలయు ని♦శ్శంక మీర
లనియు సాకేతపురనాథుఁ ♦ డైన దశర
థేశుఁడు నమాత్యుని సుమంత్రు ♦ నింపుఁ గాంచి
పిలచి యాజ్ఞాపన మొనర్చె ♦ విరివి నిట్లు. 57

క॥ మునిపుంగవుఁ డేతఱి నే
పనులను నియమించునో యవి ♦ భాసురగతి నీ
వొనరింపఁగఁ దగు నా యా
జ్ఞను నెరవేర్చుటకు విధంబు ♦ సచివ సుమంత్రా! 58

వ॥ ఇట్లు నియమించిన నతండు వల్లెయని సంతసమ్మున నమ్ముని వరుఁ గాంచి కర్తవ్యంబు సెలవిండన గురువర్యుం డిట్లనె; నెల్లి పద్మబాంధవుం డుదయగిరి నెక్కుటకు మున్నె స్వర్ణభూషణాలంకార భాసితలగు పదునార్వురు కన్యకామణులు, జాంబూనద మణిగణ పరిభూషితంబయి భాసిల్లు నైరావతకులోత్పన్నంబగు చౌదంతియు, నానాతీర్థోద పరిపూర్ణ స్వర్ణ కలశసహస్రికంబును నవ తీర్ణ వైయాఘ్రచర్మంబులును, రత్నదండ ముక్తామణి విచిత్రిత శ్వేతాతపత్రంబును గోమేధిక పుష్యరాగ మరకత మాణిక్య భాసిత నానాభరణ జాలంబులు మున్నగు పట్టాభిషేకోత్సవయోగ మంగళ ద్రవ్యంబుల సమకూర్ప వలయు; నటఁ గుశపాణులై సత్కృతులగు సంయమీంద్రులు సుఖాసనంబుల నుండఁ దనరు; సుగంధగంధ కుసుమ కస్తూరికాచందన తాంబూల పరిమళ వస్తు సముదాయంబుఁ జేకూర్పవలయు; వెండియు 59

సీ॥ వెల్లాటకత్తెలు ♦ వేశ్యాగణంబులు
గాయకావళి వేణు ♦ గాననిపుణ
మతులు నానావాద్య ♦ మహితులు రాజాంగ
ణంబున వాద్యముల్ ♦ డంబు మీఱ
వాయింపఁగావలె ♦ బహిరంగణమ్మున
హస్త్యశ్వ రథసమూ♦హంబు లెలమిఁ
సాయుధపాణులా♦యత శౌర్య ధుర్యులు
కాల్బలంబులు వండి ♦ గ్రాలవలయు
తే॥ నియతి సాకేత నగరిలో ♦ నిత్య మంగ
లాత్మ తేజో విలాస దే♦వాధివాస
మందిరమ్ముల బలిపూజ ♦ లంద మొప్పఁ
జరుగ వలెఁ దత్తదుచితో♦క్త సరణి మెఱయ. 60

శా॥ నానోపాయన పాణులై యలరి వి♦న్నాణంపు సద్భక్తితో
నానా దేశ నృపాళి రావలెఁ గద♦న్నా! బ్రాహ్మణానీకముల్
నానా వేదసుమంత్రకోవిదులు, నా♦నాశాస్త్ర పారీణులున్
సానందంబున బిల్వనంపు మిపుడే ♦ సన్మాన పూర్వంబుగన్. 61

క॥ శ్రీమంతుండగు మునివరుఁ
డామోదముతో సుమంత్రు ♦ నాజ్ఞాపనమున్
భూమీశ్వరాజ్ఞఁ జేసియు
రామావని విభునికడకు ♦ రయమున జనఁగన్. 62

—♦ వసిష్ఠుఁడు రామనికేతనంబున కరుగుట ♦—

వ॥ దుందుభిసంవత్సర చైత్ర శుక్ల చతుర్థీదినంబున సూతుండరద మాయత్తపఱుపఁ దేరెక్కి భద్రాయితంబగు పద్మనాభుసౌధంబునకుం జన నతిరయంబున రాజవీథిం గడచి చనిచని భగవానుఁడైన వసిష్ఠుండు రాఘవు భవనంబు నందలి కక్ష్యత్రయం బతిక్రమించి. 63

చ॥ అరదముఁ డిగ్గి రాఘవు గృ♦హాంతరసీమకు నేగ సేవకుల్
గురుపరుఁడన్న భక్తి నట♦కుంజన నడ్డముఁ జేయరైరి స
త్వరమున నా రఘూద్వహుని♦వాసవిలాస నికేతనంబునం
దిరముగఁ జేరఁగాఁ జని యొ ♦ దివ్యమునిప్రవరుండు నావలన్. 64

క॥ గురువరు నాగమనంబును
సరసీజదళాక్షుఁ డెఱిఁగి ♦ చయ్యన మదిలో
గరము సుభక్తి నెమర్కొన
గరములు ముకుళించి లేచి ♦ కడు సంభ్రమునన్. 65

సీ॥ ఎదురేగి మది మోద ♦ మెనయంగ సాష్టాంగ
దండ ప్రణామముల్ ♦ దనరసలిపి
సీతాకరానీత ♦ పూతోదకంబున
మునిపాద జలజాత♦ములను గడిగి
మణిగణాంచిత నవ్య ♦ మహిత పీఠమున సు
ఖాసీనుగాఁ జేసి ♦ వాసిఁ గులక
దత్పాద తీర్థంబు ♦ ధాత్రీజాసహితుఁడై
యురులీల శిరమున ♦ నుంచి మించి
తే॥ తాపసేంద్రమ మీపాద ♦ తామరస జ
లంబు మము ధన్యులను జేసె ♦ లలితగతుల
ననుచుఁ దలఁదాల్చె నవ్వారి ♦ వనజదృశుని
పదజలమ్ముల సురమౌని ♦ పంక్తు లట్లు. 66

తే॥ కన భవాదృశ మహనీయ ♦ జనులరాఁక
లస్మదాదుల పూర్వ పు♦ణ్యార్జితంపు
ఫలము భువన సంతారణ ♦ ప్రదము యోగి
చరణ సందర్శనం బందు ♦ సంతుమీరాంద్రి. 67

క॥ ఊరక రారు మునీశులు
వారక మాబోంట్లఁ గాంచ ♦ వచ్చుట లేదో

కారణము గల్గియుండును
ధీరుల చిత్తంబునందు ♦ దెలుపు మహాత్మా! 68

క॥ అనురాముని గాంచియు సుఖ
వనజాతము మందహాస ♦ వైభవ మొప్పన్
మనమున దైత్యుల యూపిరి
గొనుకాల మిదే యటంచు ♦ గొబ్బున బలికెన్. 69

క॥ తెలియనివాని విధమ్మున
దెలియని మాబోంట్ల కెల్లఁ ♦ దెలియని రీతిం
గలఁతను నలియఁగఁ జేసెదు
దెలిపెద నీ సేత లెల్లఁ ♦ దెలియుము రామా! 70

క॥ గిరిజాపతి నీ పదజల
మరసి ధరించియును ధన్యుఁ ♦ డయ్యె నజుండీ
వరపాద తీర్థసేవన
జిరమంగళకరుఁడు గాడె ♦ చెలువుగ రామా! 71

తే॥ నీవు భావించునదియెల్ల ♦ నెమ్మి లోక
ములకు నుపదేశకర్తవై ♦ పలుకు పలుకు
జగతి లక్ష్మితో గూడ సం♦జాతుఁడైన
యీశుఁ బరమాత్ముఁడని నిన్ను ♦ నెఱిఁగినాఁడ. 72

తే॥ దేవకార్యార్థసిద్ధికై ♦ తివిరి భక్త
భక్తిసంసిద్ధి కొఱకు రా♦వణ వధార్థ
మవని నవతరించితి వంచు ♦ నాత్మ నిన్ను
గుఱు తెఱుంగుదు మునుమున్నె ♦ కువలయేశ! 73

క॥ పరమరహస్యంబైనను
చిరశుభకర దైవకార్య ♦ సిద్ధికి బాహ్య
స్ఫురణను గోప్యపుఁ బేటిక
గరముద్ఘాటన మొనర్పఁ♦గా వలసె నిటన్. 74

తే॥ నీవు మాయచే సర్వంబు ♦ నియతి నభిన
యించు వడువు నిన్ను ననుస♦రించుచుండు
నీవు శిష్యుండ విట నాకు ♦ నీకు నేన
గురుఁడ దేవ! గురుగురుండ ♦ వరయ నీవు. 75

క॥ జననీ జనకుల కెందున
జనకుండవు సర్వభూత ♦ సముఁడవు లోకా
వనుఁడవు నంతర్యామివి
కనఁగన గోచరుఁడ వీవు ♦ కమలాక్ష హరీ! 76

తే॥ అనఘ స్వాధీన సంభవం ♦ బైన తనువు
శుద్ధసత్వ మయుంబును ♦ సూటిగొనియు
మని జగద్యంత్రి వాహకుం ♦ డనఁగఁ బరగి
భూవిభు ఖ్యాతినలరితి ♦ వీవు రామ! 77

క॥ మనుజునివలె లోకంబున
దనరఁగ నాయోగమాయ ♦ దగిలిన వాఁ డం
చును నిను గొల్చుట కతనన్
వనజాసనుఁ డాది దైవ ♦ భావము గనుటల్. 78

సీ॥ అరయఁ బౌరోహిత్య ♦ మతిగర్హ్యా మసియును
దూష్యజీవన మంచుఁ ♦ దోఁచియైన
నిక్ష్వాకు కులమందు ♦ నించుగ శ్రీరాముఁ
డవతరించు నటంచు ♦ నల విరించి
పూర్వంబె వచియింపఁ ♦ బొసఁగి యాసను నేను
భవదీయ సంబంధ ♦ వాంఛదగిలి
నింద్యజీవనమైన ♦ నెమ్మితో గైకొంచు
గురుఁడనై నీకు నే ♦ వరలవలయు
తే॥ నన్ను బేరాస నావృత్తి ♦ ననుసరించి
యుండ నిప్పటి కీడేరె ♦ నుత్తమగతి

మన్మనోభీష్టము మహాత్మ ♦ మానవులకు
సులభమె గురుత్వ మిలను నీ ♦ కలరియుంట. 79

తే॥ సర్వలోకైక మోహిని ♦ సరవిఁగాంచ
నామహామాయ త్వదధీన ♦ యగుట నన్ను
నది విమోహింపఁ జేయని ♦ యట్టి పట్టు
దెలుపు భారంబు నీపైని ♦ గలదు రామ! 80

చ॥ మరి నను మోహముక్ విడచు♦మార్గ మెటో గమనించి తెల్పుమా
నిరుపమలీల నేల గురు♦నిష్కృతి కాముఁడ వేని యద్దియే
చిరతరమైన వాంఛ దయ♦సేయు బ్రసంగవశమ్ముచేత వి
స్తరము నొనర్చినాఁడను బ్ర♦శంసకుఁ దేఁదగ దీరహాస్యముక్. 81

క॥ జననాథునిచే నిటకుం
బనుపంబడినాఁడ నేను ♦ భానుకులాఢ్యా!
నిను నామంత్రణ సేయఁగ
విను మా విధమెల్ల నీకు ♦ వినుపింతుఁ దగక్. 82

వ॥ ఎల్లి నీ జనకుండు నిన్ను యువరాజ్య పట్టభద్రుఁ జేయఁ దలఁచెఁ గాన సీతాసహితుండవై యథావిధి నుపవాస మాచరించి శుచిర్భూతుఁడవై జితేంద్రియత్వంబున భూమిశాయివి కావలయు నిఁక రాజసాన్నిధ్యంబున కరిగెద; నీవు ప్రాతఃకాలంబున రాఁదగు. 83

క॥ అనియు రథారోహణ మొ
య్యన నొనరించి పయనంబు ♦ నయ్యె జగన్నా
థుని గురుచంద్రుఁడు దశరథ
జననాయకు చెంతకపుడు ♦ సంయమివరుఁడుక్. 84

క॥ మాయారహితేశ్వరుఁ డగు
నా యమలుఁడు రామచంద్రుఁ ♦ డాపార్శ్వమునక్
బాయక తిరిగెడు లక్ష్మణు
నాయెడఁ గని యనియె మంద♦హాసముతోడక్. 85

సీ॥ భాసుర యువరాజ్య♦పట్టాభిషేకంబు
రేపె కాఁగలదు నా ♦ కేపుమీర
సాక్షిమాత్రిమె నేను ♦ సామ్రాజ్యభోక్తవై
కర్తవై చెలఁగు ము♦త్కర్ష మెఱయ
మునివరోక్త విధంబు ♦ భూమీశ్వరాజ్ఞయుఁ
జరుగు నిశ్శంక వి♦శ్వాస లీల
మద్భహిఃప్రాణమై ♦ మనువాఁడ వీ వన్న
మాట చిత్తమునందు ♦ మఱువవలదు
తే॥ నేల నాలుగు చెఱఁగుల ♦ నోలి ప్రూని
శిష్టసంరక్ష ప్రత్యక్ష ♦ దుష్టశిక్ష
భుజబలానీత సౌభాగ్య ♦ పూర్ణవిభవ
మనుభవింతము లక్ష్మణ! ♦స్వాంత మలర. 86

వ॥ అంత వసిష్ఠుండు దశరథు చెంతకు నరిగి రామసమీపంబున జరిగిన వృత్తాంతంబు బాహ్యాభ్యక్తుల భూకాంతుసాన్నిధ్యంబున గడువడి భాషించి యతిముదంబున నున్నంత. 87

క॥ రేడు వశిష్ఠుని తోడుత
నాడిన రామాభిషేక ♦ మతిభక్తి భటుల్
వేడుక చాటింపించిరి
వాడని రాజాజ్ఞ వాడ ♦ వాడల నగరిన్. 88

తే॥ దశరథావనినాథుండు ♦ విశదగతిని
గురుని మ్రోలను బలికిన ♦ వరుస నొకఁడు
బరగ రామాభిషేచన ♦ వార్తఁ దెలిపె
నాసుమిత్రయుఁ గౌసల్య ♦ యాత్మ నలర. 89

మ॥ విని కౌసల్య సుమిత్ర రాఘవున కీ♦విశ్వంపుఁ బట్టాభిషే
చన వార్తాళుల మానసాబ్జముల వి♦స్తారంపుటానంద వా

సన హర్షాశ్రులు లీల రాలియు గుచా◆స్థానంపు హారాళిలో
ననువై నాట్యములాడఁ గన్పడిరి బ్ర◆హ్మానంద చిన్మూర్తులై. 90

తే॥ హర్ష సంపూర్ణహృదయులై ◆ యధిపుసతులు
బరగ శుభవార్తఁ దెలిపిన ◆ వాని కిడిర
మూల్యరత్నహారమ్ము స◆మ్మోద మంద
వినఁగ విందగు పలుకులు ◆ బ్రీతి నిడవె. 91

తే॥ సరవిఁ గౌసల్య పుత్రవ◆త్సలత మెఱయ
లక్ష్మిఁ బూజించె సద్భక్తి ◆ లలిఁ జెలంగ
రామునకు నర్థసంసిద్ధి ◆ రాజిలంగఁ
తనయు నుత్కర్షతల్లుల◆కెనయు టరుదె? 92

తే॥ సత్యవాదియె దశరథ◆క్ష్మావనీశుఁ
డతివ! యట్టులె యిటఁ బ్రతి◆శ్రుతమునయ్యెఁ
గాని కైక వశుండయ్యెఁ ◆ గాముకుండు
నేమి చేయంగనోపెడి ◆ నిర్ధరిత్రి. 93

క॥ కొందలపడెడు మనంబున
బొందుగఁ గౌసల్య యపుడు ◆ పూజ లొనర్చెన్
నందిత భర్గం దుర్గం
గందని సద్భక్తియుక్త◆కరణావళిచేన్. 94

— ◆ దైవవాణి ◆ —

వ॥ భూలోకంబున నిటు రామయువరాజ్య పట్టాభిషేక ప్రయత్నంబు జరుగుచున్నంత దేవలోకమ్మున నిర్జర సమూహంబులు బెండువడిన మనమ్ములగల తొందరలఁ గలకలం బాది యాదరు పయనమై వలిమలల్లుం డగు గట్టువిల్తునిఁ గాంచ నరుగ నిశ్చయించి చని కైలాసంబునఁ ద్రిభువన పావనీ కృతవియద్గంగా తరంగ పరిభాసిత పింగళ జటామకుట పరివలయిత బిలేశయశిరోమణిరుచి నర్తన శితశరీర విలసితుండును, శిరశ్చంద్రికా ధౌత విశ్వంభరుండును నాగసూత్రి నాగ

కంకణ విరాజితుండు తన వామాంకస్థిత గిరిజాతరుణీమణితో నిష్టకథా గోష్ఠి విచ్చలవిడి జరుపుచుఁ బ్రమథగణంబులు సేవింపుచుండ బ్రహ్మేంద్రాద్యమరగణమ్ము లొక్కపెట్టున నకస్మా త్ప్రళయకాల భయకంపాయిత చిత్తమ్ముల గుమిగూడి కలకలధ్వనుల భూనభోంత రాళము లొక్కటై చెవుడు క్రమ్మ నావరించి, కృతాంజలి బద్ధులై కొలువుసావడిఁ జేర సాక్షాదీశ్వర సందర్శనంబునఁ దొందరలు మాని వక్ష్యమాణ విధానంబున విన్నవింపఁ దొడఁగిరి. భూలోకమ్మున నిక్ష్వాకు వంశవారాశి చంద్రుండగు దశరథునింట నవ్వనజనాభుండు జన్మించి పొలసుఁదిండ్ల మాయించి నిర్హేతుకజాయమాన కరుణా కటాక్షమ్మున నిరుపద్రవ తపోనిష్ఠా మానససరోవర విలసితానంద వీచికా డోలికలఁ దూగాడు రాజహంసలగు సంయమీంద్రుల భయమ్ము వాపి దేవ కార్యమ్ముల సమ్మతి సమకూర్పఁ దలంచినాఁడని సంతసించుచుండ, నా దశరథాధీశుండు దన తనయునకు యువరాజ్యపట్టాభిషేకంబు డంబు మిగుల నొనరింపఁ బ్రయత్నించె; నింక మన కెల్లర కీ నిష్కారణ ముష్కరదనుజ బాధ తప్పదాయెనే యని మార్గముల వీడి యేచక్కి దిక్కుఁ గానక యంధకారబంధుర కంటకావృత కాననమ్మున దారిగానని వారి చందంబున నుండ మా చిత్తమ్ముల నీవు దోప లోకోపకార కారణ తరంగ రంజిత హృదయజలధి వనియు, దేవ బ్రహ్మర్షి కార్యమ్ముల జక్కఁజేయ సమర్థుండ వనియు, భవన్నామసంస్మరణమాత్ర సకల సుఖ సౌభాగ్యంబుల నొడఁగూర్చు మహామహుండ వనియు, నీహృదంతరంబున నిరంతరంబు దనుజమత్తమాతంగ పంచాననుండును బుండరీక నయనుండు నగు నారాయణుండు నివసించు ననియుఁ దచ్చిత్తకోటరమ్మున జిరనివాసంబు నేర్పరించుకొని యెల్లప్పుడు నుల్లాసమ్మున నీవు సంచరింతు వనియు నిగమ సంతతు లొక్కమొగి నుక్కుమిగిలి యుద్ఘోషించుచుండు. దానం జేసి నీయుండఁ జేరితిమి. తగువిధానంబు నుద్యమించి భువనబాధ నివారింపవే, యన శూలి వారల నీక్షిం

చి మున్ను నలువతో వెన్నుండు భాషించిన తెఱఁగున్న దే నేమి
యొనర్పఁదగు నది వినుండు. 95

కII హరి దనుజరిరంసకతన్
ధరణి నయోధ్యను జనించి ♦ దశరథు నింటన్
సురమునిజనసంతతికిం
గరము ముదమ్ము నొడఁగూర్పఁ♦గాఁగల ననియెన్. 96

కII రాముఁడు నాఁ బరగియు లో
కామయ మెల్లను హరించి ♦ యసురుల జంపున్
భూమిఁ జరించియు రక్కసి
గీములె లేకుండ వారిఁ ♦ గీటడగించున్. 97

కII మనమంత దాక యెట్టులొ
మనియుందము పుణ్యజనుల ♦ మది కెక్కిన ప్రీ
తిని జప తపములఁ జేయుట
యును మాని భయంబు నూని ♦ యసురులతోడన్, 98

కII అనిభాషించె విరించియుఁ
జనియె మహాయుగము లట్టె ♦ సమయం బిదె వ
చ్చెను శుభలక్షణము లివే
కనుపట్టుచు నున్నవింకఁ♦గనలకుఁ డయ్యా. 99

వII ఆ దశరథావనీపాలతనూజుం డగు రామ హృదయారామ
ముల నివసింపఁ బ్రార్థించి మన దేవవాణిం బనిపితి మేని సకలకార్యం
బులు కొనసాగఁ గలవు. బహిరంగ కృత్యంబుల మన మేల నిందాపా
త్రులము గావలయు నన విని దేవత లానందబాష్పతిలకాక్షంబుల
నాయమ నుద్దేశించి. 100

కII రామాభిషేక విఘ్నము
నీమది భావింపవమ్మ ♦ నీరజభవుఁడుం

బ్రేముడి భాషించిన విధి
రామామణి దేవవాణి! ♦ రాజితలీలన్. 101

క॥ అటవిఘ్నసముత్పన్నము
పటుగతి సౌదాశ ధాత్రి ♦ వాసిలి వెస నీ
విటఁ జేరుము శుభవాణీ
చటులత సమయానుకూల ♦ సంగతవు కదా! 102

వ॥ అని వినయపురస్సరంబుగ నాయమం బ్రస్తుతించి ప్రియా ణోన్ముఖురాలిం గావించి పిలింపులు దమ నివాసమ్ముల కేగి; రంత న య్యాకాశవాణియు మానవదృగ్జాలంబుల కగోచరరూపధారిణియై యంబరంబు డిగ్గి మర్త్యలోకంబుఁ బ్రవేశించి యచ్చటచ్చట ముచ్చటలు గొలుపు పుర నగర గ్రామ జనపద కాంతారంబులఁ దిలకించి యజ్ఞానావృత మేదినీవలయ జనసందోహంబుల సందడుల వినుచు నెటఁ గాంచిన నంచిత మణిజాల పల్లవతోరణ విలసితంబు లగు మందిరంబులు మృగమదాది సుగంధవస్తు పరిమళంబు వెదఁజల్లుచు సకలమంగళ కళా శోభాయమాన నవవిధవాదిత్ర సుందరంబులు సువర్ణమణిగణ విరాజితంబు లగు నుపాయనమ్ములఁ గొని మనమ్ముల శ్రీరామపట్టాభిషేకం బని డంబుమిగులు ముదంబున మందమందగమనంబుల నిందుసుందర వదన లగు మదనాగ మనోజ్ఞయానలు నొకళ్లొకరిఁ దొందరించుకొనుచుఁ జనుచుండ నీక్షించి వీర లీపనికిం దగరని మెల్లమెల్లన నడుగు లిడుచుఁ గేకయ రాజతనూజ నివసించు మణిమయసౌధ పరిసరంబులఁ జరియించుచుండఁ దన చెయువులఁ జక్కఁ బెట్టఁగల కైకా ప్రియ పరిచారిక యగు మంధరం గాంచి యాకెయం దియ్యంబరవాణి ప్రవేశించె; నంత నాకుబ్జ. 103

—♦ మంధర కైకకు దుర్బోధనలు జేయుట ♦—

సీ॥ గూనియు మిడిగుడ్లు ♦ గొంతు కొక్కెరగొంతు
నడుము వంకర లావు ♦ నడ్డిముక్కు

వ్యత్యస్తపాదముల్ ♦ భాండోదరంబును
దృష్టి వాయసదృష్టి ♦ చేబిగొట్టు
దీర్ఘదంతంబులు ♦ దేరని కోపంపు
టాస్యంబు దుమదుమ ♦ లాడుచుండ
దను వింగ లమ్మాన ♦ దనరి చింపికినెత్తి
వడకు రోగము చీము♦వరుస కనులు
తే॥ దనరి క్షామదేవత యన♦తార మెత్తి
వసుధకుం డిగ్గి దనుజుల ♦పాలి మిత్తి
యనఁగ దుర్గంధబంధుర ♦ యాడితొత్తు
మంధరాభిధ యుందంద ♦ మసలి మసలి. 104

వ॥ కైకయాత్మజ నివసించు సౌధంబున కరుదెంచి సోపానంబులు గడగడలాడఁ దడబడ మేడపై కుటికి నలుదిక్కుల నిక్కిచూచి చుఱచుఱచూపుల నధోదృష్టి నిగిడించి ధాత్రింగాంచి సర్వతస్సమలంకృతమై పురమెల్ల నానాతోరణ విలసిత పతాకవిరాజిత సకలోత్సవ సమాయుక్తముగా మది నెఱిఁగి బిరబిర సౌధంబు డిగ్గి, పట్టపగ్గంబులు లేని వేగంబున రాలు నగ్గగు చందంబున ధింధిమ్మని భూమి యదర నడచుచుఁ గార్కొతురకంపాయమాన దేహంబున గించి దవనత శిరస్కయై యాకైకతో. 105

సీ॥ శృంగార మొనరించి ♦ రింపుగ నగరెల్ల
నూతనోత్సవసమా♦యాత హృదయ
జనసమూహంబులు ♦ చనుచున్న వారలు
గౌసల్యా హా ర్ష సం♦గతియు నగుచు
విప్రముఖ్యుల కెందు ♦ వివిధాంబరంబుల
సంఖ్యాకముగ నిచ్చు ♦ సరణిఁ గంటి
మదవాగయాన! నా ♦ మది నెఱుంగఁగఁ జెల్పు
మావిధ మెల్ల నా ♦ కనిన నంత

తే॥ నామె మంథర కిట్లనె ♦ నాత్మ నదుర
రామచంద్రాభిషేచనం ♦ బేమొ నీకుఁ
దెలియదా? రేపె యూరెల్ల ♦ లలితగతి న
లంకరించుట లందుకె ♦ పొంకముగను. 106

ఆ॥ వె॥ అనియు ధాత్రి పలుక ♦ నతి కుబ్జ మంథర
మది నసూయ తవుల ♦ నదిరి, కోప
మినుమడింపఁ గైక ♦ యింటికి వ్వాన
వ్రాలె వడిశలోని ♦ రాయి నాగ. 107

వ॥ ఏకాంత పర్యంక పర్యవస్థితయు విశాలాక్షియు నగు కైకే
యింగాంచి దేవవాణీసమాకృష్టచిత్తయై మంథర యేమే! దుర్భగురాలా!
మూఢురాలా! మహాభయం బిపు డుత్పన్నంబైనది యెఱుఁగవా? మం
దబుద్ధివి నేనె యందగత్తె నని విఱ్ఱవీగెద వంటివి. నిన్నుఁబోలిన తెలివి
మాలిన వార లేరు లేరు. 108

తే॥ రేపె రామాభిషేచనం ♦ బేపుమీఱు
గాంచు దశరథవిభు ననుఁ ♦ గ్రోహముకతన
నవిన విని లేచి శీఘ్రంబ ♦ యవని నాథు
కాంత ప్రియవాదినియునైన ♦ గైక యపుడు. 109

తే॥ రత్నభూషిత సౌవర్ణ ♦ నూత్ననూపు
రంబు దివ్యమౌ దాని హా ♦ ర్షంబు మీఱ
మంథరకు నిచ్చి మోదస ♦ మ్మాన్యసమయ
మందు నేలొకో మతిభయం ♦ బంచు వనియె. 110

తే॥ భరతు కన్నను లాఘవుం ♦ డరయ నాకుఁ
బ్రియుఁడుఁ గూర్చు ప్రియుంవమం ♦ డయుతవిభులఁ
గాంచుఁ గౌసల్యకంటె సు ♦ త్కార్ష మెరయ
నమిత శుశ్రూష లొనరించు ♦ నతఁడె సుతుఁడు. 111

వ॥ మూఢురాలా! రాముని వలన నీ కేమికీడు మూడె, నన నకా
రణవైరిణి యగు కుబ్జ. 112

మ॥ నిను మోహించి ప్రియాప్తవాక్యములచే ♦ నిన్నీ ముఖస్తోత్రముల్
మన మొప్పంగ నొనర్చుచుండు నెపుడున్ ♦ మన్నించి ప్రేమించు మిం
చిన మోహంబును గల్గఁజేయు వచన ♦ శ్రేయోక్తు లర్పించి రే
డనదత్కార్య పరార్థ కాముకుఁడు గాఁ ♦ డా? సత్యసంపన్నుఁ డా. 113

క॥ ఇఁక నీ శ్రేయముకొఱకే
ప్రకటించి తకల్మషాప్త ♦ వాక్యము నీకున్
ముకుళితహృదయా! మణిరూ
పకళిఖపరిధానగుప్త ♦ భావాకైకా! 114

మ॥ అల కౌసల్య కనంతవైభవ సుఖో ♦ గానందతావాప్తి ని
శ్చలతం గూర్పఁదలంచి రాఘవున కీ ♦ సర్వంసహాచక్ర ము
జ్జ్వలమోదమ్మున గట్టనెంచె ముఖవా ♦ చస్ఫూర్తి దీపింప ని
స్చలతింజేసి మనంబునం దెలియు మ ♦ మ్మా ఉన్న సందర్భమున్. 115

తే॥ ఇదియు మనమందు నునిచి తా ♦ నెపుడొ భరతు
నంపె శత్రుఘ్నుఁ దోడిచ్చి ♦ యరయు మీ వె
మేనమామగారింటికి ♦ మేదినీశుఁ
డనియు దుర్బోధలను జేసె ♦ నవసర మని. 116

తే॥ కన సుమిత్రకు మంచియె ♦ కలుగఁగలదు
లక్ష్మణుఁడు రాము నెడఁబాసి ♦ లలి మెలంగఁ
జనఁడు కావున సామ్రాజ్య ♦ మనుభవింపఁ
గలఁడు సందియంబిం దేమి ♦ కలదొ చెపుమ. 117

క॥ భరతుఁడు రాఘవుకడఁ గిం
కరుఁడే కాగలఁడొ లేక ♦ కానల నుండం
బురినుండి యనుపఁబడునో
మరి ప్రాణత్యాగవిధికి ♦ మార్కొనఁ బడునో. 118

తే॥ నీవు కౌసల్యదాపున ♦ నియతిఁజేరి
పరిచరింపుచు దాసివై ♦ బ్రతుకవలయు

గన సపత్నీ పరాభవం ♦ బొనరుకంటె
ప్రాణనిధనంబె శ్రేయస్క♦రంబు సతికి. 119

క॥ కావున దూరపు దృష్టిని
భావించియు వైళమ యది ♦ పటుతర బుద్ధిన్
గావించి సుతుని జీవన
మేవంచన లేని యంచి ♦ తేచ్ఛను గనుమా. 120

చ॥ అనవరతానురక్తి భర♦తాఖ్యు ధరాధిపుగా నొనర్చు వే
డ్కను నవపంచవర్షము♦లు కానల రాముఁ బ్రవాస పద్ధతిం
జనుగతిఁ గాంచితేనియు వి♦శాల ధరాతల మేలురాణివై
మనెదు గురూపదిష్టము సు♦మా యిది కాదన జెల్ల దెల్లెడన్. 121

వ॥ ఈ విధానంబున నీ పుత్రుండు సాకేతరాజ్యంబున దృఢతరుఁడగు, నీవు రాణి వయ్యెద, వప్పటికీ వభయవనఁ దగినెడ వేనొక్క యుపాయం బెఱింగించెద, నిదివఱకె మది నెంచియుంటి. మున్ను దేవాసురసమర సమారంభ కాలమున మహారథుం డగు నీనాథుం డాఖండలసహాయార్థము నీతోఁగూడనరిగి యుద్ధసన్నద్ధుఁడై పొలికలని బోరు సమయంబున రథాక్షకీల ధరణిఁబడిననదియాతఁడెఱుంగకయున్నను నీవు ధైర్యంబున దత్కీల రంధ్రంబున నీ కరంబు జొనిపి పతిప్రాణపరీప్సను యుద్ధావసాన పర్యంత మున్నప్పు డా యరిందముఁడు రాచేసుల నెల్ల గొల్లఁగొట్టి నిన్నీక్షించి పరమాశ్చర్యంబు నంది ముదంబున వీరురాలవగు నిన్నాలింగనం బొనరించుకొని నీ మనోవాంఛ నెఱవేర్తు నెవ్వియేని రెండువరంబులఁ గోరుమని జనవిభుండు స్వయముగా భాషించె. నా సమయంబున నీ వాసంగ నెంచిన వరయుగళంబు న్యాసభూతంబుగ నీ యొద్ద నుండనిమ్ము నా కవసరము గల యప్పుడు కైకొనెదనన నీ ప్రియనాథుండు సమ్మతించి మందిరంబునకుం జను మనియె నని ప్రస్తావనావశంబున నెప్పుడో నీవె నాచెవిని వేసియుంటి, విప్పుడు స్మరణకు

వచ్చె. నీవప్రియత్నంబున కావరంబులు సహాయకరము లగు గాక రోష పూరిత హృదయుఁడై క్రోధసాధంబుఁ బ్రవేశించి.

—♦ మంథరోపదేశము ♦—

సీ॥ భూషణావళి దీసి ♦ భూమిపై వెదఁజల్లి
మానముదగ్గను బూని ♦ మహితలంబు
శయ్యగాఁ జేకొని ♦ సత్వదృష్టిని మాని
యసహాయకూరప♦ర్యాప్త వగుచు
వసుధాధినాథుండు ♦ ప్రీతినక్కై సత్యంబు
బాటించు పర్యంత ♦ మోటువడక
యాచరించెన వేని ♦ యభిమతార్థంబులు
సమకూరు నీకు నీ ♦ సమయమందె
తే॥ తథ్య మీమాట బాటింపు ♦ తరుణి నిన్ను
నత్తవారింటికిని బంపు ♦ నపుడు నన్ను
నీకుఁ బ్రియదాసిగాఁ బంపె ♦ నీదుతండ్రి
దాన బోధింతు హితమిదే ♦ తరుణ మగుట. 122

మ॥ అని బోధింపఁ ద్రివక్ర సర్వమును ♦ తథ్యంబంచుఁ గైకేయి తా
ననుమానింపక యుక్తియుక్తమని గ్రా♦హ్యంబంచు మేలంచు ని
చ్చను భావించుచు నాచరింపఁజనె దు♦స్సంగాహితభ్రాంతి నే
పనిఁ జేయర్ వెనుదీయ రెంతటిఘనుల్ ♦భావప్రమాదంబునన్. 123

వ॥ కైకేయి మంథరంగాంచి తదుపదేశావేశమ్మున.

క॥ నీ కీదృశబుద్ధు లిటం
బ్రికటముగ నలరె నెటుల ♦ భామిని! యీదృ
గ్లోకోత్తర బుద్ధిచయ
స్వీకృత వీ వనుచుఁ జెప్పఁ ♦ జెల్లును ధాత్రిన్. 124

క॥ భరతుండు వసుధాపతియై
సుచిరగతి నున్న ఏక్రి♦సుందరి! నాకుం

గురిఁగాంచెఁ బ్రాణవల్లభ
పరయును గ్రామశతకంబు ♦ నడుగక యిత్తున్. 125

క॥ అని కోపభవనసీమకుఁ
జన రోషము సాహసంబు ♦ శౌర్యముతోడై
జననాథుసుందరీమణి
పనిగొను కార్యం బొనర్పఁ ♦ బయనంబయ్యెన్. 126

సీ॥ తొడవిన బొమముడిఁ ♦ దొడవులెల్లను వీడి
పుడమిపై విదలించి ♦ యొడలు విఱిచి
కన్నులెఱ్ఱఁగఁ జేసి ♦ కడువడి మలినమౌ
వసనంబు ధరియించి ♦ పైఁట చెఱఁగుఁ
దైఁగప్పి భూమిపైఁ ♦ బవళించి జడ విచ్చి
యతికోప దృష్టుల ♦ నొడుగఱచి
ముఖసరోజము రక్త ♦ పూర్ణమై పనఁజూప
పటపట దంతముల్ ♦ పనవి కొఱికి

తే॥ రాముఁ డడవికిఁ జనుదాక ♦ భూమిశయ్య
విడువ; గాకున్న బ్రాణముల్ ♦ విడువ నెంతు
వినుము నాప్రతిజ్ఞ నాశక్తి ♦ విదివిఁగాంచు
తలఁచి ప్రేమించు నాప్రియ ♦ దాసి వీవు. 127

వ॥ ఇట్లు సాకారయగు కోపదేవతభాషింప నాగూనిది కన్ను గారఁ గాంచి సంతోషించి కల్యాణీ! నీవీ నిశ్చయంబునను న్న నీభ ద్రింబగు నేను మా యింటిదాక జనివత్తునని యేగె. నా కేకయనందిని;

తే॥ వక్రసుందరి యుపదేశ ♦ వాక్యసరణి
నంచితాత్మని మదినెంచి ♦ యాదరించి
యాచరించెను అబల పే ♦ రవనిఁగాంచఁ
గైక కేకాసుతవర దే ♦ శాంతలఱుమ. :9

సీ॥ వరదయానిత్యుఁ డైన ♦ బండితుం డైనను
నీతి ధర్మవిచార ♦ నియతుఁ డైన
విధివాదదేశిక ♦ విద్వాంసుఁ డైనను
విద్యావివేక సం♦విదుఁడు నైన
వసుధాధిపతి యైన ♦ బలశౌర్య సాహస
వీర్యవంతుం డైన ♦ విజ్ఞుఁ డైన
సద్గుణాన్వితుఁ డైన ♦ సత్యభాషణుఁ డైనఁ
సతత దైవిక తప♦శ్శాలి యైనఁ

తే॥ గాని యతిపాపభావిత ♦ మానసు లగు
దుష్టులనుగూడి మెలఁగఁ ద♦ద్బుద్ధి నెపుడు
మదిని భావించి క్రమముగా ♦ మహిని జెడును
జనుఁడు తత్సామ్యముఁగ నౌట ♦ సందియం బె? 130

క॥ కనుక పరిత్యాజ్యము దు
ర్జనసహవాసంబు దుష్ట ♦ సహవాసము చే
తను స్వార్థంబునఁ జెడుదురు
మనుజాధిపుపుత్రిమాడ్కి ♦ మనుజులు ధరణిన్. 131

—♦దశరథుఁడు మంత్రియుతుఁడై కైకయింటికిఁ జనుట♦—

తే॥ అటమహాదేవుఁ డత్యంత ♦ మైన ప్రేమ
నద్రిజాతను వీక్షించి ♦ యనఁగఁదొడఁగె
నంబ! రామాభ్యుదయ కార♦ణంబువలన
దశరథేశుండు తనమంత్రిఁ ♦ దనరఁబిలిచి. 132

క॥ సానందహృదయుఁడయ్యును
మానుగ సచివాళిరా న♦మందగతిం గై
కానివసిత సౌధమునకు
మానవనాథుండు జనియె ♦ మానిని వినవే. 133

తే॥ అచటఁ బ్రియురాలిఁ గానక ♦ యవనివిభుఁడు
విహ్వలుండయి యిదియేమి♦ప్రేమతోడ
మందిరంబున లేదు నా ♦ సుందరాంగి
యనియు సత్వర భ్రమమాణుఁ ♦ డగుచు నపుడు. 134

వ॥ ఏను స్వకీయ మందిరంబుఁ బ్రవేశించుటకుమున్నె నావన్నె లాఁడి హాసన్ముఖియయి ప్రతీక్షించుచు సౌధాంగణమ్మునను౦డు మత్త హంసవధూగమన యగు మంగళాంగి యిట నదృశ్య యగుటకుఁగారణం బేమియని విడూయమానహృదయుండయి చింతించుచు దాసీనిక రంబు నీక్షించి. 135

క॥ మీదేవి మంగళాత్మకి
సాదరమున గాంచ వచ్చు ♦ సనయము నన్నుం
రా దిత్తఱి ప్రియదర్శన
యేదీ ప్రియురాలు లేదు ♦ యేదీ రాదే? 136

క॥ అనదాసీతతి జనవిభు
గని క్రోధసదనమునందుఁ ♦ గల దా యమ మా
కును గారణమ్ముం దెలియదు
చని మీర లడుగ నిజంబు ♦ చక్కఁగఁ దెలియున్. 137

క॥ అని భాషించిన దాసీ
జనములు విని భూపతి భయ ♦ సంభ్రాన్తుండై
చనె నామె సమీపమునకుఁ
గన ధైర్యరహితులుగారె ♦ కాంతావశగుల్. 138

ఆ॥ దీనవదనుఁ డగుచు ♦ మానినీమణి చెంతఁ
గూరుచుండి ధృతియుఁ ♦ గూల నాకె
మేను నిమిరి చేత ♦ నెల్లంగఁ బ్రేమను
బల్లవాంగిఁ గాంచి ♦ పలికె నిట్లు. 139

ఉ॥ ఏల సరోజనేత్రి! యిటు ♦ లీకతినంపు ధరిత్రి శయ్య గా
నేల మరాళయాన! యివు ♦ డీవిధి గోపము నిర్ణయింపఁగాఁ
జాలని చింత నందెదవు ♦ చానరొ! మాసినకోకఁగట్టినా
వేల సుభూషణావళుల ♦ నేటికి వీడితి వంబుజాననా! 140

మ॥ అవమానించుటె నన్ను దుఃఖమది యే♦లా ? బాల! నీకిప్పుడో
యువిదా ! నీదగు వాంఛితం బెదియొ యిం♦ పొప్పంగ భాషింపుమే
నవిలంబంబునఁ గూర్చెదన్ సకలరా♦జ్యప్రాజ్యరక్షాకర
వ్యవహారంబులమాని కాంచు మిదె యు♦ద్యద్రాజబింబాననా!141

—♦ దశరథ శపథవాక్యము. ♦—

తే॥ అహితులెవ్వరు నీకు నీ ♦ యవనిఁ దెలుపు
పురుషుఁడో మరి వనితయో ♦ పువ్వుఁబోఁడి
కను మదండ్యుం డవధ్యుండు ♦ గాని వధ్య
శిక్ష విధియింతు నీకోర్కె ♦ చెల్లునట్లు. 142

చ॥ జలధులు నేలరైన గిరి♦సంతతికూలిన నింగి వ్రాలినన్
జలజలరాలినన్నుడులు ♦ చంద్రదినేశులు పోవుమార్గముల్
తొలఁగిన ధారుణీతలము ♦ ధూళియు నైన భవత్ప్రియంబు ని
శ్చలగతిఁగూర్తుఁ దెల్పుటకు ♦ సంశయమేల కురంగలోచనా? 143

క॥ వనితా! నాస్వాంతము దెలి
యును నీకుఁ బ్రియుండ నౌచు ♦ నుండుటయును నీ
వు నసూయామతి నను వెత
లను బెట్టెదు వ్యర్థమయ్యె ♦ శ్రమయిది యెల్లన్. 144

క॥ వనితా! నీవశమానసుఁ
డనియును బలసారమెల్ల ♦ నరయుమి నీదే
యని చను నస్నిగతిగాఁ
గనలింపఁగ నేల నీవు ♦ కడుమతిలఁ బడన్. 145

సీ॥ తరుణిరో! నీప్రియం ♦ కరుఁడైన నెవ్వని
ధనహీను ధనికుఁగాఁ ♦ దనుపవలయు
బాల! నీ కహితు నె♦వ్వని ధనవంతుని
ర్ధనునిఁగాఁ జేయంగఁ ♦ జనఁగవలయు
నెవ్వని వధియింప ♦ నీక్షింతు విప్పుడు
వధియింపఁదగని యా ♦ భృత్యుఁ డెవఁడు
పెక్కుమాట లిఁకేల ♦ ప్రియురాల నీకు నా
ప్రాణంబులైన న♦ప్పన మొనర్తు
తే॥ ప్రాణములకన్న నాకు నీ ♦ రామచంద్రుఁ
డధికవిశ్వాసి శపథమే ♦ నతనిపైని
చేసి భాషింతు నిక్కంబు ♦ చేయఁదగిన
హితము నీకేది యారాముఁ ♦ డింపు సాక్షి. 146

క॥ వనటను గుందఁగ నేలా
వినలేదా? నాదుమాట ♦ ప్రియతము డీ రా
ముని యెదుటనె యింకొకపతి
వినుమా! యనుమాన మేల ♦ ప్రేమను గనుమా. 147

క॥ అని రాముని సాక్షిగ నను
జనవిభు వాక్యంబుఁ గైక ♦ శ్రవణానందం
బున విని యిట్లనె మెల్లన
గనులు దెఱచి చూచి లేచి ♦ కలమోదమునన్. 148

తే॥ నీవు సత్యప్రతిజ్ఞయే ♦ నెఱవు చేని
శపథ మనుమాట పాటించి ♦ జఱిపి తేనిఁ
బెంపువడయంగఁ గోర్కెఁజె♦ల్లింపఁగలవు
సందియం బెందు కేఁక రాజ♦చంద్ర నాకు. 149

మ॥ మును దైవాసురయుద్ధమందు నిను నే ♦ పూర్ణమూర్ఛఁ గాపాడఁగం
గని సంతోషమునన్ వరంబుల నొసం ♦ గన్ లేదె? యవ్వాని నా
కు నిమిత్తంబగు నప్పుడియ్యుమనియుం ♦ గోరంగ మీ చెంతఁదా
చిన సందర్భము మీ తెఱుంగరె యిఁకం ♦ జెప్పంగ నేముండెడిన్.

తే॥ రెండువరములు నీచెంత ♦ నుండెఁగాదె
న్యాసభూతంబు లయ్యెవి ♦ యవనినాథ!
తదుప యోగకాలం బిదె ♦ తరలివచ్చె
నోర్మి నొసఁగంగ యాచింపు ♦ చున్నదాన. 151

క॥ అందునఁ బ్రియసుతు భరతుని
బొందుగఁ జతురబ్ధివలయ ♦ భూమీతల మే
లందగు యువరాజుగఁ జే
యం దలఁపఁగవలయు మీర ♦ లవసర మదియున్. 152

క॥ అతులిత గతి నిఁక నీ సం
భృత సంభార వితతుల న♦భిమతంబుగఁ బ్రి
స్తుత మభిషేకింపఁగ నా
కతిమోదము చేతులొగ్గి ♦ యాచింతు విభూ! 153

క॥ వర మింకొక్కటి రాఘవుఁ
డరయఁగ నతివేగ దండ♦కారణ్యములం
దిరిగి వసింపఁగఁ జనఁగా
వరియించితి రేపె యేగ♦వలయు మహాత్మా! 154

సీ॥ మునివేషము ధరించి ♦ పూని జటావల్క
లాజినమ్ములను మ ♦ దభిమతాప్తిఁ
బదునాల్గు వర్షముల్ ♦ పరిపూర్తి దండకా
రణ్యభూముల యందు♦రామవిభుఁడు
ఫలకందమూలాది ♦ భక్షణ మొనరించి
ఘనతర కాంతార ♦ కంద ఖనన
వృత్తి నావల వీటి ♦ కింపొంద రావచ్చు
మనవచ్చు హాయిగా ♦ మహితవనుల
తే॥ వాస మొనరింపఁగావచ్చుఁ ♦ బ్రత్యహంబు
మునుల సేవింపవచ్చు రా♦ముఁడు మహీశ!

యస్మదిష్టానుసరణి నే ♦ డరుగుఁ డుదయ
మగుటకును మున్నె యేగింపుఁ ♦ డతని వనికి. 155

తే॥ ఆలసించిన నేను నీ ♦ మ్రోల విడుతుఁ
బ్రాణములఁ; దప్ప దీమాట ♦ రాజచంద్ర!
నీవు సత్యప్రతిజ్ఞయే ♦ నిలుపఁ దలఁప
నిదియె యత్యంతమగు వాంఛ ♦ యదియె ప్రియము. 156

మ॥ అన నాదారుణవాక్యపాతమహ దా♦యాసంపు నిట్టూర్పుఁ జెం
దిన భీతిం దనురోమహర్షణత నా♦తీక్ష్ణంపు వజ్రాయుధం
బున భూభృత్పతి బడ్డ చందమున బెం♦పుందూలి ధాత్రీశుఁ డా
య్యాన మూర్ఛిల్లె ధరిత్రిపై నబల లా♦హా! యెట్టి క్రూరాత్మలో? 157

వ॥ అంత మహీపాలుండు మెల్లమెల్లన నేత్రోన్మీలనంబు
గావించి మహాభయంబున. 158

మ॥ అనిమిత్తంబు నదృష్టపూర్వ మిదియా ♦ హా! లేక దుస్స్వప్నమో
ఘనమాంద్యం బొకొ చిత్తవిభ్రమ మొకో ♦ కాకున్న ప్రాణాంత్య సం
జనితాయాసమొ దైవమాయయొ పిశా♦చగ్రస్త చిత్రం బొకో
యని యోజించుచు ముందునున్న సతినిన్ ♦ వ్యాఘ్రాకృతిం గాంచియున్

ఉ॥ ఇంతి! యి దేటి మాట వచి♦యించెద విప్పుడు నీవు నాదు ప్రా
ణాంతసమాన వాక్యముల; ♦ నాతఁడు నీ కపరాధ మేమి తా
స్వాంతమునం దొనర్చెను మ ♦ దగ్రమునందు రఘుప్రవీరుఁడున్
సంతత మాదరించు నని ♦ చాటుచునుందు వి దేమి వింతయో! 160

క॥ ఇలలో రాఘవు గుణముల
సలలిత సంతోషపూర్వ ♦ చతురత మెఱయన్
గలితామృత వాక్కులచే
లలిఁ జేతువు వర్ణనంబు ♦ లాలింతుగదే! 161

మ॥ తను గౌసల్యను గాంచు కంటె నిను ♦ విస్తారంపుఁ బ్రేమంబునన్
గని శుశ్రూష లొనర్చు నందువు హృదు♦త్కర్షంబు దీపింప రా

మునిచారిత్రము విన్నమాత్రమున నా♦మోదింతు వెంతో ముదం
బున నీ క్రూరవిచారమేల కలిగెం ♦ బూర్ణేందు బింబాననా! 162
చ॥ భరతునకై ధరాతలము ♦ వాసిని మీర గ్రహింపు మీవు ను
స్థిరముగ శంకయేల యిదె ♦ చేకొను రాముఁడు మందిరంబునం
దిరవుగ నుండ వేడెద ని♦జే వర మొండు ననుగ్రహింపు మో
తరుణిరో! వానికన్నఁ బ్రియ♦తత్పరు లేరిట లేరు నాకు సూ. 163
చ॥ అనియును గంట నీ రిడ న♦నంతముగాఁ బ్రసరించి కాల్వలై
చని నదియై ప్రవాహగతి ♦ జారి గభీరపు దుఃఖవార్ధియై
యినకులనాథు ముంపఁ దరి♦యింప నశక్యముగాక నావయే
యనఁదగు కేకయాత్మజప♦దాబ్జము లంటెఁ దదర్థ మాతఁడున్. 164
క॥ ఇరవుగఁ దనపతియే తన
చరణమ్ముల నంటి వేడ ♦ జలజాక్షి యనా
దరమతిఁ గనె రక్తాక్షులఁ
బరబుద్ధి వినాశకరము ♦ పాపాకరమున్. 165
తే॥ అధిప! యేల నీ విట భ్రాంతి ♦ నంది పలుకు
చుంటి; వయ్యవి నాడు నీ ♦ వుత్సహించి
చెప్పినాడ వసత్యంబు ♦ సేయ స్వీయ
భాషితము పాపగతి కాక ♦ దూషితంబు. 166
చ॥ అనువుగ నారచీరయు మృ♦గాజినమున్ ధరియించి రేపె నేఁ
గనఁగఁ బ్రభాతకాలమునఁ ♦ గానల కేగుట సమ్మతంబు; కా
దన విష మింత చిక్కదె య♦థాగతి జేసెద త్రాఁడు లేదె నా
తనువునఁ బ్రాణముల్ చనఁగఁ ♦ దప్పదు నీమది కెక్కుఁ బ్రీతిగన్. 167
తే॥ ఏనె సత్యప్రతిజ్ఞుఁడం ♦ చీవు సభల
నభినయింతువు జగతి రా♦మాగ్రమందు
శపథ మొనరించి లేదంచు ♦ సత్యపథముఁ
దప్పి నరకమున సుఖింపఁ ♦ దరలు మింక. 168

సీ॥ భానువంశమునందు ♦ పాతవ్యంగలవారు
జనియింప రనుమాట ♦ సత్య మనియు
లబ్ధప్రతిష్ఠల ♦ నబ్ధిచతుష్కావృ
త ధరిత్రి సాకేత ♦ ధరణిపతులు
వర్తింతురని పూర్వ♦పద్ధతిఁ దప్ప కీ
దశరథాఖ్యుఁ డటంచుఁ ♦ దలఁచి మెచ్చి
కేకయాధీశుండు ♦ లోకోత్తర ఖ్యాతి
నెంచి నా డీలీల ♦ నెనయి ననినఁ

తే॥ దలఁచియుండునె మృషకన్న ♦ దండియఘము
గలదె రాజచంద్రుఁడ నీవు ♦ గాంచ లోక
పతివి సత్యవాది వటంచు ♦ వాసికెక్కి
నాఁడ విఁక నేను వచియించు ♦ జాడ గలదె? 169

మ॥ వినియుం గర్ణకఠోర వాక్యము లటన్ ♦ భీతిల్లి చింతాకులం
బున మూర్ఛిల్లి మృతించెనో యన భువిన్ ♦ మోమ త్తమిల్లంగ నా
జననాథుండు నిశీధి నచ్చటనె వా♦సంబుండె సంవత్సరం
బన వెళ్ళించెను వందిమాగధులనూ ♦ రాజ్ఞం బ్రవేశించినన్. 170

—♦ పురజనులు రామపట్టాభిషేకం బని సంతోషించుట ♦—

ఆ॥ వె॥ కేకయాత్మజాత ♦ గికురించె రోసాన
వంది గాయ కాది ♦ భవ్యనుతులఁ
దనుపఁదగదు మీరు ♦ మనుజనాథునియాన
కైకకోప పాప ♦ లోకమాన. 171

సీ॥ మార్తాండు డుదయింప ♦ మధ్యకక్ష్యమునందు
బ్రాహ్మణ క్షత్రియ ♦ వైశ్య వితతి
కన్యకాజనములు ♦ ఘనచామర చ్ఛత్ర
తురగముల్ పట్టంపుఁ ♦ గరియు వార

ముఖ్యులు పౌరులు ♦ ముని జానపదవితా
నము వసిష్ఠునియాన ♦ నయమెలర్ప
సకల సంభారముల్ ♦ సంస్థితంబై యుండె
నానంద మొప్పార ♦ నా నిశీధి
తే॥ స్త్రీలు నాబాలవృద్ధులు ♦ నోలి రాము
రాజ్యపట్టాభిషేకంబు ♦ పూజ్యగరిమ
గాంచవలె నంచు మదినెంచి ♦ కాంచనైరి
నిద్రిసంతోష మెంతటి ♦ భద్రికరమొ! 172
సీ॥ మణిరత్నకాంచన ♦ మకుటకాంతులు నభో
వీధి మిత్రునిగప్పి ♦ వెలుఁగు లొప్ప
భూరికుండలకళా ♦ భుజకీర్తియుగళాభ
లా దిశాంతములందు ♦ నవఘుళింప
ఘనపీత వసనంబు ♦ ఘనదేహరుచుల వి
ద్యుల్లతాదీప్తులు ♦ పల్లవింపఁ
గందర్పశతకోటి ♦ సుందర శ్యామాంగ
ధాళధళ్యము జగ♦త్త్రియి నటింపఁ
తే॥ జనెడు కోదండదీక్షాగు♦రుని రమేశు
సర్వసన్నాహయుక్తు నీ♦శ్వరు ననంతుఁ
దలఁచి శ్రీరాము సంతోష ♦ కలితులగుట
నిద్రిఁ బుచ్చిరి నిద్రిను♦నిశిని జనులు. 173
మ॥ తన వామాంకమునందు భూమిజ సుమి♦త్రాత్రిసూతి సైదోడుగా
మన ముక్తాధవళాతపత్రిధరుఁడై ♦ మాణిక్య హారావళి
స్వన గానాది శుభోత్కరపరిభలతోఁ ♦ బట్టంపు టేనుంగుపైఁ
గనుభాగ్యంబు లభించు టెన్నఁడో కదా ♦ కంజాక్షు శ్రీరామునిన్.
చ॥ అల నిగమాది పారగుల♦నంత పురాణవిరాజితాగమో
జ్వల వరయోగకోవిదులు ♦ వారణ వాజి రథాళివాహినీ

బల నికరంబు లార్యులు న♦వార్యమతిం గొలువంగ యోగవి
ద్బల పరిపూర్ణ నిర్మల శు♦భస్కరు నెన్నఁడు జూడఁగల్గెడిన్. 175
ఉ॥ ఎన్నడు తెల్లవారు నిఁక ♦ నెప్పుడు రాముని గాంతు మోకదా
కన్నులపండువై తనరఁ♦గా నవనీరజనాభు సత్యసం
పన్నుని నీలనీరద వి♦భాసిత నిర్మలకాయు నంచు నా
పన్నత నుండువారి నెఱి♦వాపఁగఁదా రవి తోఁచెఁ దూర్పునన్.176

—♦ సుమంత్రుఁడు రాజుకడకు వచ్చుట ♦—

వ॥ అటుల నుత్సుకాత్ము లగుచు నయోధ్యావాసు లంద రున్నం
త జండకిరణుం డాఖండలదిశ నధిష్ఠించినను రాజేలొకో నిద్రావశుం
డయ్యె నని చింతించుచు సుమంత్రుండు జయజయ వర్ధమానుం డయి
నృపాభివాదనంబు లాచరించుచు నతిఖిన్నుం డయి యున్న ధరాధినాథు
నీక్షించి కైకేయితో. 177

తే॥ దేవి! కైకేయి! యీరీతి ♦ భూవిభుండు
నన్యవిధమున నున్నవాఁ ♦ డరయలేదె
మది విచారింప కుండంగ ♦ మనుట యెందుఁ
గాంచఁ జిత్రము తన స్వీయ♦కాంతు సతియు. 178

తే॥ అనిన నాయమ మంత్రితో ♦ ననియె నిట్టు
లయ్య! యీరేయి నిద్ర లే ♦ దవనిపతికి
రామరామ రామ యటంచు ♦ రాముఁదలఁచి
తలఁచి రామసంస్మరణ వి♦స్తారుఁ డగుట. 179

ఆ॥ వె॥ మేలుకొనుటవలన ♦ మేదినీశుఁడు రాత్రి
బడలినట్టు లున్న♦వాఁడు గాని
యలరకున్న నిద్ర♦ యస్వస్థుగా నుంట
సహజ మందురి వైద్య♦శాస్త్రవిదులు. 180

ఆ॥ వె॥ రాము నిటకుఁ గొనియు ♦ రయమున రా పొమ్ము
రాముఁగాంచు వేడ్క ♦ రాజచంద్రుఁ

డున్న వాఁడటంచు ♦ నురుగతి భాషించు
కైకతోడ ననియె ♦వీక నతఁడు. 181

తే॥ రాజవచనంబు వినకయే ♦ నోజమెయిని
జనుట లెట్టులు భామిని ♦ యనఁగ మంత్రి
దశరథేశుండు విని పల్కె ♦ విశదగతిని
నధిపుఁడైనను భీతిల్లు ♦ నబలలకును. 182

చ॥ అన విని భూమికాంతుఁడు ర♦యమ్మున బల్కెను మంత్రిసత్తముం
గని మునరామచంద్రు గత♦కల్మషు సుందరుఁ దోడితెమ్ము నాఁ
జనియె నతండు రాఘవునిఁ ♦ జయ్యనఁ బిల్వఁగ రామమందిరం
బునకు నుదాత్తచిత్తధృతి♦పూజితుఁడై కడు నప్రమత్తతన్. 183

—♦ మంత్రి రాముని కైచనుట - రామునితో రాజుకడకు వచ్చుట ♦—

చ॥ కనియె నన ర్ఘరత్నపరి♦కల్పవిభూషణశోభమాన దే
హుని మణిహార దివ్యమకు♦టోజ్వలకంకణ హేమవస్త్రభా
సుని రఘురాము నీశ్వరుని♦సొంపు నమస్కృతు లాచరించి భ
క్తిని రయమొప్పఁ బల్కె మది♦గిన్కయు మాని కృతాంజలుండునై.

తే॥ రామ! రాజీవలోచన! ♦ రాజచంద్రు
నాజ్ఞ వచ్చితి నిచ్చటి ♦ కధిపుఁ డిపుడు
మిమ్ము గన నెంచె వైళంబ ♦ రమ్ము లెమ్మి
యాలసింపక నా వెంట ♦నరుగవలయు. 185

వ॥ అంత రాఘవుండు సంభ్రమాన్వితస్వాంతంబున రథారోహ
ణుం డయి చని లక్ష్మణ సమన్వితుం డయి సారథి తన వెంట రా మధ్య
కక్ష్యంబున వసిష్ఠాదుల నీక్షించుచు సత్వరంబున జనకు సమీపంబుఁ
జేరి కించిన్ముకుళితవదనారవిందుం డగు దశరథు నడుగుదమ్ముల కెఱఁ
గిన రాజు సమయాకర్షితోత్కర్ష మెఱయ సముత్థితుండై ససంభ్ర
మంబున బాహుదండంబుల సారించి హా రామా! యని దుఃఖనిమగ్నుం
డై హా! రామా! రామా! యని వాపోవుచు రయంబున నంకతలం

బున రాఘవు నుంచుకొని మూర్ఛావిష్టుం డగు యొకిమీనిఁ గాంచి సకలరాజసుందరీమణులు హాహా రవంబుల నిష్కారణ రోదనధ్వనులఁ గావించిన బెండువడి పుండరీకనయనుం డుండు తఱి వసిష్ఠసంయమీంద్రుండు రోదనం బెందుల కని వారల వారించుచుఁ బ్రవేశించిన నంత రామచంద్రుండు రాజదుఃఖ కారణం బేమి యని ప్రశ్నింపుచుండఁ గైకేయి రాముం గాంచి యసిపత్రసమాన వచనమ్ములు. 186

క॥ జననాథుదుఃఖశాంతికి
గనఁగా రఘురామ! నీవె ♦ కారణుఁడ వీఁకన్
విను గించిత్కార్యము నీ
కును గర్తవ్యం బధిపున ♦ కు హితం బొలయున్. 187

క॥ సత్య ప్రతిజ్ఞుఁడవు నీ
వత్యంతాసక్తిఁ జేయు ♦ మయ్యది సత్యా
ప్రత్యయుఁ డగు నీ తండ్రిని
సత్యాత్ముని గాఁగఁ గాంచ ♦ సమయము రామా! 188

—♦ కైకమాట విని రాముఁడు ప్రతిజ్ఞఁ జేయుట ♦—

చ॥ వినుము వరంబు లిచ్చెఁ గడు ♦ వేడుకతోడుత నాదరించి నీ
జనకుఁడు నాకు; నయ్యవి వి ♦ సంబయి కంతము బట్టె జేని; గా
వునఁ నవి నీ యధీనములు ♦ పుత్రుఁడ సర్వము దెల్ప లజ్జతో
మునిఁగెఁ దదాప్తకృత్యము స ♦ మున్నతి వానిని నిర్వహింపుమా!

క॥ గతజల సేతు నిబంధన
మతిఁ దూలెడి సత్యపాశ ♦ మహితగళుండై
పితలు దరించుట కెయ్యెడఁ
జతురాత్మా! భువిని బుత్ర ♦ శబ్దమ కాదే! 190

తే॥ కేకయాత్మజ వచియించు ♦ కాకపలుకు
వినియు శూలాభిహతుఁడైన ♦ విధము వ్యధిత

హృదయుఁడై రామచంద్రుండు • పృథివి యదుర
ధీరవాక్యంబు వల్కె దే•వేరిఁ గాంచి. 191

మ॥ విను పితృర్థము సీతనైన విడుతున్ • వేగంబ కౌసల్యమా
జననిన్ వీడుదు రాజ్యమున్ వదలెదన్ • సంతోషపూర్వంబుగన్
ఘన హాలాహలమున్ భుజింతు నిటులన్ • ఘర్షింపఁగా నేలోన్
ననుబోఁట్లన్ జననీ! విధేయుఁడను గా•నా నీకు భాషింపుమా. 192

క॥ జననీ జనకుల యాజ్ఞలఁ
గన ధరణిసమాన మండ్రు • గావున నీ యా
జ్ఞను శిరసి ధరించియు నే
ననుమానము లేక చేతు • నమ్మా! కైకా! 193

క॥ జనకాజ్ఞ లేకయుండిన
ఘనకార్యము నిర్వహింపఁ • గలవాఁ డిలలో
గన నుత్తముఁ డనదగు నన
వినుపింపరె నీతి బుధులు • విదితముగాగన్. 194

తే॥ ఉక్తకార్యంబు నొనరించు•చుండువాని
గాంచ మధ్యముఁ డని యండ్రు • ఘనులు నుక్త
కార్యనిర్వాహక ఖ్యాతి • గాంచ నట్టి
వాని నధముఁ డందురు నీతి•వాదవిదులు. 195

క॥ కావున మా జనకాజ్ఞను
భావంబునఁ గాంచి భక్తి • భయ వినయ తతులన్
ధీవిభవులు సమ్మతిఁగన
ధీవిలసితరీతిఁ జేతు • ధృతకార్యుఁడనై. 196

మ॥ జనకుం డేమి వచింపఁ దాని నిట నే • జక్కంగఁ జేకూర్తు నో
జననీ! సత్యము సత్య మీ పలుకు లీ • సర్వంసహాచక్రమా
వనవధిం గూలిన నింగి క్రుంగిన గుభృ•ద్వ్రాతంబు లల్లాడినం
గనుమా రెండవమాట రామ రసన•గ్రస్తంబు గానోపునే? 197

వ॥ ప్రతిజ్ఞాపూర్వక రామవచనంబు విని కైక భాషింపఁ దొడఁగె.

తే॥ ప్రథమవర మింక భాషింతు ♦ రామ! వినుము
త్వదభిషేకార్థ సంభృత ♦ వస్తువితతి
చేత భరతున కభిషేక ♦ సిద్ధిగలుగ
నాకుఁ బ్రియమగాను గాంచు మో♦నళిననయన! 198

తే॥ రెండవవరంబు విను మన్న! ♦ రేపె నీవు
నారచీరల ధరియించి ♦ నయ మెలర్ప
జడలు కృష్ణాజినంబులు ♦ వడిగ దాల్చి
వనికి జనవలె మీతండ్రి ♦ వచన మిటులె. 199

చ॥ అలబదునాల్గు వర్షములు ♦ నా కలనముల్ ఫలకందమూలముల్
కలితగతిం భుజించి మనఁ♦గావలె నీ వని తండ్రిగార లు
జ్వలగతిఁ జెప్ప సిగ్గువడె ♦ వారి సుఖాగ్రమునందు నేను ని
శ్చలముగఁ దెల్పితిన్ జనియుఁ ♦ జయ్యన నా పరితాప మాపుమా!

చ॥ అనియెడు కైకమాట విని ♦ యాదరణోక్తి వచించె నిట్లు పా
వని! భరతుండె యీ భువన♦భారముఁ బూనఁగ నిమ్ము దండకా
వనులకు నేగు దెంచెద న♦వశ్యమ యీ విషయంబుఁ దెల్పఁగా
జనపతి సంశయింపఁ దగు ♦ సంగతు లేమొ యెఱుంగ నే నిటన్? 201

క॥ శ్రీరామేరితవాక్యము
ధారుణినాథుండు వినియుఁ ♦ దద్దయుఁ బలికెన్
ఘోరవిషాదమునం గ
న్నీ రొలుకఁగ రాముఁ గాంచి ♦ నీరజనేత్రా! 202

మ॥ వనితావాగురబద్ధమానసుఁడనై ♦ భ్రాంతిన్ మహామోహజీ
వనవర్ధిష్ణుఁడనై కుమార్గచరినై ♦ పాపక్రియావర్తినై
చను నన్నీవిట నిగ్రహించియు మహీ ♦ సామ్రాజ్యముం గొమ్ము మా
నసచంద్రామృతవృష్టులం గువలయా♦నందంబు గావింపుమా. 203

తే॥ స్త్రీజితుని భ్రాంతహృదయు దు♦ర్ణీతియుతుని
దుష్పథచరిష్ణుఁడ నగు నన్ ♦ దోర్బలమున
నిగ్రహింపుము రాజ్యంబు ♦ నెమ్మిఁగొనుము
తద్భయంకర పాపంబు ♦ దగులఁబోదు. 204

క॥ గర్వియు యుక్తాయుక్తం
బుర్విని దెలియని జనుండు ♦ నుత్పథి కనఁగా
నుర్వీపతి దండనమున
నిర్వాహితులు గురుఁడునైన ♦ నియతిఁ గనంగన్. 205

శా॥ రామా! నన్ను నసత్యమంట దటులన్ ♦ రాజిల్ల సద్యోగతిన్
రామాస్త్రంబున గంతలుంతనుఁడనై ♦ రమ్యప్రభాభాస్వర
ప్రామాణ్యప్రవిలాస నిర్జర చర ♦ వైకుంఠమం దుందు నే
నామోదంబున శంక నందకు యశం ♦ బార్జింప నిర్జింపుమా. 206

క॥ హా రామ! లోకనాథా!
నీరజదళనేత్ర! ధీర! ♦ నిర్మలచరితా!
హా రామ! ప్రాణవల్లభ!
ఘోరాటవి కెట్లు బోవఁ ♦ గోరికపుట్టెన్. 207

క॥ నను విడచి వనులఁ దిరుగఁగఁ
జను టెట్టులు నీవు రామ! ♦ చనఁగా లాడం
జనునా తెలియ వచింపుము
ఘనకల్మషనాశన! వర♦కరుణా సుగుణా! 208

వ॥ అని రాము నాలింగన మొనర్చి ముక్తకంఠుఁడై కడుంగడు దుఃఖించుచుండె.

క॥ రామజపంబున నెల్లెడ
బాములఁ దొలఁగించు నండ్రు ♦ భవ్యచరిత్రుల్
రామాలింగన మైనను
గామిత చిత్తంబుఁ ద్రిప్పఁ ♦ గాదాయె నహా! 209

తే॥ తన యకృత్యంబు సత్యంబు ♦ దలఁచి తలఁచి
ప్రవహాగతిఁ బారు దుఃఖంబు ♦ బట్టలేక
పొరలి యేడ్చెను దరశథ ♦ భూవిభుండు
తన యకృత్యంబు సత్యంబు ♦ దలఁప వలదె. 210

తే॥ సజలపాణియై శ్రీరామ♦చంద్రుఁ డతని
నేత్రయుగళంబు దుడిచి క♦న్నీటి నొత్తి
యవనినాథుని మెల్లఁగ ♦ నాదరించె
వినయకోవిదుండగు రామ♦విభుఁడు పలికె. 211

ఉ॥ ఏను ప్రతిజ్ఞ దీర్చియును ♦ నింపుగ నీపుఁ గాంచవత్తు నీ
మానవ రాజధానికిని ♦ మా కతిదూరము దీనికన్న నా
మాని నివాసరాజ్యము స♦మంజస మౌ సుఖదాయకంబు మీ
మానసమందు దుఃఖమును ♦ మానుఁడు కోటిగుణంబు మా కగున్.

క॥ జననాథ ధరిత్రిని నా
యనుజుఁడె శాసింప వచ్చు ♦ నతిముదమున నే
జనకుని యాజ్ఞను బాలిం
తును గీర్తిని గాంతు నింత♦దూలఁగ నేలా? 213

మ॥ భవదీయం బగు సత్యపాలనము ల♦భ్యంబౌను దైవానుకూ
ల విధంబౌ నిఁకఁ గైకకున్ ముదము వా♦లాయంబుగా నోపు భూ
ధవ సౌఖ్యంబు వనప్రవాస మిపుడే ♦ తర్లం బ్రయత్నింతు వా
స్తవ మీమాటయుఁ జాలు♦హృజ్జ్వరము శాంతంబైన మాతల్లికిన్.

తే॥ మదభిషేకార్థ సంభృత ♦ మహిత వస్తు
చయము నుపసంహరించు డీ ♦ సమయమందు
రాజచంద్రమ! కాంతార ♦ రాజ్యసుఖము
ననుభవించెదఁ గించ నీ♦యాత్మ వలదు. 215

మ॥ అనిమిత్తంబగు నీ విధంబున భయ♦వ్యాఘాతమైనట్టి మా
జననిం గోసలరాజపుత్రిని సమా♦శ్వాసించి సీతాసతిం

గని లాలించియు వచ్చి మీ చరణయు♦గ్మప్రీతిఁ జేకూర్పఁ
మన మొప్పారఁగ మ్రొక్కిపోదు వనసా♦మ్రాజ్యంబు పాలింపఁగన్

తే॥ అనియు భాషించి రాఘవుం ♦ డంతఁ జనియె
వనితపై ప్రేమ బ్రియపుత్రు ♦ వనుల కంపఁ
దలఁచెఁ దనకీర్తి జెడు నంచుఁ ♦ దలఁపఁ డయ్యెఁ
గాముకుల చిత్తవృత్తి యి♦క్కరణిఁ గాదె. 2

ఆశ్వాసాంతము.

మత్తకోకిల॥ శ్రీమహేశ గిరీశ శంకర ♦ చిత్కళా పరమాస్పదా
సామగానవినోద వేదవి♦చార ధీరగుణాన్వితా
రామకారణ లోకరక్షణ ♦ రాజితామలమార్గగా
సోమశేఖర లోకపావన ♦ శుద్ధగంగజటాధరా! 21

మందాక్రాంత॥ లోకానంద ప్రథితసుగుణా ♦ లోకనాకీర్తనీయా
రాకాచంద్రప్రవిమలకళా ♦ రాజితాశేషభూషా
సాకారశ్రీ పరమపదవీ ♦ స్వస్థ విస్తారవస్తు
స్వీకారానంత శివ గిరిజా♦చిత్తచోరా! గిరీశా! 21

మ॥ వరకైలాసనివాస పింగళజటా♦భార ప్రబద్ధోరగా
సరయూతీరవిహార రామహృదయ♦స్వామీ జగన్నాయకా
కరిచర్మాంబర సాంబ విష్ణు శరసం♦కాశా చిదానందవి
స్తర కల్యాణగుణాభిరామ పరత♦త్త్వజ్ఞాన భానూదయా! 22

గద్యము॥ ఇది ............ శ్రీమదాంధ్రాధ్యాత్మరామాయణా
తర్గతంబగు నయోధ్యాకాండమున నారదాగమన రామ
యువరాజ్య పట్టాభిషేక ప్రయత్నంబును వనవాస
ప్రయాణంబును గల ప్రథమాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ.

# అయోధ్యాకాండము



## ద్వితీయాశ్వాసము.

నాథ సోదరీ కాం
తా! నానాయోనిజంతు ♦ తారకనామా
దీనావన! వృష వాహన!
జ్ఞానానందైకరూప♦కా! బ్రహ్మేశా! 1

—♦రాముఁడు కౌసల్య యింటి కరుగుట♦—

వ॥ రామాయణ పౌరాణికునిం గాంచి భర్గ ధర్మపత్నియగు పురాణ దుర్గ యవ్వలి కథా విధానంబు బోధింపవే యన నా వలిమ లల్లుం డుల్లాసంబున మెల్లమెల్లన. 2

క॥ వినవే నగరాజసుతా!
వనవాసముఁ జేయ రామ♦భద్రుఁడు వెడలన్
జననీమణి యాజ్ఞను జే
కొనఁగాఁ జనె నో సరోజ♦కోమలగాత్రీ! 3

వ॥ ఈ విధంబున భాషించి దశరథువలగొని తన నిజజనని యగు కోసలరాజతనూజను గాంచఁ జనె; నప్పుడు రామకారణంబున నత్తలోదరి బత్తి యుత్తమిల్ల హరిపూజాధురంధరయై హోమాదికార్యంబుల నొనరింపించి భూసురనివహంబులకు ధన కనకాదుల నుత్సాహంబున నొసంగి మౌనవ్రతయై యేకాగ్రమానసంబున నిరస్తాశేషదుఃస్వరూపుని ఘనచిత్ప్రకాశుని సదానందమయు నంతస్థు శ్రీవిష్ణు భావించుచు నాకె బాహ్యదృష్టి మఱచుటం జేసి వచ్చుచున్న రాముని గాంచదయ్యె. 4

ఉ॥ అంత సుమిత్ర రాముగని ♦ యాదర సంభ్రమచిత్తవృత్తయై
సంతసమానసాబ్జయు య♦శశ్విని గోసలరాజపుత్రి న

త్యంత ముదంబునం గనియు♦నాతఁడె రాణిరో! కాంచు రాముఁ డీ
పొంతనె వచ్చెఁ దా నిదిగొ ♦ ముద్దులబిడ్డఁ డటంచుఁ జెప్పెఁ దాఁ.

తే॥ రామనామంబు గోసల♦రాజతనయ
విని యు బాహ్యదృష్టి నిగిడ్చి ♦ విమల విశద
నయను నీక్షించి యాలింగ♦నం బొనర్చి
యంకతలమున నుంచియు ♦ నతిరయంబ. 6

సీ॥ ఆకుంచితాలకు ♦ నవ్యయానందుని
బరు నిరామయుని శా♦శ్వతు నసంతుఁ
జిరునవ్వు మోమున ♦ జిందులాడెడువాని
మాణిక్యకుండల♦మహిత తేజు
హారనూపురధారు ♦ నాపీతవసను నిరాభాసుఁ
గరుణు నీలోత్పల♦వర శరీరు
నిందిరా నీలశ్యాము ♦ ధృతనిర్మలాకారు
నిరుపద్రవుని శుద్ధు ♦ నిష్కళంకు

తే॥ స్వప్రకాశు నిరంజను ♦ సర్వభూత
హితుని యోగిమానసధాము ♦ నీశు రాము
గరము శిరము నాఘ్రాణించి ♦ కౌఁగిలించి
యద్దుముద్దులఁ బ్రేమించి ♦ ముద్దరాలు. 7

క॥ ఆకలిగొన్న విధంబున
నాకును నిను గాంచఁదోఁచు♦నాయన రామా!
ప్రాకట మృష్టాన్నమునుం
జేకొని భుజియింపు మోయి♦చిన్నికుమారా! 8

వ॥ ఈవిధంబునఁ గౌసల్య కుమారుని చుంచుదువ్వి ముద్దాడుచు
భాషించుచున్నతఱి రాముఁడు వచించె. 9

తే॥ జనని భోజనావసరంబు ♦ దనర లేదు
కాని దండకాగమనంబు ♦ బూనవలయు

గాలనిర్ణయ మయ్యె నిక్కముగ నమ్మ!
వేగఁ జనవలె విను మొక్క విషయ మీవు. 10

ఉ॥ కైక కొసంగినట్టి వర కారణ మిందున సత్యసంధుఁడౌ
లోకవిభుండు తండ్రియును లోకులు మెచ్చఁగ నిచ్చగించియుఁ
జేకొని యిచ్చె రాజ్యమును శ్రీభరతాఖ్యున కింక నా కనం
బ్రాకట దండకావనులఁ బాలనఁ జేయ నొసంగెఁ బ్రీతిగన్. 11

తే॥ ఆచతుర్దశవర్షంబు లడవులందు
మునివిధంబునఁ జరియించి మోద మలర
మరల రాగల వేగంబ మదినిఁ గుందఁ
దగదు వీరమాతరొ! యథార్థము వచింతు. 12

—— కౌసల్య చింతించుట ——

క॥ అని రాఘవుండు పలికిన
విని మూర్ఛను దోగి దుఃఖవివశతఁ జింతా
వనధి మునింగియుఁ గోసల
జనపతిసుత రాముఁ గాంచి చయ్యనఁ బలికెన్. 13

తే॥ భద్ర! నిజముగ వనికేగ వలయు నేని
నిలువఁజాలను నిను వీడి నిముసమైన
గాన కే నన్నుఁ గొనిపొమ్ము కలదు సుఖము
తనయు వీడిన బ్రతుకంగఁ దరమె తల్లి. 14

తే॥ ఆలు లేగలవిడచి యెంతైన నిలువ
నటులఁ బ్రాణంబుకన్న నత్యధికుఁడ వని
మదికి నల్లారుముద్దుగా మచ్చి పెనుచు
ప్రియతనూజుఁడ నిన్నెట్లు విడువఁగలను. 15

చ॥ భరతునియందుఁ బ్రీతిగలవాఁ డయితేనియుఁ గైకమాటచే
భరితదిగంతకీర్తి పరిభాసిత రాజ్యరమాకళత్రుగాఁ

గరము ననుగ్రహింపఁ దగుఁ ♦ గాని యిదేమి నిన్నున్ వనాంతస
చరణ మొనర్పఁ బంపుట వి♦చారకరం బగు వింత రాఘవా! 16

మ॥ అలకైకేయికి సర్వరాజ్య ధన రా♦జ్యశ్రీలు భాసిల్లఁగాఁ
గలితప్రేమ నొసంగఁగాక దొసఁగుం ♦ గైకేయి కేమైన నీ
వలనన్ వాటిలెనా? జనాధిపతి నిన్ ♦ భావంబునం డెంచి నీ
వలతిం జూచితివా? వినం దగనివా♦క్యం బేల వాక్రువ్వఁగన్. 17

తే॥ ఆత్మజనకుండు గురుఁడైన ♦ యటుల నీకు
నధికురాలనె యగుదు నే ♦ నంతకంటెఁ
గలిగె బితాజ్ఞ వనవాస♦గమన మేను
గానలకు నేగ వారింతు ♦ సూనుఁ బూని. 18

మ॥ ఒకకాంతామణి మోహముం దగిలి యే♦దోమాటపట్టింపు మే
రకు భాషించిన రాజ్యమున్ విడచి పో ♦ రాజిల్లునే రాజ వృ
త్తికిఁ గాంతామణిఁ గూడి కానలకు నీ♦తిస్ఫార శౌర్యక్రియా
ప్రకటత్వం బది యేడ డాగినదిరా! ♦ రామా జగన్నాయకా! 19

తే॥ చనెద వేనియు మద్వాక్య♦ సరణి వినక
రాజశాసనధారివై ♦ రామచంద్ర
ప్రాణముల వీడి యమధర్మ♦రాజనగరి
వాస మొనరింతు నిక్క మీ♦పలుకు తండ్రి! 20

—♦ లక్ష్మణుఁడు రోషపూరిత వాక్యములఁ బలుకుట ♦—

వ॥ కౌసల్య భాషించు విధంబు గాంచి రోషభీషణహృదయుం డగుచు సుమిత్రానందనుండు రాఘవు నీక్షించి జగత్త్రయంబు దహించు చందంబున. 21

మ॥ వరకర్ణాంత సుదీర్ఘ నేత్రుని మహా ♦ బాహున్ శరన్మేఘ సుం
దరవర్ణున్ ఘనవక్షుఁ జంపక సము♦ద్యత్ప్రీతవాసాభునిం
వరుణార్క ద్యుతి కుండలున్ రఘువరున్ ♦ సన్ముద్రికా రత్న భా
సురు వీరున్ విజితేంద్రియున్ భరతు నీ♦సుంబట్టి బంధించెదన్. 22

మ॥ వర కైకావశవర్తియై భరతునిన్ ♦ బంధించి హింసింతు ను
ర్వర దద్బంధుల మాతులుం దునిమెదన్ ♦ భావింపుఁ డస్మద్బలం
బు రహింపఁగాంచుడి శౌర్యముల్ విను జగం♦బుల్ బూదిగాఁ జేయుసం
గరవీరుండగు తమ్ముఁడుం గలుగ శం♦కాబుద్ధి నీ కేటికిన్? 23

మ॥ అవనీనాయక విల్లు నమ్ము గొని యు♦ద్యద్దీక్షనుండంగ నే
భవదగ్రంబున శత్రు లెవ్వరట నీ♦పట్టాభిషేకోత్సవం
బు విఘాతం బొనరించువారు శరమే♦పున్ మీర సంధింపఁ జూ
తు వినోదంబుగ వార లేమగుదురో ♦ దోర్దర్ప మూహింపుమా. 24

తే॥ అనియు నసహాయ విక్రమం♦బున వచించు
ననుజు సౌమిత్రిఁ గౌఁగిలిం ♦ గొనియు రామ
మూర్తి భాషించె నీరీతి ♦ మోద మలర
శాంతరసమొల్కు మృదువాక్య ♦ సరణి నపుడు. 25

—♦ రాముఁడు లక్ష్మణుని శాంతిపరుప తత్త్వముఁ దెలుపుట ♦—

క॥ శూరుఁడ వస్మద్ధితమతి
వో రాఘవ నీవటంచు♦నుద్ధృతిఁ దెలియున్
వారింపుము నీకోపము
ధీరా సమయంబుగాదు ♦ తెలియుమి విధమున్. 26

క॥ కవ నీ విశ్వము రాజ్యము
ఘనదేహాదికము లెల్లఁ ♦ గడు సత్యములై
మనెనేని నీ ప్రియానం
బును సఫలతఁబొందఁగలదు ♦ భోగాదులనన్. 27

మ॥ కల భోగాదులటన్న మేఘములలోఁ ♦ గన్పట్టు విద్యుల్లతా
వళి యాయుష్యము తప్తలోహగతమై ♦ వాసించి యాశించు నా
జలబిందూపమమై చరించు ననుజా! ♦ సందర్భ మూహించు ని
శ్చలమార్గంబు ధరించుమంచితగతిన్♦సౌజన్యముం బూనుమా. 28

ఉ॥ వ్యాళగళస్థమండుక మ♦వశ్యపుఁజావుఁ గనంగలేక దం
శాళి భుజింపఁబోవుగతి ♦ నారయఁ గాలభుజంగవక్త్రమం
దోలి వశించు లోకమన ♦ సుర్వి నశాశ్వతమంచు నెంచకే
ళాళిని సౌఖ్యభోగధన ♦ వాంఛఁ జరింతురు మూఢచిత్తులై. 29

సీ॥ అవని శరీరభో♦గార్థమై మనుజుండు
నహరహంబు ధనార్జ♦నాదికర్మ
తంత్రంబు లొనరించు ♦ దండి కష్టము లోర్చి
భోగానుభవరూప ♦ భోజ్యవితతి
ననుభవించు నెవండు ♦ నాత్మకా? లేక దే
హమునకా? దేహంబ ♦ టన్న నాత్మ
కన్న భిన్నమటంచుఁ ♦ గాంచఁగాఁబడుచుండు
జడమును దేహాది ♦ సంతతులన
తే॥ వానిఁజెందవు తద్భోగ ♦ భాగ్యవితతి
యాత్మచేతనె భోగంబు ♦ లనుభవింపఁ
బడును భోగంబు లాత్మకు ♦ వలనుపడదు
నిశ్చయం బిద్ది నీయాత్మ ♦ నెమ్మిగాంచు. 30

తే॥ భావషట్కాదిరహితుఁడై ♦ పరగువాని
కనుభవించెడు భోగమే♦దందు నీవు
మదిని భావించు నిశ్చల ♦ మార్గమెదియొ
యుక్తరీతిని జరియించు ♦ చుండుమయ్య! 31

వ॥ పితృమాతృ సుత భ్రాతృ దార బంధు మిత్రాది సంగమంబనఁ బ్రపాశాలయందు గూడిన జంతుసంతతివలెఁ బ్రవాహపతితంబు లగు కాష్టంబులచందంబున నొకప్పుడు కూడికయు మఱొకప్పుడు నదీవేగంబున వీఁడిపోవుటయుఁ దనరి చలనయుక్తమై యుండు. 32

సీ॥ భాగ్యలక్ష్మియటన్న ♦ బ్రతిబింబ భూతమై
యతిచంచలఖ్యాతి ♦ నలరుచుండు

దారుణ్యమందువా? ♦ వార్కిశాశితరంగ
గతి నధ్రువంబునై ♦ కంటఁబడదు
వనితాసుఖంబన్న ♦ స్వప్నోపమంబౌచుఁ
బూర్వోత్తరాదృశ్య♦మునఁ జెలంగు
నాయుష్యమందువా? ♦ యత్యల్పమైయుండుఁ
జర్మపుత్రిక నాట్య♦సరణిఁ గాంచఁ
తే॥ దెలియక వృథాభిమానముల్ ♦ వెలికిఁ ద్రోయఁ
జాలక వివేకహీనులై ♦ సంచరించు
చుందు రియ్యది డెందంబు ♦ నందు నునిచి
యాత్మసుఖమును బొందంగ ♦ నగును జనము. 33

తే॥ స్వప్న సదృశంబు రోగాది ♦ సంకులంబు
నగును సంసృతి గంధర్వ♦నగరభాతి
దానిఁ బ్రేమించి తిరుగు న♦జ్ఞాని; జ్ఞాని
మానసంబున జేర్పఁడా ♦ మాట నెపుడు. 34

ఉ॥ ఆయువటన్న సూర్యు నుద♦యాస్తమయంబులఁ జెల్లుచుండుఁ దా
నే యెడ నన్యమానవుల ♦ మృత్యుజరాదులఁ గాంచుచుండి స్వీ
యాయువు మృత్యు వార్ధక వి♦ధాదుల నాశము జెందుచున్న దో
హో యనితారెఱుంగకయ ♦యుందురు శాశ్వతమంచులక్ష్మణా! 35

తే॥ అల నహోరాత్రముల నాయు ♦ వఱుగు ననియు
మూఢచిత్తుండు గాంచక ♦ భోగభాగ్య
సరణి ననుసరించి చరించుఁ ♦ జావుపుట్టు
కాలవేగసంగతమాట ♦ గాంచలేడు. 36

తే॥ ఆయు వామఘటాంబువు ♦ లట్లు క్షరము
ప్రతినిమేషంబు రోగాఘు ♦ మితని వైరి
సమితివలె దేహబాధలఁ ♦ సమయఁజేయు
నిర్మలానంద మనుమాట ♦ నిండుసున్న. 37

తే॥ జరయు వ్యాఘ్రియై నిలిచి తర్జన మొనర్చు
చున్న దీముందు మృత్యువటన్న దాని
తోడఁ జను నిద్ది సమయంబు గూడుకొనుచు
వేచియుండును సౌమిత్రి! విరివిఁ గాంచు. 38

వ॥ మనుజుండు క్రిమి విడ్భస్మాది సంయుతంబగు దేహంబె తానని యహంకార యుక్తుండయి నేను లోక ప్రసిద్ధుండగు రాజునని తలంచి జగంబున సంచరించు. 39

వ॥ అనుజా! నీ వే దేహము
గని నేనన్న యభిమానగతి లోకములం
బనిగొని దహియింపఁగఁ బూ
నిన యది వచియింతు వినుము నిర్మల బుద్ధీ. 40

తే॥ తగఁ ద్వగస్థి మాంసమలమూత్రముల రక్త
శుక్ల సంయుతంబయి యుంట సూటిఁగాంచఁ
దనువు పరిణామము వికార మనెడు వాని
దగులు నది యాత్మ యెటులౌనొ తగ వచింపు. 41

వ॥ శరీరమే నేనను నది యవిద్య యని నిగదింపఁబడు. దేహమేను గాను, చిన్మాత్రుండగు పరంజ్యోతిగా నున్నాడ నను బుద్ధియె విద్య. అవిద్య సంసార కారణంబు. విద్య తన్నివర్తకోపాయకారకము.

సీ॥ తత్కారణంబున ధర ముముక్షులు విద్య
యభ్యాస కార్యంబటంచు నెంచి
యత్నించుచుండెద రనఘాత్మ! కామంబు
క్రోధంబు లోభంబు గుఱిని గాంచ
మదమును మోహంబు మత్సరంబును నాగ
శత్రులార్వురు మిత్ర సములు గలరు
విరివి వారల మోక్ష విఘ్నంబు నొనరింపఁ
గ్రోధమొక్కటె చాలు సాధకులకు

తే॥ క్రోధయుతుఁడైన వాఁడు సం♦కోచపడక
తల్లి దండ్రుల బంధుసో♦దరుల సఖుల
నైన నెనరులేక వధింప ♦ నతిసమర్థుఁ
డగును శత్రుసూదన! లక్ష్మ♦ణాభిధాన! 43
ఆ॥ క్రోధకారణంబు ♦ గూడియుండుట చిత్త
తాపమొకటి బుట్టు ♦ నేపుమీర
నరవి గాంచ నదియె ♦ సంసారబంధకం
బగును ధర్మనాశ ♦ మగును వినుము. 44
తే॥ కాన నీకుఁ బ్రకృతమిత్రుఁ♦డైన క్రోధ
దేవు నవలఁ ద్రోలుము ♦ నీవు వాఁడె
గొప్పశత్రుఁడు నాశమె ♦ ఘోరమైన
వైతరణి నాగ నలరారు ♦ వసుధయందు. 45
క॥ ఘనసంతోషమె నందన
వనమౌ శాంతియె తలంప ♦ భావమునందుం
గనఁ గామధేనువగుఁ గా
వున దాని భజించి సుఖముఁ ♦ బొందుము వత్సా! 46
వ॥ తదాశ్రయణంబున శత్రు వనువాఁడు భువనంబుల వెదకిన నీకుఁ గానరాడు. దేహేంద్రియ మనఃప్రాణబుద్ధ్యాదులకు విలక్షణుం డగు నట్టి యాత్మ స్వయంజ్యోతియు నిరాకారుఁడు వికారరహితుం డని యెఱుంగుము. దేహాదులు స్వప్రకాశంబులు గావు. దేహేంద్రియాదుల కంటె నాత్మను భిన్నుండుగాఁ దెలియనంత దాక జంతుసంతతి మృత్యు సంయుతంబై సంసార దుఃఖసమూహంబులచేఁ బీడింపఁబడుచుండు. 47
తే॥ నీవు తద్భిన్నుఁడవుగాఁగ ♦ నియతి మదిని
దలఁచి బుద్ధ్యాది విషయసం♦తతులఁ జిక్కి
బాహ్యకార్యానువర్తివై ♦ భావమందు
దుఃఖ మనుదాని నావలఁ ♦ ద్రోలివేసి. 48

వ॥ సుఖదుఃఖంబుల నేదియైన ననుభవింపుచు సంసార సాగ॥ పతితుండ వయి సకలకార్యసమారంభవృత్తి నవలంబించి యొనరించు చున్నను నిర్లేపుండవు.

తే॥ రాఘవా! నీవు బాహ్య కా♦ర్యంబులందు
జేరి కర్తృత్వమునుబూని ♦ చేయుచున్న
నాత్మశుద్ధ స్వభావుండ ♦ వైనయెడలఁ
గర్మ నిర్లేపుఁబోవ దే ♦ కడలనైన.

తే॥ వరుస నా చేతఁ జెప్పంగఁ ♦ బడిన దీని
నంతయును సదా భావించు ♦ మాత్మయందు
నమిత సంసార దుఃఖంబు ♦ లన్ని నిన్ను
బాధఁజేయంగఁజాల వీ ♦ బోధ నెఱుఁగ.

వ॥ ఆపై నిజజననియగు కౌసల్యంగాంచి రామచంద్రుఁడు ప్రయాణోన్ముఖుండయి సహజాదర వాక్యంబుల.

ఉ॥ అమ్మరో నే వచించునది ♦ యంతయు నెప్పుడు భావమందునన్
నెమ్మది నెంచుచుండు మిఁక ♦ నీభవరూపక దుఃఖపంక్తి నిం
గ్రమ్మగరాదు కావున సు♦ఖంబుగ నేనిట వచ్చుదాక నీ
విమ్మహినిన్ మదాగమన♦మే మది నెంచుచు శాంతినందుమా.

తే॥ కర్మమార్గానువర్తు లౌ♦ క్కటనుగాని
తనర దేశత్రసంవాస ♦ మనగ ధాత్రి
నా సరిత్ప్రవాహ పతిత ♦ మైన యుడుప
జాల గతి నంచు భావించు ♦ జనని నీవు.

క॥ పదునాల్గు వర్షములు నా
మది కరనిముసంబుగాఁగ♦మైకొని నడచున్
సదమలమతి మాతల్లీ!
మది దుఃఖముఁ బాఱఁద్రోలి ♦ మన్నింపఁగదే.

తే॥ అనుమతింపుము నన్ను మా♦యమ్మ నీవు!
దుఃఖమును దూరముగఁ బాఱఁ♦ దోలి తేని
సుఖనివాసంబు కానల♦ సూటిదనరు
జననిదీవన సుతులకు♦ సౌఖ్యకరము. 56

క॥ అనిపలికి రామచంద్రుఁడు
జననీపాదాబ్జయుగ్మ♦ సంగత శిరుఁడై
మనియుండిన రాఘవు నా
వనితామణి లేవనెత్తి♦ స్వాంకమునందున్. 57

—♦ కౌసల్య సాదరంబున రాముఁ బంపుట ♦—

వ॥ కూర్చుండఁబెట్టుకొని చుబుకంబుఁ బుణికి కన్నీరునించుచు,

సీ॥ సవనాగతంబైన♦ సత్ఫలం బిదియంచు
సంతసించుట కడ♦సారి యేమొ
జానకీసతిఁగూడి♦ సరసంబుగా నుండ
నలరుచుండుట కిదె♦ యవధి యేమొ
సాకేతసామ్రాజ్య♦ సంపత్తి మనఁ గాంచు
సరణి కియ్యది యవ♦సాన మేమొ
యల్లారుముద్దుగా♦ నతిప్రీతి రాఘవా!
యని ముద్దుఁగొన నిదే♦ యదనొ యేమొ

తే॥ పుత్రగాత్ర పరిష్వంగ♦ పుణ్యఫలము
ననుభవించియు నానంద♦మున మునింగి
దుఃఖ మనుమాట నాత్మను♦ దొడరకుండ
మనుట కియ్యది యానవా♦ లనెదవేమొ? 59

క॥ అని యాలింగన మొనరిచి
వనితామణి కోసలాధి♦పతిపుత్రియుఁ బా
వనతమమగు నాశీస్సులఁ
దనిపెను తనయానురాగ♦ తత్పరయగుచున్. 60

సీ. సర్వంసహాచక్రి ♦ జననకారణదేవ!
మా రాముఁ గావవె ♦ మదినిఁ దలఁచి
విశ్వ విశ్వేరరక్ష ♦ శశ్వదాత్మవిలాస!
మా రాముఁ గావవె ♦ మదినిఁ దలఁచి
ప్రళయకారణరూప ♦ ప్రాక్తన శివతాతి!
మా రాముఁ గావవె ♦ మదినిఁ దలఁచి
గగనసంచరులార ♦ గంధర్వపతులార!
మా రాముఁ గావరె ♦ మదినిఁ దలఁచి

తే॥ నడచునప్పుడు నిదురించు ♦ వడువు నిలిచి
యున్న వేళ నాసీనుఁడై ♦ యున్న వేళఁ
గావవలయును బాలుఁ డీ♦కాలమునకుఁ
గానఁ జనుటామె మీఱ లా ♦ కాన దిక్కు. 61

తే॥ సకల జంతు సంతాన వి♦శ్వాస చిరత
రాయురారోగ్య జీవన♦దాయ జీవ
నౌషధీచయ భూషణ ♦ భూషితాంగి
ఒనర మా రాము వనరమా! ♦ మనుపుమమ్మ! 62

తే॥ అనుచు నాశీస్సు లాతని ♦ కలర నొసఁగి
కరము ప్రేమించి మఱిమఱిఁ ♦ గౌఁగిలించి
పయనమును జేసి పంపించెఁ ♦ బరమసాధ్వి
మంగళాశీస్సు లేరికి ♦ మహితశక్తి. 63

వ॥ అని ప్రస్థాపనం బొనరింప హర్షాశ్రుగద్గద హృదయుండై సౌమిత్రి రామున కభివందనం బాచరించి తత్త్వోపదేశ సంజనితానందంబున నిట్లు భాషించె. 64

తే॥ రామ! మన్మనస్సంశయ ♦ రాజి నిపుడు
నీవు దివ్యోపదేశంబు ♦ నెమ్మి నిచ్చి

యపహరించితె సంసారి♦విపులధనము
లపహరించెడు చోరుని♦యట్టు లనఘ. 65

తే॥ కమలపత్రాక్ష! నీసేవ ♦ విమల గతులఁ
జేయ నీవెంట వచ్చెదఁ ♦ జిత్తగించి
యాజ్ఞ నొసఁగుము లేదేని ♦ యసువు లిచట
నిలువ నోపవు నీపాద ♦ జలజ మాన. 66

క॥ అనవిని రాముఁడు లక్ష్మణు
ననె శీఘ్రముగాఁ బ్రయాణ♦మై రావలె జా
గునుసేయక పొమ్మని తా
జనకాత్మజఁ గాంచ నేగె ♦ సత్వరిత గతిన్. 67

—♦ సీత నూరడించుటకు రాముఁడు చనుట ♦—

తే॥ ఆగతుండగు రాము నా ♦ యవనిజాత
కాంచి, కాంచనాంచిత పాత్రి♦నుంచి జలము
నడుగుఁదమ్ముల క్షాళనం ♦ బాచరించి
బత్తి యిగురొత్త మెత్తని♦పలుకు బలికె. 68

చ॥ కరి ధవళాతపత్రములఁ ♦ గానను సేనలు లేవు వాద్యముల్
వర మకుటంబు వీడితిరి ♦ వాహిను లెచ్చట? సంభ్రమంబునన్
మరచితి రా? యెటంజనియు ♦ మానుగ వచ్చుచునుంటి రంచు వి
స్ఫురిత ముఖారవిందమునఁ ♦ బొల్పుగఁ బాఱఁగ మందహాసమున్.

తే॥ అనిన మందహాసాస్యుఁడై ♦ యవనివిభుఁడు
జానకీదేవి నీక్షించి ♦ సరవి నిటులఁ
బలికె శర్వాణి వినవె! యా ♦ జలజనయను
మృదుల ధైర్య గంభీర వా♦క్పదవిశుద్ధి. 70

తే॥ రాజు శుభమైన దండకా♦రణ్య మఖిల
మొసఁగెఁ దత్పాలనార్థమై ♦ యురురయంబ

చనఁగవలయును జానకీ! ♦ వనజనయన!
యిదె ప్రయాణంబుఁ జేసెద ♦ నిప్పు డేను. 71

తే॥ నీవు శ్వశ్రూసమీపవై ♦ నియతితోడ
మనియు మాతల్లి కౌసల్య ♦ మాటవినుచు
సేవఁ జేయుము నాతి నా ♦ సేమ మరసి
యే మనస్తాపాదులముగా ♦ మిందువదన! 72

క॥ అని పలికెడు రామునిఁ గని
మనమున భీతిల్లి సీత ♦ మనుజాధిప! మీ
జనకుఁడు వనరాజ్యము నిడఁ
బనియేల వచింపు డన్నఁ ♦ బలుకఁగఁ దొడఁగెన్. 73

క॥ నరవిభుఁడు ప్రీతి కైకకు
వర మిచ్చిన కారణంబు ♦ వలనం దరుణీ!
భరతున కీరాజ్యం బిడె
నరసియు వనవాస మిచ్చె ♦ నబలా! నాకున్. 74

క॥ పదునాల్గు వత్సరంబులె
ముదమున యాచించెఁ గైక ♦ భూపతియు దయా
హృదయుండు సత్యవాదియు
మదిమెచ్చియె యిచ్చినాడు ♦ మహీశాతనయా! 75

క॥ చనవలె వైళమ విఘ్నముఁ
గనఁ జేయకు మన్ననతఁడు ♦ చయ్యన రఘురా
మువి వాక్యములన్ విని యా
జనకజ వచియించెఁ బ్రీతి ♦ సంయుత యగుచున్. 76

క॥ వనమునకు నేను ముందుగఁ
జనియెద నటుమీఁద నీవు ♦ సంతస మొదవం
జనవచ్చు నన్ను వీడియుఁ
జను టుచితము కాదు మీకు ♦ సదుదారగుణా! 77

క॥ అనునట్టి సీతపలుకులు
విని రాఘవుఁడు మోదమంది ♦ ప్రియవాదిని దాఁ
గని యిటు భాషించెను వెస
వినవే సహజానురాగ ♦ విమలా! యనుచున్. 78

తే॥ చనుట గాంతారవాసంబు ♦ చన్న యెడను
వ్యాఘ్ర భల్లూక కేసర ♦ వారణాది
బహు మృగాకులం బగుటనీ♦వంటియబల
వచ్చు టెట్లగుఁ గాని యేగు ♦ వరుస యెట్లు? 79

మ॥ విన ఘోరంబగు దుష్ట సత్వరవముల్ ♦ వీలైన మార్గంబులా
కనరా వెచ్చట జీవనీయ బదరీ ♦ క్ష్మాభృద్గణాకీర్ణ కా
ననసంచారము రాజరాజ భవనా♦నందోక్త గానక్రియల్
వినువాల్గంట్లు మృగపక్షికీర్ణరవముల్ ♦ ప్రీతిన్ వినం జందురే? 80

మ॥ నిను వాల్గంటి వనప్రవాసమునకై ♦ నే నెట్లు గొంపోదు నే
మని నా వెంటఁ జనంగ నీ కగును ధై♦ర్యం బెట్లు నీ కబ్బె నా
వనవాసం బతికష్ట మందున నరుల్ ♦ వర్తిల్ల రాదండకా
వనికిన్ రాఁదగ దింటనుండిన గదున్ ♦ భద్రంబు బింబాధరీ! 81

ఉ॥ మానుషభోజనప్రియు ల♦మాన్యులు పాపులు ఘోరరూపసం
ధానులు రాక్షసావళులు ♦ దారులఁ గాచి చరించుచుందు రం
దేనియు రాణివాసమున ♦ నిందు శిలాన్వితసౌధరాజినిన్
మానితవై నయట్టి సుకు♦మారవు నీవట వచ్చు టెట్లగున్? 82

తే॥ సోకుమూకలఁ గాంచిన ♦ సోలఁగలవొ
భీతి నందుదు వేమొ నా ♦ ప్రియసదుక్తి
వినియుఁ బురమందె నివసింపు ♦ వేగఁ జనియు
వత్తు మదమరాళగమన ♦ భాసురాంగి! 83

వ॥ అదియుంగాక, యో సుమధ్యమా! భోజనంబునకుఁ గట్వా
మ్ల ఫలమూలాదులె కాని యపూపాది రసవ్యంజనాదు లొకప్పుడైన

లభింపకుండుటయు కాక వేళకు ఫలాదులైన నెచ్చట దొరకును. శర్కరాకంటకాన్వితములై నిమ్నోన్నత మార్గంబులు గుహాగహ్వర సంబాధంబును ఝిల్లీ దంశాది సంయుతంబును బహువిధా దోషపూరితంబునై దండకాఖ్యంబు రాజిల్లు; నటుగాక నడచిపోవలయు; శీత వాతాతప బాధ లింతింతనరాని యట్లుండు; వనంబున రాక్షసులఁగాంచి భీతిల్లి ప్రాణంబుల నిలుపఁగలవా యను శంకయగు; నామాట విని యింటనుండుము. మరల ననతికాలమ్మున నన్ను గాంచఁగల వన. 84

## —• సీతా మనోనిశ్చయము •—

తే॥ రామవచనంబు వినియును • రాజముఖియు
దుఃఖ సంగత హృదయయై • తోయజాక్షుఁ
గాంచి కొలఁది కోపముతోడ • నంచితగతి
విస్ఫురద్వక్త్రమున బల్కె • పరిస్ఫుటముగ. 85

తే॥ వరపదార్థావగతి లక్ష్య•భావ మృదుల
బృహదరణ్య సంచారంబు • నేన మున్ను
జనిన భవదీయ పరిచర్యఁ • జరుపనుందుఁ
స్థిరత నభిమాన గుణ పుర•స్కృతులు మీకు. 86

సీ॥ మాళవి పున్నాగ • మాగధీ నేపాళ
కేదార రాగాది • కీర్తితంబు
సురపశారద సౌమ్య • సుముఖ వాసంతికా
వనితా వితానైక • భాసురంబు
శ్రీరమా మాధవ • వారాహి గిరిజా శి
వాశాంత దేవతా • వాసితంబు
పటుసువర్గ వితాన • పర్యంక పాళికా
కరిముక కస్తూరికా • రాజితంబు

తే॥ వందిమాగధ శుభకర • వచన రచన
రుచిమహానంత మానస • రుచుల నొసఁగు

భూభృదుద్దీప్తి నగరైక ♦ భూషితంబు
మ దనుగతికేల నలతియా ♦ మాన్యచరిత. 87

మ॥ వనవాసాగత భారమేమియును నా ♦ భావంబునన్ లేదు పా
వన జీవౌషధ పుష్పపల్లవ లతా ♦ భాస్వద్ద్రుమాలంబు లా
వనపర్యాట జనశ్రమంబు లుడుపన్ ♦ స్వాంతంబు రంజిల్లు నం
దున మీసేవయు మానిదర్శనము దెం♦తో ప్రీతి సంధిల్లెడిన్. 88

క॥ నను మీ రిచ్చట డించియుఁ
జను టెట్టులు ధర్మపత్ని ♦ సాధ్విని వసుధా
వన! త్వదనన్య నదోషను
గన ధర్మజ్ఞులు దయాప్ర♦కాసిత హృదయుల్. 89

క॥ రామా! వనమున నీకడ
నేమోదముతోడ నుండ ♦ నెవ్వఁడు నీనా
సామీప్యము జేరఁగ రా
గా మది నెంచఁగలఁడు ♦ కడుధైర్యమునన్. 90

క॥ ఫలమూలాదిక మెయ్యది
యలరునొ తమ భుక్తశేష ♦ మదియే నాకుం
గలితామృత తుల్యం బని
తలఁచెద నానందమగును ♦ తామరసాక్షా! 91

తే॥ అనఘ! నీవెంటఁ జనుచున్న ♦ నడవియందుఁ
గాశ కుశ కంట కావళిఁ ♦ గాంచ నాకుఁ
బూలపానుపు క్రీల న ♦ మ్మోద మొదవు
నందియుం బేల నీబేల♦యందు మదికి. 92

తే॥ నేను నిన్ను దుఃఖపఱుప♦నీకుఁ గార్య
సాధిని నగుదు నో రామ! ♦ జలజనయన!
బలవిహీనులె యొక్కెడ♦బలయుతులకుఁ
గార్య సాధకు లౌదు రు♦త్కర్షమెఱయ. 93

తే॥ బాల్యమున నన్నుఁగాంచి ద్వై♦వజ్ఞుఁ డొకఁడు
బలికె భర్తతో వనవాస ♦ మలరు ననియు
విప్రవాక్యము సత్యమై ♦ వెలయుఁగాత
కాన నీవెంట వనికె రాఁ ♦ గలను నేను. 94

తే॥ విషయ మొక్కండు నన్యంబు ♦ వినుఁడు విప్ర
తతులు రామాయణంబులఁ ♦ దగఁ బురాణ
ములను జెప్పంగ నెన్నియొ ♦ మోదమలరఁ
జెవికి విందుగ వింటి నే ♦ నవనినాథ! 95

క॥ భూమిజను వీడి కానకు
రాముఁడు జనె నంచు నొక్క ♦ రామాయణముం
బ్రేమను బలుకుట గానము
రామా! కలదేమొ తెల్పు ♦ రాఁదలప నటఁన్.  96

తే॥ అన్ని విధముల నేను నో ♦ డాదు నీకు
జాగరూకత మెలఁగి వి ♦ స్తారగరిమఁ
బనియుఁగొందును లేదేని ♦ ప్రాణములను
విడుతు భవదగ్రమున రామ! ♦ విశ్వధామ. 97

క॥ అని నిశ్చయవాక్యము నా
తని మ్రోల దృఢంబుగ ననఁ ♦ దాత్పర్యము దాఁ
గని సీతతోడ రఘునం
దనుఁడు వచించె నిటు మోద ♦ తత్పరమతితోఁన్. 98

తే॥ దేవి! నావెంట జనుదేరు ♦ మీవు వడిగ
నీమనఃప్రీతి నే నేల ♦ నిలుపవలయు
సతియరుంధతి సతిభక్తి ♦ సత్కరింపు
సకలభూషణాంబర పుష్ప ♦ సమితి నింపు. 99

తే॥ ధరణిసురులకుఁ గల సర్వ♦ధనము నొసఁగి
వననివాసార్థ మేగంగ♦వలయు మనము

పిలువనంపుము సౌమిత్రి • వేదవిదుల
భక్తితత్పరుండవయి సత్వరితగతిని. 100

వ॥ అని రాఘవాగ్రజుండు నుడివిన లక్ష్మణుండు గుణశీలవృద్ధులగు భూసురుల సవినయమ్ముగఁ దోడితెచ్చె నంత. 101

సీ॥ ఆలమందలు నూరు • లీలతోఁ గొనితెచ్చి
బ్రాహ్మణుల్ ముదమంద • భక్తి నొసఁగె
వెలకు మిక్కుటములౌ • పీతాంబరంబుల
నయుతకోటు లొసంగె • నమలరత్న
ముక్తావిరాజిత • భూషణంబుల నిచ్చె
ధనరాసు లెన్నియొ • తగినవారి
నాహ్వాన మొనరించి • యత్యంతముదమున
నొసఁగె భూసురబృంద • ముత్సహింప
తే॥ పరమభాస్వర దానముల్ • పదియునారు
పదియు గోత్రామరేంద్రుల • వాంఛదీర
దనకుఁ గష్టంబుదోడరెనే • యనక ధర్మ
మలరఁ జేతురు మహనీయు • లాదరించి. 102

వసంతతిలక॥ సీతా సతీమణి వి•శేషనవాంబరంబుల్
ఖ్యాత ప్రభామణి వి•కాసిత భూషణంబుల్
బ్రీతిన్ సమర్పణము • వేగమ భక్తిజేసెన్
చేతంబు రంజిల వ•సిష్ఠునికాంత కంతన్. 103

క॥ జననీ సేవకవితతియు
మనమున నుప్పొంగునటుల • మణి ధన కనకా
దినవాభరణంబులవే
గ నొసఁగె రఘువంశకేతు • కరమొప్పంగన్. 104

తే॥ బధిర మూకాంధ వికలాంగ • పంక్తి వృద్ధ
సమితి సకలసౌఖ్యములందు • పరణిం గూర్చెఁ

పౌరజానపదుల కన్ను పంక్తి నిడియె
రామరాజ్యంబటన్న సార్థకము కాదె. 105

క॥ వనికిన్ దాఁబోవుటఁ గని
ఘనముగఁ జింతిలు సుమిత్రఁ గౌసల్యకు ల
క్ష్మణుఁ డొప్పగించె, "నమ్మా!
మనుపుమి మాజననిఁ జింత మాసిపి"యనుచున్, 106

క॥ విలు బూని హస్తమందున
నిలిచెన్ సద్భక్తితోడ నీరద నీలో
జ్జ్వలతను మోళిలను విద్యు
త్కలితాభ్రముఁ బోలి భూమి కరము వెలుంగన్. 107

వ॥ అంత రామలక్ష్మణులును భూమిజాతయు నందఱు నృ
పాలయ గమనోన్ముఖులై చనుచుండిరి. 108

మ॥ తనతోన్ సీతయు లక్ష్మణుండును సయోధ్యారాజమార్గంబునం
జనఁగా జానపదాది పౌరుల మన స్సంతోషతం గాంచుచున్
జనియెం గామ సహస్రసుందర వపుశ్శ్యామప్రభాదీప్తతిన్
ఘనతం గప్పఁ బవిత్రితాఖిల జగత్కాండుండు శ్రీరాముఁడున్ 109

— సీతారామలక్ష్మణులు పాదచారులై చనుచుండఁ
బురజనులు దమలోఁ భాషించు సంభాషణము —

తే॥ దారి మొగు లేదు మెఱుఁగుల దారినడచు
జానకీ రామలక్ష్మణ సరణిఁ గాంచి
కేకయాత్మజ వరముల గేవలంబు
దలఁచి వగగుంది పౌరులు బలికి రిట్లు. 110

మ॥ అరరే! రాజతికాముకుం డగుచు సత్యాత్మున్ బ్రియుంబుత్రునిన్
దరుణీమోహనిమిత్తమై విడిచె నేతాదృగ్జనాధీశుఁ డిం
పరయంగా నెటు సత్యవత్తత స్మరవ్యాధి పరిభిన్నాత్ములౌ
పురుషుల్ గారవ సత్యధర్మముల సామాలంబుఁ బోకార్పరే! 111

తే॥ కేకయాత్మజ దుష్టయే • కాఁగనోపు
క్రూరకర్మిణి మూఢధీ • భూరిదోష
యనఁగఁ జెల్లుఁగాని యతిప్రి•యంకరుండు
నైన రాముని వని కెట్టు • లంపె నితఁడు. 112

తే॥ మనము పురిసుండఁ దగదింక • జనములార!
రామ లక్ష్మణ జానకీ • రమణు లెటకుఁ
జని వసింతురో మనమటుం • జనిన సౌఖ్య
మబ్బు ధర్మ సంచ్యుతి గల్గ • దనరె ధరణి. 113

క॥ మానుగఁ గంటిరె మీ రీ
జానకి నెపుడైనఁ బాద • చారిణిగాఁగన్
జానపదులవలె నేలను
రా నడచుచు రాణివాస • రమణీమణినిన్. 114

వ॥ జనకధరాధినాథసుతఁ • జారుతలోదరి లోకసుందరిన్
గనుటకు నన్యపూరుషుల • కాంతుయుఁ గల్గిన నబ్బుచుండె నా
జనసముదాయ మధ్యమునఁ • జక్కఁగ నేగెడి కల్కి లేము లో
క్క నిముసమంచె మానవునిఁ•గాదన నౌననఁ జేయునెవ్వఁడన్. 115

తే॥ సర్వలోకైకసుందరు • సత్యమూర్తి
రాఘవుఁడు పాదచారియై • రాజపథము
నందుఁ జనుచుండెఁ గరిరథా•శ్వాదిరహితుఁ
డగుచుఁ గాంచరె యేలాటి • యాగడంబొ! 116

తే॥ కైకయీనామ రాక్షసి • కఠినహృదయ
సర్వనాశని కలిగె నీ • సరణి రామ
చంద్రు వెతలఁ గుందఁగఁ జేయ • సత్కులంబు
చెడ జనించెద రీలాటి • చెడిపె లకట! 117

క॥ మృదుపదయానతఁ జని యెడు
మదిరాక్షిని సీతఁ గాంచి • మహినాథుఁడు తా

మదిఁ బొగులఁగఁ జొచ్చెను నా
పద గడవంగా వశంబె • బ్రహ్మాదులకున్. 118

క॥ దైవమె బలవంతం బిట
భావింపఁగఁ బుంప్రయత్న • బలహీనము నిం
దే వగ సాధుపరీక్షా
ధావితముగదా ధాత్రి • దైవం బనఁగన్. 119

—♦ వామదేవ వాక్యము ♦—

క॥ అని సత్పురుష సమూహము
మనోగతార్తినిఁ జరింప • మహితాత్ముఁడు వా
మనుఁ డను విప్రుఁడు వారల
గని వచియింపఁగ దొడంగెఁ • గడు వేగముగన్. 120

క॥ సీతారాములకై మన
మీతరి దుఃఖింపఁదగిన • దేమున్నది మీ
చేతము లలరఁగఁ దెలిపెద
నీ తత్త్వార్థమును వినుఁడి • దే వచియింతున్. 121

ఉ॥ ఏయెడ విష్ణుమూర్తిఁ బరు • నెవ్వని భక్తిని గొల్తు రాదినా
రాయణుఁ డీ రఘూద్వహుఁడు • రాజిలసీత యె యోగమాయ నాఁ
బాయని లక్ష్మి మాయఁగొని • వాఁడిటు లాగుణయుక్త నామ భే
దాయిత రూపధారియయి • ధాత్రినిఁ బాలనఁ జేయుచుండెడిన్.

క॥ కనుఁడీ లక్ష్మణ సంజ్ఞుఁడు
ననఘుండౌ నాదిశేషుఁ • డరయఁగ నిపు డీ
తని ననుసరించియుండెను
మనములఁ బొగులంగ నేల • మహనీయులకై. 123

వ॥ ఇతఁడు మాయాగుణ యుక్తుఁడై తత్తదాకారుఁడై కర్మ
జన్యపాంచభౌతిక మాయిక గతి విహరించు. 124

శా॥ ఆ నారాయణుఁడుం దా రజోగుణయుతుండై సృష్టిచింతించు సం
ధానించుం జతురాననుం డనఁగ బ్రహ్మాండంబునం గాంచ వాఁ
డీ నీరేజదళాక్షుఁడే హృదయ సంతృప్తిం భ్రమాహీనులై
ధ్యానారాధనఁజేయఁగాఁజన రెసత్తామాత్రునిం శ్రోత్రియుల్. 125

క॥ వరసత్త్వావిష్టత నీ
ధరణిని విష్ణుం డనంగఁ దగి లోకములం
బరిపాలించెడి వాఁడీ
కరుణాలుఁడు రామమూర్తి కాదే తలఁపన్. 126

క॥ వరుసఁ దమో గుణయుతుఁడై
వర రుద్రాకృతి ధరించి వసుధాప్రళయ
స్ఫురదురుగతి మనువాఁడీ
కరుణాలుఁడు రామమూర్తి కాదే తలఁపన్ 127

క॥ మును మీనాకృతి నీతఁడె
మనువును వైవస్వతాఖ్యు మహికింబ్రళయం
బున నావమాప్తి రక్షిం
చెను సామాన్యుఁడె యితండు శ్రీరాముఁడనన్. 128

క॥ మును నీరధి మథియింపఁగఁ
జనినప్పుడు మంథరాద్రి చన సుతలంబుం
గనఁ బృష్ఠంబున మోచిన
ఘన కమఠాకృతి యితండె కాదే తలఁపన్. 129

క॥ ధరణి రసాతలగత దు
ర్భర విలయంబున వరాహ భవ్యాకృతి ను
ద్ధరణ మొనర్చిన వాఁ డీ
సరసిజ నాభుండు రామచంద్రుఁడె కాదే. 130

క॥ నరసింహాకృతి గొనియెను
ధరఁ బ్రహ్లాదాఖ్యుఁ బ్రోవ దైత్యాధిపుఁ డా

సురవైరి కనకకశిపునిఁ
బరిమార్చిన వాఁడు గోట • వాఁ డితఁడె కదా. 131

క॥ తనసుతు రాజ్యము బోయిన
ఘనభక్తిని గొల్వ నదితి • కాంక్షను దీర్పం
గను వామనుఁడై బలి యా
చనఁ జేసిన ఘనుఁ డితండె • చయ్యనఁ గనుఁడీ. 132

క॥ మును భార్గవరాముఁడు నా
మని దుష్టక్షత్త్రియ తతి • మాయించిన పా
వన చారిత్రుఁడు నా నీ
యినకులచంద్రుండ కాఁడె • హృదిఁ దెలియంగన్. 133

క॥ అతఁడె జగన్నాథుఁడు ప్ర
స్తుత మీ రామత్వ మంది • దోషాచరసం
హతకుండు రావణాదుల
నతులితఁ గోటాను కోట్ల • హత మొందింపన్. 134

క॥ చనుచుండె వనుల కిప్పుడు
మన మజ్ఞానుల మయి యిటు • మదిలో దూలం
బనిలేదని నేఁ దెలిపితి
మన మాతని పేరుదలఁచి • మనుదము నెమ్మిన్. 135

ఉత్సాహము॥ ఆదురాత్ముఁడైన రావ•ణాసురుండు జావఁగా
మేదినీతలంబునందు • మేలుగా మనుష్యుఁడే
మోద మొప్పఁ గారణుండు • భూమిభార మాపఁగన్
సాదరంబుగాను బూనె•నవ్య యాత్ముఁ డీతఁడున్. 136

క॥ ఇనకుల చంద్రుఁడు దశరథ
జనపతి పుత్త్రత్వ కాంక్షఁ • జయ్యన గొలువం
గనె నాతని పుత్త్రుఁడునై
జనియించెను విష్ణుమూర్తి • సదమల మతిఁ దాన్. 137

క॥ ఆ విష్ణుఁడె శ్రీ రాముఁడు
భావింపఁగ రావణాది ♦ వధకొరకె కదా
యావని కేగుట లక్ష్మణు
తో వెడలుచు నుండె ముదము♦తో రాముఁ డిఁకన్. 138

క॥ హరి మాయ యీ ధరాత్మజ
వరుసన్ సృజియింపఁ బెంపఁ ♦ బ్రళయముఁ జేయన్
సరగున కారణ భూతయ
యరయుఁడి సీతా నళినద♦ళాక్షి యనంగన్. 139

క॥ ధారుణి నాథుఁడు గైకయు
గారణు లణుమాత్రమైన ♦ గానోపరు వి
స్తారత నారదసంయమి
ధారుణి భారంబు వాపఁ ♦ దగ భాషించెన్. 140

క॥ వనమునకు నేగ దేవని
మునిచంద్రునితోడఁ బల్కెఁ ♦ బురుషోత్తముఁ డీ
యినకుల రాముఁడు స్వయముగ
మనమున గుందంగఁ దగదు ♦ మాధ్యత తోడన్. 141

ఉత్సా॥ రామ రామ రామ రామ ♦ రామరామ యంచు శ్రీ
రామనామ జపము నియతి ♦ రాజిలంగఁ జేసినం
బాములన్ని తొలఁగు మిత్తి ♦ భయము లేదు మానవుల్!
ప్రేమమీర రామజపము ♦ వేగఁ జేయఁ బూనుఁడీ. 142

ఉ॥ ఇట్టి మహానుభావుఁడగు ♦ నీరఘురాముని దుఃఖజాలముల్
చుట్టుకొనంగ డాయునె య♦శోవిభవప్రథిత ప్రభావునిన్
బట్టుగ రామనామమును ♦ బాయనిభక్తి జపింప ముక్తియున్
గట్టిగఁ జిక్కు నీకలియు♦గమ్మున నెమ్మదిఁ జిత్తశుద్ధియున్ 143

। ఇతరపు సంగతు లెయ్యవి
యతిశకించిన మోక్షమబ్బు ♦ టరుః దగు రాము

స్తుతియుఁ బరంపరము క్తికి
నుతకారణమనియుఁ గనరె • నుతగుణచరితుల్. 144

శా॥ లోకాచారముఁబూని లోకకరుఁడౌ • లోకాధినాథుండు న
స్తోకప్రఖ్యాత భక్తసంఘభజన • స్తోత్రక్రియారాధన
శ్లోకవ్యాప్తికి రావణాసురవధా • సూత్రింబు జేపట్టి యీ
లోకంబందు జనించినాఁ డితఁడు మీ • లోమీరె భావించుఁడీ! 145

ఉ॥ మానవనాథువాంఛలను • మానుగఁదీర్చఁగ నిశ్చయించియుఁ
మానవదేహమాశ్రయము • మైకొనె నాపరమేశుడంచు నా
మానితమూర్తి వామనుఁడు • మౌనికిఁ దెల్పియు మిన్నకుండెఁ ద
న్మానస దుఃఖశాంతికిని • మం దది విజ్ఞత గౌరవాఢ్యమా. 146

చ॥ అనవిని పౌరు లందఱు ని•రామయుఁడంచును వ్యాపకుండటం
చును మదిగుర్తెఱింగియును • స్ఫూటిగ సంశయ సంధిబంధముఁ
మనముల వీడి రాముని స•మంజసరీతిఁదలంచి ధ్యానముఁ
మునుకొని చేయుచుండి రిలఁ • బూజ్యసుభక్తివిజ్ఞానయుక్తులై. 147

వ॥ ఈ సీతారామరహస్యంబు నెవ్వరు నిత్యంబు బఠింతురో వారు విజ్ఞానపూర్వక భక్తి దృఢముగ రామునియందు నిలుపఁగలుగుదురు. మిక్కిలి రహస్యంబును మిూకు గోప్యమైనదియు నైనది. మీరు రాఘవప్రియులని భాషించి యాబ్రాహ్మణుండు వెడలెను. పౌరులు శ్రీరామునిఁ బరమాత్ముండని తెలిసికొనిరి. 148

తే॥ అవల రాముఁ డవారితుం • డయ్యుఁ దండ్రి
యింటికింజొచ్చి సీతయు • వెంట రాఁగ
సోదరుం డగు సౌమిత్రి • సాదరమునఁ
గేకయాత్మజఁ గనిపల్కెఁ • బ్రకటముగ. 149

శా॥ తల్లీ! ముగ్వురమేము వచ్చితిమి చి • త్తప్రీతి నీ కొటకై
యుల్లాసంబున నిశ్చలాత్మకుల మై • యున్నార మింకేల భ్రా

జల్లిలాగతిఁ గానకేగుటకు వి ♦ శ్వాసంబునం దండ్రిగా
రుల్లంబందున నెంచి యాజ్ఞనిడు డే ♦ నోజం బ్రియాణంబుగాన్. 150
చ॥ అనవిని లేచి దిగ్గన వ్రా ♦ దంతరమందున సంతసించుచుం
గొనకొని రామలక్ష్మణులకున్ జనకాత్మజకుం బ్రియమ్మునన్
ఘనమగు నారచీరలను ♦ గట్టగనిచ్చెను వేరువేరుగా
ననువుగ రావణాసుర వ♦ధార్థపుదీక్షయె నాఁగఁ గైకయున్. 151
తే॥ రామలక్ష్మణు లిర్వు ర♦రణ్యవాస
యోగ్యమగు నారచీరల ♦ నోర్మిగట్టి
రమల పీతాంబరావళు ♦ లన్ని వీడి
కార్యసాధక దీక్ష లీ ♦ కరణిగావె. 152
చ॥ జనకజ నారచీర లను ♦ సంగతియుం దెలియంగ రామి చే
కొని కడులజ్జతోఁగనియెఁ ♦ గూరిమి రాముని మోమున దమ్మి తాఁ
గని ముని వల్కలమ్ములను ♦ గైకొని సీతకు నంశుకోపరిన్
అనువుగఁ జుట్టె రాముఁడిఁక ♦ నాపదదాట నశక్య మేరికిన్. 153
వ॥ అది కని రాజదార లంద ఱొక్కపెట్టునఁ బట్టజాలని దుఃఖ
మ్మున రోదనం బొనర్చిన వసిష్ఠుండు విని కోపంబున వారల బెదరించు
చుఁ గైకేయితో నిట్లనియె. 154

—♦ వసిష్ఠుఁడు కైకను నిష్ఠురము లాడుట ♦—

క॥ వనవాస మొనర్పఁగ నీ
మునమున రాముఁడె కదా ని♦మంత్రితుఁ డయ్యెన్
జనకజకు నారచీరలఁ
బని యేమి దురాత్మురాల♦పనివడి యిడఁగన్. 155
ఉ॥ సీత పతివ్రతాతిలక ♦ శ్రీరఘురాముని వెంట నేగఁగాఁ
జేతమునందు నెంచినను ♦ జిత్రచిరత్న సమస్తకాంతి సం
పూత సదంబరాభరణ♦భూషితయై వనవాసదుఃఖముల్
పాతము జేసి మోదమున ♦ వర్తిలఁ జేయుత రాము నిత్యమున్. 156

తే॥ లేదు నీమాటఁ బాటించు • వాఁడటంచుఁ
గనికరం బన్న నీయందుఁ • గానఁబడక
ఘోరకార్యంబు నొడిగట్టి • క్రూరబుద్ధిఁ
జనఁగఁ బూనితి వెంతటి • సాహసంబె? 157

వ॥ అంత దశరథ భూవిభుండు సుమంత్రుని గాంచి. 158

క॥ అనఘా! రథముం దెమ్మా
వనికి రథారోహణు లయి • వనచరహితు లొ
య్యన జనఁదగు నన సచివుం
డును దేరును దెచ్చి యధిపుఁ•డుం గన నిలిపెఁ. 159

వ॥ అంత సీతారామసౌమిత్రులఁ గడచూపు గాంచి దుఃఖంబున
మునిగి పుడమిం బడి యశ్రుపరిప్లుతుండై రోదన మారంభించెను. 160

క॥ గౌరవయోధ కరకంపిత
హారలు విత్రస్తముగ్ధ • హరిణీసదృశ
స్ఫురిత కటాక్షముల నడం
తురు పురుషుని ధీరతను స•తు లబల లాహా! 161

—: ఆశ్వాసాంతము :—

శిఖరిణీ.

పరిత్రాణాపేక్షా భువనవిలయా•పత్ప్రదహనా
నిరాలంబా సాంబా నిరుపమపదా • నీరద తను
స్ఫురద్భస్మాలేపా త్రిపురహరణా • పుణ్యనిలయా
పరంధామా రామా వనివిచరదా•పాలనపరా! 162

తోటకం.

శరణాగతరక్షణ • చంద్రకళా
ధరపర్వతరాజసు • తార్చిత స
చ్చరణా కరుణాలయ • సంయమిహృ
త్సరసీరుహభృంగమృ•దంగధరా. 163

చ॥ వనచరసాధుమౌని పరి • పంథివినాశక రామచంద్ర హృ
ద్వనజనివాస లోకనుతి • పాత్ర జనార్దన పాపశోషణా
ఘనగజచర్మచేల గత • కల్మష వేదతరంగమాలికా
దినకర చంద్రకోటి చయ • దీవ్యదనంతవిలాస శంకరా! 164

గద్యము॥ ఇది .........శ్రీమదాంధ్రాధ్యాత్మ
రామాయణాంతర్గతంబగు నయోధ్యాకాండంబున
రామవనవాస ప్రయాణాలాపక

ద్వితీయాశ్వాసము



# అయోధ్యాకాండము

—•—

## తృతీయాశ్వాసము.



కర గౌరీనాయక
లోకావన పుణ్యపురుష • లోకాధ్యక్షా
లోకానందా సుందర
రాకేందు కళాభరణ! హ•రా! బ్రహ్మేశా! 1

వ॥ అవ్వాల నెట్టెటు రామలక్ష్మణ ధరణిజా వనవాసగమన విధానంబును వీనుల విందొనరింపవే యన నా సారంగధరుండు. 2

—• సీతారామలక్ష్మణులు రథారూఢులై వనవాసమున కరుగుట •—

తే॥ సరవి దుందుభివత్సర • చైత్రశుద్ధ
పంచమీతిథి వారలు • పయనమైరి
కలుగ బట్టాభిషేక విఘ్నంబు లోక
హితుల కెందైన సౌఖ్యంబు • లతుకు టరుదు. 3

తే॥ చూచుచుండంగ రాముఁడు • సుదతి సీత
రథము నెక్కెను తనమనో•రథముదీర
ననియొ పతివెంటఁ జనుటాయె • ననియొ లేక
వనచరప్రియ కార్యకృ•ద్ఘన ముదంబో? 4

క॥ అనువుగ రాముఁడు దండ్రికిఁ
దనరఁ బ్రదక్షిణము సేసి • తా రథమెక్కెన్
ధనువులు దూణయుగమ్మును
గొని సౌమిత్రియు రథంబు • గొబ్బున నెక్కెన్. 5

తే॥ రథము నెక్కియు సౌమిత్రి • రయముగాను
సారథిని గాంచి నడుపుమీ • తేరు ననిన

రాజు దశరథుఁ డిట్లనె • రథము నిలుపు
మో సుమంత్రాఖ్య ! నిలుపుమీ • వాక్యతృటిని. 6

క॥ చనుమా యిక నిలుపకుమా
మన రథము సుమంత్రి వేగ • మహితాటవి కీ
వని రాముఁడు బ్రేరేచినఁ
జనుచుండిన రామరథము • జనపతి కనియున్.  7

క॥ కనికని రాముఁడు దూరం
బును జన మూర్ఛితుఁడయి యట • భువిపైఁబడియెన్
వనితా వశమానసులౌ
జనులకు నీలాటి వెతలు • సహజమకాదే? 8

ఉ॥ పౌరులు బాలవృద్ధులును • బ్రాహ్మణసత్తము లాదరంబునన్
శ్రీరఘురామ నిల్వుమిటఁ • జేరువరాఁగ నిమేష మాగు మో
నీరజనేత్ర యొక్కపరి • నెమ్మది నీదగు మోముదమ్మి నిం
పారఁగఁ గాంచనిమ్మనియు • నాతుర మొప్పఁగఁ బిల్చుచుండిరన్. 9

వ॥ దశరథుఁడు బహుకాలం బటనుండి కన్నీరు మున్నీరుగఁ గార దుఃఖించి పరిచారకుల నీక్షించి రాముని తల్లియగు కౌసల్యా నికేతనం బునకుఁ గొనిపొండు దుఃఖితుండ నగునాకు, 10

తే॥ కోసలాత్మజ కడనున్న • గొంతవఱకుఁ
బ్రతికియుండ దటస్థింప • వచ్చు దైవఁ
యోగమున రాముని విడచి • యుండ నోప
నిలను చిరకాలజీవినై • యేవగింప. 11

ఉ॥ కోసలపుత్రి గేహమునకుం జని మూర్ఛనుజెంది ధాత్రిపై
వాసిని దూలివ్రాలి యటుపైఁ దెలివొందియు మానముద్రిఁ దై
వేసవిఁ గాసిలం దిరిగి • వేసరి చల్లనిమ్రాకునీడలం
డాసి సుఖించువాని గతి • నాగ ధరాధిపుఁడుండె నంతటన్. 12

—♦ తమసాతీరము ♦—

మ॥ తమసాతీరముఁ జేరి వార లట సం♦ ధ్యాకృత్యముల్ తీర్చి నీ
రములం గ్రోలి మృదుప్రవాళలతికా♦ రమ్యాసనాసీనులై
రమణీయామల గంధవాహ విచల♦ ద్రిమ్యాగమూలంబులన్
బ్రముదం బొప్పఁగ విశ్రమించిరి జగ♦ద్వంద్యుల్ నిరాహారులై.

క॥ జానకీతోడుత రాముఁడు
మానుగ జగతీవిభుండు ♦ మహీభృన్మాల
స్థాన లతాశయ్యను నిశి
నా నదితటమందు నున్న ♦ నంతట నచటన్. 14

తే॥ ఆ సుమంత్రుతోఁగూడ ధ♦ ర్మానుగతిని
వరుస సౌమిత్రి శర ధను♦ష్పాణియగుచు
లోకసామాన్యముగఁ గాచె ♦ లోకవిభుని
లీల లేమని వివరింపఁ ♦ జాలునాత్మ. 15

వ॥ అప్పుడు వెంబడించిన పురజనులు రామున కనతిదూర
మున నిలిచి, 16

తే॥ మనము రాము నయోధ్యకుఁ ♦ గొనిచనంగ
శక్తి గలవారమైనచో ♦ సరియె లేని
యెడల వనవాస మొనరింప ♦ నిపుడె పోద
మంచు నిశ్చయించి రటంచు ♦ నతఁడు దెలిసి. 17

శా॥ అత్యాశ్చర్యము నంది రాఘవుఁడు నే♦ నా? యూఁకింబోవ వీ
రత్యార్తిం గృశియించువారలు గద♦య్యా యింక నేతన్మన
స్సత్యస్థాపన మాచరింపఁ దగునో ♦ స్వామీ! సుమంత్రా! యనెన్
సత్యప్రజ్ఞులు యత్నకార్యఘటనా ♦ చాతుర్య నిత్యాత్మకుల్. 18

చ॥ అనఘ సుమంత్రి యిప్పుడె మ♦ దాజ్ఞ రథంబిటు దెమ్మటంచు నా
జ్ఞ నిడఁగఁ దేరి వాజులను♦ జక్కఁగఁ గట్టియుఁ దెచ్చి ముందుగా

నిలిచిన రామలక్ష్మణులు • నుర్వీతనూజయుఁ దేరునెక్కి వేఁ
జనిరటు కొంతదూరమును • జక్కనయోధ్యపథంబు బట్టియున్.

వ॥ పోయిపోయి పౌరులకుం దెలియరాకుండ నట్లాక యరణ్య మార్గంబుం బట్టి రథంబు నడపించుకొని యేగుచున్నంత నిటఁ బౌరు లా రాత్రి గడపి ప్రాతఃకాలంబున రామునిం గానక యతిదుఃఖితులై. 20

సీ॥ ఈజాడ నేగె నీ • భూజాని సౌమిత్రి
జానకీ సహితుఁడై • కానఁ గనరె
యీదారిఁ జనియె నీ • యిందీవరాక్షుండు
రథనేమి గతమార్గ • రాజిఁ గనరె
యీచక్కిఁ బోయె నీ • యినవంశ చంద్రుండు
చంద్రశీతల శిలా • సమితిఁ గనరె
యీపొంత నడచె నీ • శ్రీపద్మ శంఖాది
పాదాబ్జరేఖల • పంక్తిఁ గనరె
తే॥ యనుచుఁ బౌరులు దమలోన • వనజనాభుఁ
డరిగిన పథంబుఁ గాంచుచుఁ • బురికిఁ జనిరి
వారు సతతంబు జానకీ•ప్రభుపదాబ్జ
యుగళి ధ్యానించుచుండి ర•యోధ్య నిచట. 21

—• సీతారామ లక్ష్మణులు నదీతరణంబుఁ జేసి గుహుని వాసమున కరుగుట •—

వ॥ చైత్రశుద్ధ షష్ఠినాఁ డుదయంబున వారలు బయలుదేరి

తే॥ అలసుమంత్రుండు నాదర • వ్యాప్తిరథము
నతిరయంబునఁ దోలంగఁ • గుతలపుత్రిఁ
గూడి సంవృద్ధ నగరాళిఁ • గొమరు మిగుల
గనుచు మురియుచు రాముఁడు • కడురయంబ. 22

వ॥ చనిచని ఉభయకూల విశాల శ్రీమదాశ్రిమనివాస సంయమిగణ సేవితంబును శైవల రహితదివ్య నిర్మల పుష్కరవిలసితంబును దేవగంధర్వ కిన్నర కింపురుషోపశోభితంబును దేవపద్మినీ విమలోత్పల షండ మండితంబును హంససారస చక్రవాక జలకుక్కుట కారండవ క్రౌంచాద్యనేక కవిగణనినదవిరాజితంబును శింశుమార నక్ర భుజంగ వనవారణాద్యనేక మృగాకీర్ణంబును రంగదుత్తుంగతరంగరసనిమగ్న పరమహంసగణావేష్టితంబును గంభీరవిస్తారావర్త విలసితంబును ఫలపుష్ప కిసలయాన్విత తరు గుల్మ లతాకుంజ మంజులదరీ విరాజితంబును ధూర్జటి జటాజూట నిర్గతపావనచారిత్రియు నాకాశమార్గ విహారియునగు నది నీక్షించి తత్తటంబునఁ డిగి ప్రాతఃకృత్య సమాప్తిఁ గావించి నమస్కృతుల సలిపి; 23

క॥ చని శృంగిబేరపురమున
కు నతిసమీపమున విడిసి ♦ కువలయ హితుఁడుక్
వనజోదరుఁడగు రాముఁడు
ఘనతర సానంద హృదయ ♦ కమలుం డగుచుక్. 24

క॥ ఘన శింశుపాగమూలము
నను నాసీనుండునయ్యె ♦ నవశారద పా
వన దేహుఁడు గుణమాన్యుఁడు
మునిజనహృదయానురాగ ♦ పూజితయశుఁడుక్. 25

## —♦ గుహాగమనము ♦—

క॥ రామాగమన మహాత్సవ
మామోదమునఁ గంద వినియు ♦ నట మానులచేఁ
బ్రేమాదరణపురస్సర
ధీమహితుఁడు గుహుఁడు వచ్చె ♦ దివ్యసుభక్తిక్. 26

చ॥ తనకుసఖుండు నాయకుఁ డు♦దారుఁడు రాముని గాంచు వేడుకక్
ఘనతర భక్తియుక్తుఁడయి♦గౌరవమొప్పఁగఁ బ్రేమమీరఁ దె

చ్చిన మధుపుష్పకందములఁ • జె ల్వమరంగఁ దదగ్రమందు నుం
చి నిరుపమ ప్రమోదమును • జెంది నమస్కృతు లాచరించియున్. 27

తే॥ సాగిలింబడియున్న ని • షాదపతిని
గుహుని లేవంగనెత్తి స • త్కుదగ్రహృదయ
నిర్మలామోదయుక్తుఁడై • నెయ్యమొప్పఁ
గాఁగిలించెను రాముఁ డు • త్కర్ష మెరయ. 28

తే॥ ఇపుడు ధన్యుండ నైతినే • నీ నిషాద
కులము పావనంబయ్యె స • త్ఫలము నందె
జన్మ, భవదీయదర్శన • స్పర్శనముల
ననియె గుహుఁడు ప్రాంజలి బద్ధుఁ • డగుచు వేడ్క. 29

ఉ॥ ఓరఘువీర! నామనవి • నోర్మిగ్రహింపు నిషాదరాజ్య మిం
పారఁగ నీకుఁ గింకరుఁడ • నైచను నాయది నీ యధీనమా
వారక నెమ్మదిం జిరని • వాసమొనర్చి తదీయపాలనన్
గీరితిఁగాంచు మో యనఘ • కేవలవాంఛ మదాత్మకద్దియున్. 30

చ॥ అనఘ! నిషాదరాజ్య మిది • యా ఫల మేమియొ యేమిచేయఁగాఁ
జనవలె నంచునే దెలియఁ • జాలను మీదగు ప్రాపుఁ జేరి యే
మనయము కాలముం గడుప • నాత్మ దలంతును ధారుణీశ యిం
చనియె మహాత్ములం గనఁ బ • రార్థవిచారులు గారె మానవుల్. 31

తే॥ వచ్చి దయను మాగృహము పా • వన మొనర్చి
యమల ఫలకందమూలాదు • లారగించి
చనఁగఁ గోరెద శ్రీరామ! • జలజనయన!
నీకు దాసుఁడ శరదభ్ర • నిర్మలాంగ! 32

క॥ వినయం బొప్పఁగ గుహుఁ డిటు
లన రాముఁడు వానిఁగాంచి • యత్యాదరణం
బున భాషించిన తెఱఁగిటు
వినవే బింబాధరోష్ఠి • విమలేందు ముఖీ! 33

మ॥ వినుమా! మిత్రమ ప్రీతితోఁ దెలిపెదన్ ♦ వేగంబ నామాట నీ
వనిలోనం బదునాల్గు వర్షములు నే ♦ వాసంబు గావించి వ
చ్చినచో గ్రామ గృహప్రవేశమును పా♦సిస్మరఁ జేయంగ నా
ను నిషాదాధిప యంచనెన్ రఘువరుం ♦ డుం గూర్మి రేకెత్తగన్.
మ॥ ఫలమూలాదిక మన్యదత్తములు నే ♦ భక్షింపఁగా నొల్ల ని
ష్కలుషాత్మా! విను రాజ్యమంతయును మ♦త్సామ్రాజ్యమే యౌను నీ
విల నాకాప్త సఖుండవై తివిగదో ♦ యీ! శంక నీకేల బో
యలతేఁడా! కడువల్లభుండవగుటన్ ♦ హర్షింతు నిన్నెప్పుడున్. 35

వ॥ ఆశుద్ధసప్తమి.

క॥ అని రామచంద్రుఁడు గుహుం
గనియు వటక్షీరములను ♦ గైకొని రమ్మ
న్న నతండు భక్తిఁ దెచ్చినఁ
గొనియు జటామకుటధారి ♦ గొబ్బున నయ్యెన్. 36

క॥ అట లక్ష్మణుండు గట్టెను
జటలను మకుటంబునాగఁ ♦ జయ్యనఁ గార్య
స్ఫుటచతురాత్ములు ధీరులు
పటుతర సమయానుకూల ♦ బద్ధులు గారే? 37

వ॥ సీతాసమేతంబుగ రాఘవుండు జలమాత్రప్రాశన మాచరించి సౌమిత్రిచే నొనర్పఁబడిన కుశపర్ణ పర్యంకతలంబున నగరప్రాసాదాగ్ర విలసిత రత్నస్థగితహంసతూలికా తల్పంబున మున్ను శయనించు చందంబున విదేహరాజతనూజతోఁగూడ సుషుప్తి నందినంత,

చ॥ అవల విదూరమందున శరా♦సన యుక్తుఁడు లక్ష్మణుండు రా
ఘవు నటఁగావఁగా నిశినిఁ ♦ గాననవాస కిరాతనాథుడుం
బ్రవిమల భక్తితోడయి వి♦రాజిల నచ్చట జాగరూకుఁడై
నవితథరీతి సోదర స♦హాయము గల్గుట లెంతవారికో! 39

తే॥ అన్నిదిక్కుల గమనించి ♦ యరసి యరసి
రాముఁ గామచు నుండెనా ♦ రాత్రి నతఁడు
సకలజగముల రక్షించు ♦ చతురు నొకఁడు
గావఁ జనె నన్న చిత్రమా ♦ గాదె తరుణి! 40

—♦ లక్ష్మణ గుహుల సంభాషణము ♦—

తే॥ పర్ణశయ్యను నిదురించు ♦ పద్మనాభు
రాము నీక్షించి కన్నీరు ♦ రాఁగ గుహుఁడు
వినయ మొప్పంగ సౌమిత్రిఁ ♦ గనియుఁ బలికె
సహజసాదర హృదయు లీ ♦ సరణి ధరణి. 41

సీ॥ భవనోత్తమంబున ♦ స్వర్ణ పర్యంకంబు
నందున శయనించి ♦ యలరు నెవఁడు
సీతా సమేతుఁడై ♦ చిరభాసు రామల
స్వాస్తీర్ణమందున ♦ నలరు నెవఁడు
సాకేత నగరోప♦సదమలోద్యాన చం
ద్రోపల వేదిక ♦ నుండు నెవఁడు
సామంత మునిజన♦ స్తవనీయ మహనీయ
మూర్తినా నుతిఁ గాంచు ♦ పుణ్యుఁ డెవఁడు
తే॥ జనుల పాలిటి కల్పాగ♦ మనెడు నట్టి
వాని ధరణిజా సహితుఁడై ♦ వనులఁ గటిక
నేలఁ గుశపత్రశాయియై ♦ నిదురబోవఁ
గన్నవాఁడవె లక్ష్మణా! ♦ యన్న వరుస. 42

వ॥ కైకేయి రామదుఃఖకారణంబుగ దైవకల్పితము. మంథరా బుద్ధి నధిష్ఠించి యారాణి పాపమాచరించె నన సౌమిత్రివిని యిట్లనియె.

మ॥ అనఘా! నావచనంబులన్ వినుము సౌ♦ఖ్యావాప్తిఁ జేకూర్పఁగాఁ
జనువాఁ డెవ్వఁడు గష్టరాజి నిడఁగా ♦ సామర్థ్య మెవ్వాని కా

తనపూర్వార్జిత కర్మకారణము విస్తారంపు సౌఖ్యావళీ
ఘన కష్టంబుల కెందుఁ గాంచినను లోకంబందు నెల్లప్పుడున్. 44

సీ॥ సుహృదులు మిత్రులు • నూటి శత్రుగణంబు
ధర నుదాసీనులు • విరివి గాంచ
ద్వేషులు ధర్మంబు • దీర్చెడువారలు
బంధుపుత్రాది సంబంధజనులు
కల రేమిచేయ రేవలనైన వారలు
కలిగించు నాయాయి • ఫలవిధంబు
కర్మంబె సుఖమేని • కడుదుఃఖ మేనియుఁ
దనకర్మ వశమునఁ • దగిలియుండు

తే॥ నేదియెటువచ్చు నట్టులె • యెందు నరుఁడు
ననుభవింపుచు నద్దాని • నతిరయంబ
స్వస్థహృదయుఁడై చరియింప • వలయునయ్య
గుహుఁడ! కాంచుము నీ యాత్మ • నహరహంబు. 45

చ॥ ఘనసుఖ భోగముల్ గలుగఁ • గావలె నం చని లేదు కష్టముల్
తను భుజియింప నొల్ల నని • తద్దయుఁ గోరిక లేదు నాకు నెం
దునఁ గన నబ్బుగాక కడు • దుఃఖమె సౌఖ్యము నాకు లేక పో
యిన నొకరీతి నుందు మది • నెప్పుడుకా నిల భోగవశ్యుఁడన్. 46

శా॥ ఏకాలంబున నేమికారణముచే • నెవ్వో నెవం డెట్టు లే
యే కర్మంబులఁ దా శుభాశుభ విధిన్ • యింపొప్పఁ గావించునో
యాకాలంబున నట్టి కారణముచే • నచ్చోట నన్నాని కా
యా కర్మంబులు నిత్యమై యనుభవంబౌఁ దప్ప దెప్పట్టునన్. 47

వ॥ శుభాశుభ ఫలోదయంబున హర్ష విషాదముల నందఁ బని లేదు. విధాతచే విధింపఁబడిన దేదియో యది యెల్ల సురాసురుల కైన నలంఘ్యము. 48

క॥ అనయము ప్రత్యవరుహ్యాత
జనుఁ డిల సుఖదుఃఖ సమితి ♦ జనుచుండెడి యీ
తను వనఁగఁ బుణ్య పాపము
లను జనియించె సుఖదుఃఖ ♦ లక్షణ యుతమై. 49

తే॥ సుఖము తరువాత దుఃఖంబు ♦ సూటిఁ దనరు
దుఃఖ మొందిన తరువాత ♦ దొడరు సుఖము
జంతువితతికి నీరెండు ♦ సంగతులును
ధర నలంఘ్యంబు దినరాత్రి ♦ కరణిగాను. 50

తే॥ సుఖము నడుమనె దుఃఖంబు ♦ సూటిఁ దనరు
దుఃఖ మధ్యంబునందునఁ ♦ దొడరు సుఖము
నవియు నన్యోన్య సంయుక్త ♦ మగును రెండు
జలము పంకంబు మెలఁగెడు ♦ చందమునను. 51

ఉ॥ కావున పండితోత్తములు ♦ గాంచి సమస్తము మిథ్యయే యనన్
భావనఁ జేసి యిష్టముల ♦ బ్రాప్తి కనిష్ట విచారసంగతిన్
బోవఁగరా దటంచు మదిఁ ♦ బూనియు ధైర్యము మోదమున్ గనన్
జేవఁగనెంచఁ బోరు వెతఁ ♦ జెందరు కుందరు నీ వెఱుంగుమా. 52

చ॥ లలితగతిన్ నిశీథి గుహుఁ ♦ లక్ష్మణమూర్తుల భాషణంబు లు
జ్జ్వలగురుబోధ గావున సుభం బతినిర్మల మయ్యె బ్రహ్మ వి
ద్యల పరిపూర్ణ సత్కరుణ ♦ దార్కొనినన్ భవబంధ మోచనం
బలరి రవిప్రదీప్తి నలరారుట చిత్రమె ధాత్రి పార్వతీ! 53

తే॥ స్నానసంధ్యాది కృత్యముల్ ♦ సలిపి యుదయ
మందు శ్రీరామభూజాని ♦ యా నిషాద
రాజు గుణతేజు వనరాజు ♦ నోజమెయిని
గాంచి భాషించెఁ బ్రేమించి ♦ మించువేడ్క. 54

తే॥ ఓయి చెలికాఁడ! శీఘ్రంబె ♦ యొక్కనావ
తెమ్ము దృఢమైన దానిను ♦ దీప్తహృదయ!

యన నిషాదాధినాథుండు ♦ విని సభక్తి
స్వయముగాఁ దెచ్చి లక్షణం ♦ బయినదాని. 55

క॥ స్వామీ! యధిరోహింపుఁడు
రామానుజ భూమిజా వి♦రాజితు లగుచున్
శ్రీమాన్వితులగు వారలు
భూమిని ద్రోణినైన సుఖము ♦ బొరయక యున్నే? 56

వ॥ ఏనె సమాహితుండనై స్వజనంబులతోఁ గలసి స్వయముగ మిన్నువాఁక కద్దరి డింప నమకట్టితి నన ముందుగ, 57

శా॥ ఆరోహింపఁగఁ జేసి సీత గుహు హా♦స్తాలంబనుం డయ్యు నా
శ్రీరాముం డధిరోహణం బొనరిఁచెన్ ♦ జెల్వొప్ప సౌమిత్రి తా
ధీరోదారత బాణతూణ సధను♦ర్దీప్తాయు ధోద్దీప్తుఁడై 58
యారోహించె గుహుండు సిండు మతితో♦నంతం బ్రవాహంబునన్.

ఆ॥ వె॥ ధాత్రిజాత గంగ ♦ దరియించు నప్పుడ
భక్తియుక్తహృదయ ♦ వాగ్విలాస
వచనరచిత వినుతి ♦ భాసురాప్తి నొనర్చెఁ
ద్విజగదభిమతంబు ♦ త్రిపథగాఖ్య. 59

మ॥ వనవాసంబున నుండియున్ మరల సం♦భద్రంబుగా నేను రా
మునితో లక్ష్మణుతోడనే నిటకు నా♦మోదంబునన్ వచ్చి మె
చ్చినరీతిన్ మధుమాంస భక్ష్యముల వా♦సిన్ మీర నీకిచ్చి పూ
జను నానాబలియుక్తిగా సలిపెదన్ ♦ సన్మోక్షదా జాహ్నవీ! 60

మ॥ నరు లెన్నో భవసంతతుల్ విపుల నా♦నాదోషసంయుక్తులై
వరుసన్ భక్తి మునింగి పూతులయి ది♦వ్యజ్ఞాన సంపన్నులై
పరమార్థక్రియ నున్నవారలు గదా ♦ పద్మాక్షి! వైకుంఠ వా
స రమానాథపదోద్భవా! త్రిపథగా ♦ సాధ్వీ! త్రిలోకావనీ! 61

క॥ జనకాత్మజాత నుతులను
విని గంగ ప్రమోదమంది ♦ వేలం జేర్చెన్

వినుత పతివ్రత లనఁగా
మనమున సురలైన భీతి ♦ మైకొను టరుదే? 62

వ॥ వారల గంగాకూలంబున డించి నిషాదపతి రాఘవుంగాంచి పలికె; నిట్లు మీతోఁగూడ వనవాసార్థమే నరుదెంచెద నో రాజేంద్రా! యనుజ్ఞ నొసఁగవేఁడెద లేదేని నాప్రాణముల నిలుపఁజాల. 63

చ॥ అనెడు నిషాదవాక్కువిని ♦ యాతని నాతఁడుగాంచి దండకా
వనిఁ బదునాల్గు వర్షములు ♦ వాస మొనర్చియు రాఁగనుంటి నే
వినిచితి రామభాషిత మ♦బద్ధముకాదు నిషాదనాథ యం
చని గుహుఁ గౌఁగిలించుకొనె♦నాదర మొప్పఁగ మాటి మాటికిన్ 64

క॥ యమ నియమాదుల నిరతము
విమలాత్ములు సురులు మనులు ♦ వెదుకంగ నదృ
శ్యముగాఁ జనువాఁ డిప్పుడు
సముఖంబున గుహునితోడ ♦ సఖ్యత నెఱపెన్. 65

తే॥ గుహుని యుపలాలనముఁ జేసి ♦ కోరి కలర
నూరడించిన నాతండు ♦ నోర్మిఁ జనియెఁ
బయనమై పోవువారి వెం♦బడిని బడిన
బాలువిధమున సాధుసం♦బంధ మిటులె. 66

తే॥ అవల వారలు మువ్వు రా ♦ యటవి మేధ్య
మృగమును వధించి పక్వంబు ♦ నింపొనర్చి
వైశ్వదేవాది కార్యని♦ర్వర్తిఁ జేసి
భోజనంబులఁ గావించి ♦ రోజమొయిని. 67

క॥ ఆరాత్రి నావనంబున
శ్రీరాముఁడు లక్ష్మణుండు ♦ సీతాసతియున్
భూరుహమూలంబున సుఖ
మారఁగ నిదురించి గడపి ♦ రచ్చట నంతన్. 68

—♦ సీతారామలక్ష్మణులు భరద్వాజాశ్రమముఁ జేరుట ♦—

క॥ దుందుభిచైత్ర సితాష్టమి
నందు భరద్వాజు నాశ్ర♦మాఖ్యము జేరం
బొందుగఁ జని బహిరంగణ
మందుండి తదాశ్రమంబు ♦ నారయుచున్నన్. 69

శా॥ భారద్వాజ మునీశ్వ రాశ్రమ సమీ♦పంబందు నీక్షించెఁ దా
శ్రీరామాఖ్యుఁడు బ్రహ్మచారి నొకనిన్ ♦ శ్రీబ్రహ్మవిద్యా చిర
స్ఫారాస్యున్ ఫలపుష్ప బిల్వ తులసీ♦పత్ర ప్రవాళార్థసం
చారున్ నిర్మలయజ్ఞసూత్ర విచల♦చ్చారు ప్రవక్షస్థలున్. 70

తే॥ కాంచి వటుకుని శ్రీరాముఁ ♦ డంచితముగ
నోయిబాలక! శ్రీరాముఁ ♦ డోర్మి వనికి
జానకీ సుమిత్రాపుత్ర ♦ సహితుఁ డయ్యు
వచ్చినాఁడని మునితోడఁ ♦ బలుకుమయ్య. 71

క॥ భవదాశ్రమ బహిరంగణ
భువి నున్నారనియు [illegible]మ్ముఁ ♦ బూజ్యులఁ గనఁగాఁ
దవిలి ముదంబున వేగమ
వివరింపుము వారికడను ♦ విశ్రుతలీలన్. 72

క॥ అన విని వడుగా మునిచం
ద్రుని సన్నిధి కేగి భక్తి ♦ తోడ వచించెన్
వనితా సోదరయుతుఁడై
ఘనుఁ డినకులరాముఁ డిపుడు ♦ కానకు వచ్చెన్. 73

క॥ మునికి యథోచితగతిగా
వినుపింపు మనుచు వచించె ♦ విప్రోత్తమ యం
చనఁగ భరద్వాజుఁడు వే
డ్కను శీఘ్రముగాను లేచి ♦ గౌరవ మొప్పన్. 74

తే॥ అర్ఘ్యమును పాద్యమును దెచ్చి ♦ యమితభక్తి
రామసామీప్యముగ నుంచి ♦ ప్రేమమీరఁ
గాంచి రాము యథాన్యాయ ♦ కలితగతినిఁ
బూజ లొనరించె మునిహృదం♦భోజవాసు. 75

తే॥ రామ! రాజీవలోచన! ♦ రాజచంద్ర!
యస్మదాశ్రమ భూముల ♦ కనుజుఁగూడి
రమ్ము నెమ్మది నీపాద♦రజము చేతఁ
బావనం బొనరింపు వి♦శ్వాస మలర. 76

క॥ అని పలికి రామలక్ష్మణ
జనకజలను మునియు బర్ణ♦శాలకుఁ గొని పో
గి నితాంతాపార ముదం
బునఁ బూజించెను మునిజన♦ముఖ్యుఁడు వారిన్. 77

క॥ మరిమరి భక్తినిఁ బూజల
సరసత నొనరించె నతిథి♦సత్కారము వి
స్ఫుర దుత్తమగతి స్వయముగ
హరి వచ్చినఁ బూజఁ జేయ♦రా? మునిచంద్రుల్. 78

ఆ॥ నీసమాగమంబు ♦ నీరజదళనేత్ర!
తనరి ధన్యుఁడైతి ♦ వనజనాభ!
భవ్యమయ్యెఁ దపము ♦ పారంగతం బయ్యె
జన్మసార్థమయ్యె ♦ సత్యచరిత! 79

మ॥ అనఘా! రాఘవ! నీయుదంతమును భూ♦తాగామికం బంతయుం
గనినాఁడ న్నిను దత్పరాత్పరుఁ డనం♦గా నీవు మాయామను
ష్య నిమిత్తాకృతిఁ దాల్చినట్టి డనియే ♦ సర్వంసహాచక్ర పా
వన సత్తాకఖిలాసి నీ వెఱుఁగుదున్ ♦ భవ్యాత్మ రామప్రభూ! 80

సీ॥ బ్రహ్మచేఁ దొలుదొల్తఁ ♦ బ్రార్థింపఁబడి భూమి
నెందుకై యవతార ♦ మెత్తినావొ

జనకాజ్ఞయను నెపంబున వనవాసంబు
జేయంగనెందుకై చెలఁగినావొ
యిఁకముందు నిచ్చట నేమేమికార్యముల్
వరుసగా నొనరింప వచ్చినావొ
గురు తెలుఁగుదు నేను కువలయదళనేత్ర
త్వదుపాసనంబునఁ దనరినట్టి
తే॥ జ్ఞానలవముననే నేను మానసమునఁ
బ్రకృతికంటెను పరుఁడవై పరగు పురుషు
నిన్ను గన్నాడ నట్టినే నెన్న నిపుడు
భవ్యతరమైన చరితార్థ పదముగంటి. 81
క॥ సీతాలక్ష్మణ సంయుత
చేతోమోదంబుతోడ శ్రీరఘురామా!
పూతామలచరితా వి
ఖ్యాతిగ నభివాద మిత్తు నవఘాత్మ హరీ! 82
వ॥ సుమిత్రాపుత్ర ధాత్రిజా సహితుండై రాఘవుండు సంయమి
చంద్రుఁడగు భరద్వాజునికి నమస్కరించి. 83
తే॥ పావనాత్మక క్షత్రియ బాంధవులము
మేము, నీ వనుగ్రహబుద్ధి ప్రేమమీర
గాంచఁదగినట్టి వారము ఘనతఁబొగడఁ
బరమమునులందు మే మెంత వారమయ్య. 84
తే॥ ఇట్టు లన్యోన్య భాషణ మింపుమీరఁ
జేయుచుండిరి వారలు చేరి రాత్రి
సత్సమాగమం బనఁగ సుస్వాంతులకును
హర్షదాయకంబగు గదా? అదిప్రపుత్రి! 85

## వాల్మీకాశ్రమ ప్రవేశము

తే॥ అంత నా శుద్ధనవమినా డరుణుఁ డుదయ
మైనతోడనె లేచి యా యమునఁ జేరి

మునివటూత్తమ కృతమైన ♦ ఫుట్టి నవల
కేగ మునిదృష్టమార్గుఁడై ♦ యినకులుండు. 85

మ॥ వరవాల్మీకి మునీశ్వరాశ్రమము చే ♦ భాసిల్లి యెచ్చోట వి
స్ఫురదారామసుమప్రవాళ లతికా ♦ శోభాయమానాగభూ
ధర నానామృగయుక్తమై మునిజనో♦ద్దామంబునైయొప్పి సుం
దర మొప్పారెడునట్టిచోటు జనిరం♦తం జిత్రకూటాద్రికిన్, 86

తే॥ చని సమాసీను వాల్మీకి♦సంయమీంద్రు
మునిజనోత్తము సత్తము ♦ బుణ్యు దశమిఁ
గాంచి సౌమిత్రి సహితుఁడై ♦ కంజనయన
సీతతో రామచంద్రుండు ♦ జెలఁగిమ్రొక్కె. 87

వ॥ ఆ వామలూరుతనయుండు లోకసుందరుండును జానకీలక్ష్మ
ణోపేతుండును జటామకుట మండితుండును గందర్పసదృశాకారుండును
కమనీయాంబుజేక్షణుండును లక్ష్మీనాథుండు నగు రాముఁ గాంచినంతనే
విస్మయానిమిషేక్షణుండై దిగ్గనలేచి హర్షాశ్రులోచనుండై పరమా
నందరూపభాసితుఁడగు నయ్యనుపముఁ గౌఁగిలించుకొని. 88

తే॥ అలజగత్త్రయ పూజ్యుఁడైఁ ♦ యలరినట్టి
రాము భక్త్యాదరంబులఁ ♦ బ్రేమమీరఁ
బూజ లొనరించి సుమధుర ♦ భోజనముల
నారగింపంగ లాలించి ♦ యతని కొనఁగె. 89

తే॥ వనజనయనుండు ప్రాంజలి ♦ బద్ధుఁడగుచు
వినయ మొప్పంగ వాల్మీకి♦ముని వినంగ
ననిమె జనకాజ్ఞ దండకా♦వనులఁ దిరుగ
వచ్చినార మటంచును ♦ వరుసగాను. 90

తే॥ కారణంబిందు మీకు వి♦స్తారలీల
తెలిసియున్నది మే మేమి ♦ తెలుపవలయు

నెచట సుఖవాస మొనరింప ♦ నెనయు నిచట
మాకుఁ గాలంబు గడుపంగ ♦ మానివర్య! 91

క॥ సీతాసహితుఁడవై యిట
బ్రీతిని గాలంబు గొంత ♦ వెళ్ళఁగఁ జేయం
జేతోమోదత నుంటేని
తాతా! యన ముని వచించె ♦ దరహాసమునన్. 92

మ॥ అనఘా రామ! సమస్తలోకములకీ ♦ వాధారగేహాకృతిన్
మనియున్నాఁడ వనంతభూతములు నీ♦మం బొప్ప నీవుండఁగా
ఘనచంద్రోపల సౌధజాలములు ని ♦ క్కంబందు మాబోటు లే
మని నీ కిందు నివాసయోగ్యమని కా ♦ ర్యంచున్ వచింపంగనౌ.

క॥ నీకిటు సాధారణమగు
లోకోత్తరవాస భూము♦లు వచించితి నీ
తాకాంతామణితో నని
చేకొని నిగదించుటయె వి♦శేషము రామా! 94

సీ॥ ఇనకులోత్తమ! నీకు ♦ నెయ్యది నియతమం
దిరమొ నే వచియింతు ♦ నరసివినుము
సమదృష్టిగలవారు ♦ శాంతులు శత్రుమి
త్ర సమానచిత్తులు ♦ ధాత్రిసురలు
మున్నుగాఁగల జంతు♦పుంజములందున
ద్వేషంబు లేనట్టి ♦ విమలమతులు
సర్వకాలమునందు ♦ సద్భక్తి నీనామ
భజనంబు నొనరించు♦పరమభక్త

తే॥ హృదయపంజరపఙ్క్తి నీ ♦ సదనచయము
ముఖ్యముగ వాస మొనరింపఁ ♦ బూని యందు
నవనిజాతను గూడి నీ ♦ యాత్మ మెచ్చి
కరము బ్రీతిని గాలంబు ♦ గడపుమచట. 95

కం॥ అనిశము ధర్మాధర్మము
లను వర్జించియు నినుమది ♦ లలితగతి భజిం
చి నియతి వసించెడు సుధీ
జనహృదయము నీకు వసతి ♦ జనకజతోడన్. 96

మ॥ భవదీయామలమంత్రి జాపనము నీ♦పాదాబ్జ సంసేవయున్
భువి నిర్ద్వంద్వము నిస్పృహత్వమును నే♦పూజ్యుండు సాధించు వా
స్తవమొప్పారఁగ నామహాత్ముని హృద♦బ్జాతంబు నీ మందిరం
బవు నిందీవర నీలలాలితవపు♦శ్శ్యామా, రమానాయకా! 97

మ॥ గరిమంగాంచిన శాంతమూర్తులును రా♦గద్వేష సంవర్జితుల్
నిరహంకారులు లోష్టకాంచనసముల్ ♦ నిత్యప్రభావోదయుల్
సరసుల్ వారల చిత్తకంజములు నీ♦సంసారయోగ్యంబులై
ధరణిం గట్టని గట్టియిండ్లుగద సీ♦తానాథ రామప్రభూ! 98

మ॥ మనమున్ బుద్ధియుఁ ద్వత్సమర్పణమనన్ ♦ మైకొంచు సంతుష్టితో
మనుచున్ నీకయి సర్వకర్మములు ప్రే♦మం జేయుచున్నట్టి యా
జనమూర్ధన్యుని హృత్సరోజము సదా ♦ సంవాసయుక్తంబునౌ
ఘనగేహంబగు నీకు రామ! త్రిజగ♦త్కల్యాణసంధాయకా! 99

చం॥ ప్రియమున మోదమున్ విడచి ♦ విశ్రుతలీలల నెట్టివేళ న
ప్రియమునకై మదిన్ వెతలఁ ♦ బెట్టక సర్వము మాయయే యనన్
నయముగ నెంచుచుండి మన♦నంబొనరించుచు నీదుమంత్రమున్
నియతి నినున్ భజింపఁజను ♦ నిర్మలచిత్తమె నీగృహం బగున్. 100

వ॥ ఎవ్వఁడు షడ్భావాది వికారంబుల దేహంబున గాంచుచు నాత్మయందు వర్జించునో క్షుత్తు తృష్ణ భయము దుఃఖము మున్నగునవి ప్రాణబుద్ధులయందు నిరీక్షించునో సంసారధర్మ నిర్ముక్తుఁడై యుండునో నిత్యకర్మానుష్ఠానాదుల పుణ్యపాపసంబంధము లేనివాఁడగునో వాని మానసము నీవు నివసించుటకు యోగ్యమగునిలయంబు. 101

చ॥ అనయ మనంతరూపుని దయాన్వితు సర్వగుహాశయస్థు నొ
క్కనిని వరేణ్యు సర్వగతుఁగాఁ బరుఁ జిద్ఘనుగా నలేపకుం
డని నిను సత్త్వమూర్తి యని యారసి కాంచుచునుండువాని హృ
ద్వనజము నీదుగేహము నివాస మొనర్పుము సీత తోడుతన్. 102
మ॥ నిరతాభ్యాస దృఢీకృతాత్ములగుచున్ నీపాద సంసేవనా
పరినిష్ఠాన్వితులై త్వదీయ భజనన్ బాపంబులం దోలి యి
ద్ధర భాసిల్లెడి సాధుచిత్తములు నీధర్మైక గేహంబులై
వరలుం గావున సీతతో మెలఁగుమా భద్రాత్మ! రామప్రభూ! 103
తే॥ మరియు శ్రీరామ! నీనామమహిమ లవని
నెవఁడు వర్ణింపఁ దరమౌను ఋషివినోద
యేప్రభావంబువలన నే నిట్టిపదవి
నందినాఁడనొ బ్రహ్మర్షులందుఁ గనుము. 104

—* వాల్మీకి పూర్వవృత్తాంతము *—

తే॥ అయ్య! నీ నామమాహాత్మ్య మాత్మ దవిలి
యస్మదీయము జన్మవృత్తాంత మద్భు
తంబుగా మారె వినవయ్య దశరథాధి
నాథువరపుత్ర నుతిపాత్ర నాకమిత్ర! 105
ఉ॥ ఏను గిరాతమధ్యమున నింపువసించుచు బోయవారిచే
బూనియుఁ బెంపఁగాఁబడితి బుట్టుకమాత్రమె బ్రాహ్మణత్వమం
దేను వచింతు శూద్రసమవృత్తిఁ జరించుచునుంటి నద్దియే
మానసవాంఛయయ్యె నసమంజసరీతిని నీతిబాహ్యతన్. 106
సీ॥ అరయ శూద్రాచార మాచరించుటలాయె
నింద్రియ నిగ్రహం బెటకో చనియె
శూద్రాంగనను గూడి నూటిసంసారంబు
మెండయ్యె నానాట మీదమీద
బెక్కండ్రు కొడుకులు వెలయుచుండుట జేసి

నంతఁజోరులఁ జేరి ♦ యాసక్తిఁ దిరుగుచు
గజదొంగనై యుండి ♦ కాచి దారి
తే॥ ధనువు బాణముల్ ధరియించి ♦ యనిశ మేను
జీవములపాలి మిత్తినై ♦ చెలఁగుచుండి
బహుకుటుంబము బోషింపఁ ♦ బరగినాఁడ
రామ శరదభ్రితనుధామ ♦ రమ్యనామ! 107
తే॥ మహాదరణ్యంబునందున ♦ నహరహంబు
నిటుల సంచరించుచు నుండ ♦ నీడులేక
యవల నొకనాఁడు రవికాంతి ♦ నగ్నిదీప్తి
ధిక్కరించెడు తేజంబు ♦ లుక్కు మిగుల. 108
తే॥ ఘనులు సప్తర్షి నామక ♦ మునులు నాకు
గంటఁబడిరి కాననమందుఁ ♦ గాంచి వారి
ఘోరవృత్తిని బూని సం ♦ కోచపడక
పైఁబడంగను నుంకించి ♦ పయనమయ్యు. 109
ఉ॥ వారల వెంటనంటితేని ♦ పైకొని సర్వపరిచ్ఛదంబులం
గోరి హరింపనెంచియును ♦ గొబ్బున నిల్వుడు నిల్వు డంచున
వ్వారలు నన్నుగాంచి యిటుఁ ♦ బల్కిరి బ్రాహ్మణనామధేయ నీ
వూరక వచ్చె దిట్టు లని♦యుక్ వినుఁ డావలిచిత్రమంతయుక్. 110
తే॥ పాపబుద్ధిని వారిపైఁ ♦ బడఁగ జనితి
గాని మహనీయదర్శన ♦ కారణమున
గించిదంకురవిజ్ఞాన ♦ కృతధియాప్తి
మామకవిధంబు దెలుపంగ ♦ మగిడి తపుడు. 111
చ॥ అనఘచరిత్రులార వినుఁ ♦ డంతయు లెక్కకు మిక్కుటంబు నా
తనయులు బంధువర్గములు ♦ దారయు నాకలిగొన్నవారలై
కనలుచునుందు రింటఁ నిటుఁ♦గైకొని యేగినగాని కాదు వా
రిని బ్రతుకంగ జేయఁదగు ♦ రీతిని వచ్చితి నిగ్రహింపఁగక్, 112

తే॥ వారి సంరక్షణార్థమై ♦ వనుల గిరుల
దిరుగుచుందును దారుల ♦ నరుగువారి
ధనము నపహరించెడువృత్తి ♦ దనరి యిట్లు
శాంతగుణులార, ఋషులార ♦ సరసులార! 113

వ॥ అని యివ్విధంబున నేను దెలుప వారలవ్యగ్రులై యీక్షించి యిట్లనిరి. 114

ఉ॥ వారలు నన్నుగాంచి యని♦వార్యదయారస ముప్పతిల్ల నీ
వారలచెంత కేగి యిటుఁ ♦ బ్రీత్యహ మీవొనరించు పాపసం
భారము నెవ్వరైన నొక♦భాగము గోరుదురేమొ నిన్ను నీ
వారసి రమ్మటంచు వచ♦నామృతముం బయి జల్లిరంతటన్. 115

తే॥ ఒక్కరొక్కరి నీవారి ♦ నోర్మిమిగులఁ
బిలచి యడుగుము నీ వింక ♦ వెడలి యటకు
వచ్చుపర్యంత మిటనుందు ♦ మిచ్చగించి
నిశ్చయంబగు మామాట ♦ నెమ్మికనుము. 116

క॥ అని వారలు భాషించిన
విని యటులే యని వచించి ♦ వెడలియు వేగన్
మునులుం దెలిపిన రీతిని
దనయుల మొదలైనవారిఁ ♦ దద్దయుఁ గనియున్. 117

క॥ అనయము నే నెటో తెచ్చిన
మునుకొని భుజియింతురు మీరు ♦ మోదముతోడన్
దిన మే నొనరించిన నా
ఘనపాపము తద్విధంబె ♦ కైకొనుఁడన్నన్. 118

క॥ విని యీమాటను బోయత
వెనుకటి ప్రేమంబుమాని ♦ వే గని కోపం
బున నను మ్రింగెడునటు గొ
బ్బున పైబడి కొట్టవచ్చు♦పోలిక బలికెన్ 119

క॥ ఈవానరించెడు పాపము
భావింపఁగ నీది మేము ♦ ఫలభాగిను లం
చావెలఁది పల్కె నీసున
నా వెనుక తనయులతోడ ♦ నడిగితి నిటులన్. 120

క॥ మిము సంరక్షణఁ జేయఁగ
బ్రిముదంబున వస్తువితతి ♦ రాజిలు ధన జా
లము నిడుచుంటిని నాపా
పము గొనెదర లేద మీరు ♦ పలుకుఁడి నిజమున్. 121

తే॥ అనిన నాబోయవారలు ♦ గనియు నన్ను
గోపదృష్టుల పైబడి ♦ కొట్టవచ్చి
పలికి రిట్టుల నీపాప♦భాగము గొన
మాకు సంబంధ మనరాదు ♦ మాకు వలదు. 122

క॥ ఫలమును బొందెడు వారమె
యిల జాప్రునకైన నీగి ♦ యెటులో గొని రా
వలసిన బాధ్యత మీయది
తలిదండ్రుల ధనము సుతుల ♦ దగులఁగ వలదా? 123

వ॥ భూవలయంబున నెవఁడేని నా చేసిన పాపంబు భాగించు కొనెదరా? యని దారపుత్రాదుల నడుగుట పాడి యగునా? యని వారలు తేట తెల్లంబుగ వచించిన విని జాతనిర్వేదుండనై విచారించి కరుణాపూర్ణమానసులగు మును లున్నచోటికి మరల నరుగుదెంచితి.

క॥ ముని సందర్శన కారణ
మున శుద్ధాంతఃకరణతఁ ♦ బొందితి నంతన్
ధనురాది పరికరంబుల
బనిగొని వర్జించి చేసి ♦ వందన శతమున్. 125

క॥ నిరయార్ణవమగ్నుఁడనై
దరిగానక పోవు నన్ను ♦ దయతో మీరల్

పరిరక్షఁ జేయుఁడని త
చ్ఛరణాగ్రములందుఁ బడిన ♦ సంయమివరులున్. 126

తే॥ వారి పాదాగ్రతలమందుఁ ♦ బడిన యట్టి
నన్ను నీక్షించి పలికిరి ♦ నయముమీఱ
మునివరేణ్యులు లే లెమ్ము ♦ దనరు శుభము
సత్సమాగమంబు ధరిత్రి ♦ సఫలముగద! 127

క॥ క్రొంచెము నీ కుపదేశము
నంచితగతి జేతు మేము ♦ నయ్యది నీకున్
మించిన మోక్షమొసంగఁగ
సించుగ నౌ నీకు దారి ♦ యిదియేకనుమా! 128

తే॥ అని పరస్పరాలోచనా♦యత్తులయ్యు
నతిదురాచారుఁ డట బ్రాహ్మ♦ణాధముండు
ధర నుపేక్షింపఁ దగు సదా ♦ చరణచణులు
పాపు లన భీతి మున్నులైన ♦ బరుఁగు లిడరె. 129

తే॥ కాని శరణాగతుండైన ♦ కారణమున
రక్షణీయుండె యెటులైన ♦ మోక్షమార్గ
మొసఁగి యని వారు నను గాంచి ♦ పూర్ణకరుణ
సత్కృపాపాంగవీక్షణల్ ♦ జల్లి పైని. 130

క॥ వ్యత్యస్తాక్షరరూపక
మత్యాదరమొప్పఁగ మర♦యని నాజిహ్వన్
సత్యాత్మ నీదు నామము
నిత్యంబు జపింపు మనిరి ♦ నియతి నటంచున్. 131

క॥ మరమర యని జపియింపుము
వరుసను నేకాగ్రహృదయ ♦ భాసివి నగుచున్
మరి మేము వచ్చునంతకు
దరలిరి వచియించి దివ్య ♦ దర్శనులు మునుల్. 132

ఉ॥ వా రుపదేశమిచ్చినటు ♦ వారక నిశ్చలచిత్తవృత్తి నిం
పారఁగ జేయుచజ్జపము ♦ నావల బాహ్యవిచారమంతయుం

బారికర్మిమంబుగాను బహు♦వర్షశతాయుతముల్ గతింప వి
స్ఫారత సర్వసంగపరి♦వర్జిత నిశ్చలదేహి నౌటయున్. 133

చ॥ వినుఁడు మరా మరామయని ♦ విశ్రుతలీల జపించుచున్న నే
ననయము నాతనూపరి న♦నంతముగా నొకవామలూరు బు
ట్టెను యుగముల్ శతంబులు న♦టించినమీఁద మునీశ్వరోత్తముల్
వనమున నున్న నన్నుఁ గన♦వచ్చి రనంతకృపారసాత్ములై. 134

క॥ వెలుపలికి రమ్మటంచును
బలికిన నీహారమధ్య ♦ భానుని పగిదిన్
లలివల్మీకమునుండియు
సలలితగతి వచ్చి తేను ♦ సన్నుతచరితా! 135

క॥ మునిగణము నన్నుగాంచియు
మునివర వల్మీకమందు ♦ బుట్టితి వీ వం
దున వాల్మీకి యనంగను
మను మనిరి ద్వితీయజన్మ ♦ మైకొనె నీకున్. 136

క॥ అని పలికి వారలేఁగ్వారు
జని రంతట నీదునామ♦జపశక్తిని బా
వనచరితా! యీదృశుఁడై
తిని దారకనామ నిన్ను ♦ దీరుగఁ గంటిన్. 137

క॥ భూజాత లక్ష్మణాన్వితు
రాజీవదళామలాక్షు ♦ రాముని గంటిం
దేజోయుతు జితకల్మషు
నోజమెయిని ముక్తిఁ గంటి ♦ నుత్తమగతియున్. 138

క॥ నిరుపద్రవ మాయావి
స్ఫుర దురుమానుషవిలాసు ♦ ముక్తనిబంధున్
బరు నవ్యయు రాఘవు నం
బురుహదళనయను భజింప ♦ ముక్తుఁడు గాడే! 139

తే॥ నిర్వికల్పు ననాద్యంతు ♦ నిర్మలాత్ము
నిష్క్రియు నిరీహు శాంతుని ♦ నిత్యశుద్ధు
చిరనిరాభాసగోచరు ♦ శ్రీనివాసు
భజన మొనరింప భవబంధ♦పటలి తొలఁగు. 140

తే॥ ఆచిదంశు నమందాంతు ♦ నవ్యయాత్ము
విభు ననూపము నవ్యక్తు♦విశ్వనాథు
నిరతసద్భక్తి భజియింప ♦ దొరుకు ముక్తి
సంశయములేదు శ్రీరామ ♦ జలజనయన! 141

తే॥ అభినుతించియు రాఘవు ♦ నవల నతఁడు
వాసమొనరింప యోగ్యమౌ ♦ పర్ణశాల
నచట నిర్మింప లక్ష్మణుం ♦ డతని శిష్య
వర్గములు వెంట నడువంగ ♦ వచ్చి యంత. 142

తే॥ రామ రమ్యంక స్థలమును ♦ బ్రేమమీర
నీకుఁ జూపింతు నిచట న♦స్తోకగరిమ
సకల జంతుతతి నివాస♦సదను కొకఁడు
గాంచఁ జేయంగ వలసె నీ ♦ కాలమహిమ. 143

వ॥ గంగా పర్వత మధ్యదేశంబున జానకీసహితుఁడు లక్ష్మణాన్వితుండు వాసభువుఁడగు రాముఁడు బ్రాక్ప్రశ్చిమంబుగ నొక మందిరంబు నుదగ్దక్షిణంబుగ నొకదానిని సువిస్తీర్ణ పర్ణశాలల నిర్మింపఁజేసె. నంత నాభవనోత్తమంబున దేవసదృశులగువారు నివాస మొనరించుచుండ. 144

తే॥ అచట వాల్మీకిచే పూజ ♦ లాదరమున
గొనుచు సీతాసమేతుఁడై ♦ యనుజుఁగూడి
మునిగణోత్తమసహితుఁడై ♦ వని సురాళి
కొలువ శచితోడి దేవేంద్రుఁ ♦ డలరి నటుల. 145

—♦ సుమంత్రుఁడయోధ్యకుఁ జనుట ♦—

తే॥ అట సుమంత్రుండు సాయాంత♦మం దయోధ్యఁ
జేరె ముకుళితాననముపైఁ ♦ జీరగప్పి
కనులు బాష్పాకులములయ్యుఁ ♦ గానుపింప
బొంగి పొరలెడు దుఃఖాబ్ధి ♦ మునిఁగి యెటులొ. 146

క॥ వెలుపల నరదంబును డిగి
నిలిపియు జయశబ్దమిచ్చి ♦ నెమ్మది వచ్చెన్
సలలితగతి దశరథునకు
నిలనొరగి నమస్కరించె ♦ నెంతో వడిగన్. 147

వ॥ నమస్కరించుచున్న సుమంత్రుఁ నీక్షించి దశరథుండు. 148

ఉ॥ ఎచ్చట డించి వచ్చితివి ♦ యిద్ధచరిత్రుల నాసుతాళి నీ
వెచ్చట నున్నవార లిట ♦ కెప్పుడు వచ్చితి మంత్రిసత్తమా!
యిచ్చను వార లేమనిరి ♦ యీ యవినీతుని దుష్టవృత్తికిన్
సచ్చరితేందిరోపమిత ♦ జానకి లక్ష్మణుఁ డోర్మి రాముఁడున్.

శా॥ హా రామా! ధరణీపతీ! గుణనిధీ! ♦ హా లక్ష్మణా! హా ధను
ర్ధారీ! సూర్యకులావతంస! భువిజా♦రామా మనోనాయకా!
హా రాజీవదళాక్షి సీత సుదతీ! ♦ హా జానకీ! పాపి నీ
ఘోరాకారుని గాంచరా దనిగదా! ♦ ఘోరాటవిం జేరుటల్. 150

తే॥ దుఃఖజలధిని మునిఁగియుఁ ♦ దూలిపోవు
చున్న ననువీడి దయలేక ♦ యుగ్రవనికిఁ
దరల మదినెట్టు లురిలె నీ ♦ దురవగాహ
వృత్తి నను గాంచరారుగా ♦ యిపుడు మీరు. 151

ఉ॥ హా సుకుమార లక్ష్మణ! ధ♦రాత్మజ సీత! ఇనాన్వయాబ్ధి రా
కాసమతేజ రామ! నృప♦కాండ నభోమణిధామ! దీను నన్
గాసిలఁ జేసి యేగితిరి♦గా వనవాసము మిమ్ముఁ గాంచఁగా
వాసిలునే పురాకృతభ♦వం బిటుఁ జేసిన దేమిసేయుదున్? 152

క॥ ఇల నియమమైన బ్రతుకం
గలనా? మిము వీడి నేను • కంజదళాక్షా!
లలితచరిత్రా, లక్ష్మణ
యిలాతనూజా పరేశ్వ • రేచ్ఛ నిటాయెన్. 153

క॥ రాముని సీతాదేవిని
సౌమిత్రిని గొని రథమున • జాహ్నవిఁ జేరన్
భూమీశ! శృంగిబేరపు
సామీప్యమునందు డిగిరి • చయ్యన వారల్. 154

క॥ వినుఁడు గుహానీతములగు
ఘనఫల మూలాదికంబు • కర కంజములం
గొనియు విసర్జించె భుజిం
పను మానెను రామవిభుఁడు • వసుధాధీశా! 155

క॥ జననాథ గుహుని చేతను
పనివడఁ దెప్పించియపుడె • వటదుగ్ధములన్
గొనియు జటామకుట నిబం
ధన మొనరించి వచియించె • దరహాసమునన్. 156

సీ॥ మాకుగా నిరతంబు • మదిలోన వగయంగఁ
బనిలే దటంచును • బలుకుమనిమె
సాకేతమునకన్న • లోకోత్తరం బగు
వననివాసమటంచుఁ • బలుకుమనిమె
వనజనప్రియులమై • వసియించుటలు మాకు
బరమహర్షమటంచుఁ • బలుకుమనిమె
మాతల్లి కోసల•మహీనాథపుత్రిని
మన్నిమిత్తపుటార్తి • మానుమనిమె
తే॥ వందనంబని జననితోఁ • బలుకుమనిమె
మానిమి తము దుఃఖించు • మానవాని

నాథు వృద్ధు నాదరమొప్ప • నయమువిూఱ
నాశ్వసింపుచు బలుమాఱు • నలరుమనియె. 157

క॥ జనకాత్మజాత యిట్టుల
ననె నశ్రుపరీతనేత్రి • యయి యూరఁగ రా
ముని గని గద్గదకంఠం
బున వనవాసము నొనర్పఁ • బోలతులకగునే? 158

తే॥ అత్తమామల యడుగుల • కాత్మభక్తి
సలిపె సాష్టాంగ వందనం • బుల నటంచుఁ
బలికి, మదిఁబుట్టు దుఃఖంబుఁ • బట్టలేక
శిరము వంచియుఁ జనెనయ్యె • ధరణినాథ! 159

సీ॥ సంక్రుద్ధచిత్తుఁడై • సౌమిత్రి యారీతిఁ
జేరి మీతోడ భా•షింపుమనియె
కైకేయివరదాన • కారణంబున మమ్ము
వనులకంపుట నీతి • బాహ్యమనుము
కాముకవృత్తి ని•ష్కారణంబుగ రేగి
సర్వథా దుష్క్రియ • జరిపితనుము
అసమీక్ష్యకారిత్వ • మనుకరించి విరుద్ధ
బుద్ధిలాఘవ మీవు • బొందితనుము
కనినైన నెఱుఁగని • కడుదుఃఖమున మున్గి
భువిజాత కుంది వా•పోవుననుము

తే॥ జనకుఁడనుభక్తి యెప్పుడో • చనియె ననుము
ధర్మశూన్యంబుఁ గావించు • ధరణిపతుల
కితఁడె మార్గదర్శకుఁడంచు • హితము నీకుఁ
దేటతెల్లంబుగాఁగ బో•ధించె ననుము. 160

మ॥ యువరాజన్యుని జేయఁగా నితని యు•ద్యుక్తాత్ముఁడైయుండి యా
యవివేకక్రియ నాచరించుట దురూ•హాగ్రస్తమోహ•మయా

వ్యవహారంబున న్యూనమా జగతి నాహాకారము౦ గాంచ రాఘవ కాంతారనివాస మెప్పటికి లోకఖ్యాతి గాదే యనెన్.

క॥ ఏ యపరాధ మొనర్చెను
పాయక యీ రాజసుతుని వనవాసునిగాఁ
జేయఁ విరుద్ధపు శాసన
మోయి వచింపుమనియెను నయోక్తి నతండున్. 162

తే॥ సకలజగదభిరాముఁడౌ సరసగుణుఁడు
రామచంద్రుఁడె నాతండ్రి రాఘవుండె
యన్నబంధుండు సన్మిత్రుఁ డాప్తజనుఁడు
తివిరి యీతండె నాపాలి దేవుఁడనుము. 163

వ॥ ఈరీతి ముగ్గురు భాషించి యశ్రుపరీతాక్షులై నావ నధిరోహించిరి. వారలు గంగావతరణంబుగావించు పర్యంత మిద్దరి నిలచియుంటి; నావల నాపరానిదుఃఖంబున వచ్చి తమచెంతఁ జేరితి ననుచున్నంత గోసలరాజతనయు, 164

తే॥ నిరపరాధుని బాలుని నెనరులేక
వనుల వాసంబునొనరింపఁ బంప విభుఁడు
తల్లిదుఃఖంబు వర్ణింపఁదరమె మనకు
బొంగి పొరలఁగ నేడ్చుచు బూనిపలికె. 165

—కౌసల్య దశరథుతో నిష్ఠురాలాపము లాడుట—

సీ॥ ప్రియభార్య గావచ్చు వెలఁది కైకయపుత్రి
నింపైన వరముల నీయవచ్చు
వసుధాతలంబెల్ల భరతుఁడె యేలంగఁ
బట్టభద్రుని జేసి వరలవచ్చు
వనునయాప్తిని మీఱ లన్యోన్యగాఢాను
రాగమోహాబ్ధిలో నీగవచ్చు

జతురంతయానాశ్వ ♦ సమితితోం దులలేని
భోగభాగ్యములెల్లం ♦ బొందవచ్చు
తే॥ నేలు దాసీజనమ్ములు ♦ చాలకున్న
నన్ను దాసిగాంగొనవచ్చు ♦ నాతికై కొ
మాకుమాకని బురుడించు ♦ నాకుమూరు
గానలకు నంపంగా నేమి ♦ కారణంబు? 166
చ॥ స్మరమృగయుండు నిండుమతి ♦ సారసలోచన లోలమోహవా
గురమును బన్ని కైక నను♦గుంజెలి నిలువుపెట్టి నాథ హృ
ద్ధరిణముం బట్టి గోనలసు♦తాత్మకిశోర మనాథయై వనిం
దిరుంగంగం బారె హా పురుష♦ధీరత మెచ్చట డాంగియున్నదో?
తే॥ నీవె యిదియెల్ల గావించి♦యీవిధాన
దుఃఖమును జెందం బనియేమి ♦ దుఃఖమొకటి
కలదె నీవంటివరధర్మ♦కలితులకును
చాలు రాజశబ్దమువిూక ♦ సార్థకంబు, 168
కం॥ కలుగక కలుగక సుతుం డొకం
డిల జనియించిన జనకున ♦ కెటనో యేదో
కలంతయుం బుట్టుట నతనిన్
బలవంతముగాంగ వనికిం ♦ బంపంగనౌనే? 169
తే॥ మునుమునను బుట్టెనా కొక్క♦ముద్దుసుతుండు
వాని గాంచియు నతిమోద♦మున జెలంగ
వరములనుపేర బాధింపం♦బరంగెం బరులం
గైక యీసతి యెంతటి ♦ కఠినురాలు? 170
తే॥ వరముగోరెడు వార లీ ♦ వసుధంబతుల
నిచ్చవచ్చినరీతిగా ♦ నిచ్చువారు
లేరె? కటకటా! యెటలేని ♦ వైరమూని
పరుల బాధించుచుందురు ♦ ధరణిపతులు. 171

కం॥ రాజానుగ్రహముండిన
తేజోహీనులె చరింతు ♦ తేజోయుతులై
రాజే నిగ్రహ మూనిన
తేజోరహితుండె యెట్టి ♦ తేజోయుతుఁడున్. 172

తే॥ తమకు బ్రియమైన కార్యంబు ♦ దలఁచి చేయు
నాత్మపుత్రుల బంధుల ♦ నాప్తహితుల
సతుల బాధింపఁబూనిన ♦ గుతలమందు
వెనుకదీయరు సామాన్య ♦ వెతలఁబెట్ట. 173

తే॥ అనెడు కౌసల్యమాటల ♦ వినియు ధరణి
విభుఁడు గాయమందున నిప్పు ♦ బెట్టినటుల
నదరిపడియును శోక పూ ♦ ర్ణాత్ముఁ డగుచు
నిటుల వచియించె వినవె యో ♦ యింతి గౌరి. 174

మ॥ అతిదుఃఖంబున మిత్తిపాతఁ బడఁగా ♦ నాసన్నుఁడన్ నన్ను నీ
గతి వేధింపఁగఁబూని మాటలన నిం♦కంజాలు నాప్రాణసం
తతి పోనున్నది దేహమున్ విడచి ♦ కాంతా! పూర్వశాపంబుచే
మృతివాటిల్లిన దీవిధంబున మదిన్ ♦ మేలెంచి యాలించుమా. 175

—♦ దశరథుఁడు తనశాపమును దెలుపుట. ♦—

వ॥ బాలభావంబున నొకానొక మునిచే శపింపఁబడితిని. దానిని సావధానంబున భాషింతు నాకర్ణింపుము. 176

క॥ మును నే యౌవనగర్వం
బున మృగయాసక్తిజనియుఁ ♦ బూనియరణ్యం
బున నొకనదీతటంబున
ధనువును బాణాళిఁగొనియుఁ ♦ దగఁజరియింపన్. 177

ఆ॥వె॥ అర్ధరాత్రిసమయ♦మం దొక్కసంయమి

దప్పిఁగొన్న యతని ♦ తల్లిదండ్రులకు నై
వారిఁ గొనిచనంగ ♦ వచ్చి నదిని. 178

తే॥ జలము కుండను నిండించు ♦ సమయమందు
బుడబుడారావ మత్యంత♦ముగ జనించె
నది నితాంత మొప్పఁగ నేను ♦ నాలకించి
శబ్దవేదిని సంధించి ♦ జంతులేక. 179

చ॥ వనగజ మీాయరణ్యమున ♦ వారిని ద్రావుచునున్నదంచు నే
ధనువున శబ్దవేధియను ♦ దానిని బూన్చియు నర్ధరాత్రిమం
దున నినదోక్తలక్ష్యమున ♦ దూలఁగ నేసిన హా హాతోస్మియం
చును పెడబొబ్బ బుట్టెనట ♦ సుందరి! మానుషభాషణంబులన్.

తే॥ ఏరికేనియు నపకార ♦ మొందుగాని
చేసి యెఱుఁగని యే నేరి♦చే వధింపఁ
బడితి నిప్పుడు తలిదండ్రు♦లడవి వారి
వాంఛ నన్ను నిరీక్షించు♦వార లకట. 181

తే॥ అని మనుష్యభావముఁ దెల్పు♦నట్టి పలుకు
విని భయంబున మెల్లంగఁ ♦ జనియు నతని
పార్శ్వమున నిల్చి యాతని ♦ పాటుఁగాంచి
యిటుల వచియించినాఁడ నే ♦ నిందువదన! 182

తే॥ మది నెఱుంగక యజ్ఞాన మందబుద్ధిఁ
దప్పొనర్చితి స్వామి నే ♦ దశరథుఁడను
గరుణ రక్షింపఁ దగెద వే♦శరణు వేడి
నాఁడ నని వాని పదనళి♦నముల కెఱఁగి. 183

తే॥ గద్గదాక్షరుఁడనగు న♦న్గాంచి యతఁడు
ప్రిభుగణోత్తమ! నీ కేమి ♦ భయము లేదు
బ్రహ్మహత్యయు నిన్నంట♦రాదు నేను
వైశ్యుఁడ దపంబునందుంటి ♦ వరుసగాను. 184

కం॥ అనిపలికి వైశ్యపుత్రుఁడు
జననీజనకులు పిపాస ♦ సంతప్తులునై
వని నన్ను నిరీక్షణఁ జేయుచుఁ
గనలుచునున్నారు వారిఁ ♦ గాంచుట లెటులో? 185
తే॥ చని విచారింపకయ వేగ ♦ జలమునిమ్ము
వారలకు లేనిచో శాప♦వహ్నిఁ గ్రాఁగఁ
గలవు మాతండ్రి కోపింపఁ ♦ గడురయంబు
యరిగి విన్నవింపఁగను శ్రే♦యస్కరంబు. 186
తే॥ జలము నిడి వారి పాదాబ్జ♦ములకు నెఱఁగి
కృతము సర్వంబు వారల ♦ కెఱుకనట్టు
విన్నవించుము నాదేహ♦పీడఁ జేయు
బాణమును దీయు విడిచెదే ♦ బ్రాణములను. 187
తే॥ అనియు నాతఁడు భాషించి ♦ నంత బాణ
మూడఁబెఱికితి దిన్నంగ ♦ నుర్వివిడచి
పరమపదమును సేవించె ♦ వైశ్యమౌని
వర్య పుత్రుండు వినవె య♦వ్వలి విధంబు. 188
తే॥ సజలకలశంబు గొని యేను ♦ సరిగ వారి
కడకు నేగియు వృద్ధులై ♦ బడలి నడక
కెదిరి చూచుచు క్షుత్పిపా♦సేచ్ఛ రేయి
వరలుచుండెడు వారల ♦ నరసినాఁడ. 189
కం॥ కొడుకేల రాకయుండెను
తడవయ్యెను వృద్ధులమయి ♦ తాలెడు మమ్మున్
విడచి పిపాసోదకమున్
వడిఁ దెచ్చెదనంచు నేగె ♦ విలయమిదేమో. 190
తే॥ ఇతరులెవ్వరు నీకన్న ♦ గతియులేక
వృద్ధులమయి ముప్పిరిదప్పి ♦ పీడఁజెంద

భక్తిమంతుండు పుత్త్రుండు ♦ వని నుపేక్షఁ
జేసి కాలయాపన జేసెఁ ♦ జెడుఁగిదేమొ. 196

కం॥ అని చింతావ్యాకులమున
గనలుచుఁ 'కొడుకా' యటంచుఁ ♦ గడుదుఃఖమునన్
మునిఁగియు వాపోయెడు నా
మునిదంపతులను గనియు 'నమో నమ' యనుచున్. 192

వ॥ నాపాదన్యాసధ్వని విని యావైశ్యవృద్ధసంయమి తృషాతురంబున నింతకాలయాపన మేల జేసితివి? రమ్ము, పానీయమ్ములనిమ్ము, నీవు దాహంబు దీర్చుకొనుము. 'తనయా!' యని విలపించు వారల చెంతకు భీతిచే మెల్లమెల్లన నేగి. 193

తే॥ పదములంటియు నతిఁ జేసి ♦ వారియెదుట
నిలచి వినయ మొప్పఁగ మ్రొక్కి ♦ పలికె నిట్టుల
నేను మీపుత్త్రుఁడనుగాను ♦ మానులార
దశరథుండ నయోధ్యాఖ్య ♦ ధరణివిభుఁడ. 194

కం॥ మృగయాసక్తుఁడఁ బావుఁడ
మృగహింసన మాచరింప ♦ నీనిశి దూరం
బుగను జలావతరణమున
కొగి గమనించియు వసించియుంటిని నేనున్. 195

ఆ॥ వె॥ శబ్దమెఱిఁగి శరము ♦ సంధించువాఁడనై
జలగతంపుధ్వనిని ♦ సరవి వినియు
శబ్దవేధి బాణ♦సంధాన మొనరించి
విడచినాఁడ నంత ♦ విమలచరిత ! 196

ఆ॥ వె॥ 'హా హతోస్మి' యనెడు ♦ నార్తనాదముగాంచి
భయముఁజెంది యతఁడు ♦ బాణనిహతుఁ
డైన చోటుఁజేరి ♦ యారసి యతిఘోర
మని తలంచి కుంది ♦ యతని డాయ. 197

తే॥ జడలు విడిబడఁ బడియున్న ♦ సంయమీంద్రు
తనయు నీక్షించి భీతిల్లి ♦ మునిపదాబ్జ
యుగళిఁ బట్టియు సద్భక్తి ♦ నోర్మి మిగుల
శరణు వేడితి నన్ను ర♦క్షణ మొనర్ప. 198

తే॥ భయము నందంగఁ బనిలేదు ♦ బ్రహ్మహత్య
యు నేఁడు భీతియుఁ లేదు నా♦జనకులకును
జలము నిచ్చి నమస్కృతుల్ ♦ సలిపి జీవి
తమును బ్రార్థింపుమనియె సం♦యమివరుండు. 199

మ॥ అని తా గాలగతంబు నందె నట నే ♦ నత్యంతచింతాభరం
బున నావృద్ధులఁ జేరనేగి గత మా♦మూలాగ్రముం దెల్పి వా
రిని ద్రావంగనొసంగి వేడితిని వా♦రిన్ నన్ను రక్షింపఁగా
మునిహింసారతుఁ డీతఁ డంచు నచటన్ ♦ ముమ్మారు సమ్మాన్యులన్.

చ॥ అన విని శోకవిహ్వలహృ♦దంతరులై విలపించి వార లో
య్యన నను గాంచి మమ్ముల మ♦దాత్మజుచెంతకు వేగఁ జేర్పు మో
జనపతి యంచు నేడ్చిన వి♦చారము నొంది తదార్యవృద్ధులన్
గొని చనినాఁడ పుత్త్రుకడ♦కున్ సుతమృత్యునితాంతక్రుద్ధులన్. 201

తే॥ తనయు నీక్షించి పైబడి ♦ తనువు నిమిరి
వార లాహా రవంబుల ♦ వరలి వరలి
జలము నిమ్మంచు వేడిన ♦ సరకు గొనక
త్రావ జలమీయ వదియేల ♦ తనయ మాకు. 202

వ॥ ఆప్రకారంబున బుత్త్రశోకసమీర నిర్ధూతధైర్యులగు నా మునిదంపతులు నన్ను బిలచి చితినొకదానిని రయంబ సమకూర్పు మన నట్లొనర్చిన తదుపరి మమ్ము మువ్వురి నివేశింపఁజేసి యగ్నిఁ దగిలింపు మని రంత తదార్యవృద్ధుండు మరణించునప్పుడు పుత్త్రశోకానల కాయదహన వహ్నిజనిత సంతాపంబున పట్టలేక నన్ను గాంచి. 203

తే॥ మూవిధంబున నవసాన • మూవహిల్లి
నపుడు పుత్త్రశోకార్తిచే • నవని విడచి
నిరయ మొందంగఁ గలవంచు • వరుసఁబలికి
మరణమందెను వైశ్యసం•యమియు నచట. 204

క॥ నా కిపు డా శాపము న
స్తోకము నై సంభవించె • సూటిగ నని తా
శోకసమాకులుఁ డౌచును
భూకాంతుఁడు మితియు లేక • భోరని పొగిలెన్. 205

క॥ హా రామ! పుత్త్ర లక్ష్మణ!
నీరజదళనేత్త్ర సీత! • నిరుపమ సుగుణా
కారుల రగు మీ మొదఁబా
టోరిమి నివ్వఁగను జాల•దో కో నాకున్. 206

క॥ కైకేయీ వరకారణ
మీాకరణిని మృత్యు వబ్బె•నే యని తా నీ
లోకమున నుండరా దని
చేకొనె స్వర్గంపుదారి • చెచ్చెర విభుఁడున్. 207

వ॥ ఇటుల బట్టరాని దుఃఖంబున మునిఁగి శాపకారణంబున భూలోక దివస్పతి యగు సాకేతరాజచంద్రుండు దుందుభివర్షచైత్ర శుద్ధ దశమి నర్ధరాత్రంబున గాలగతంబు నందిన తఱి. 208

క॥ రాజు కళంకియె కావున
దేజము దూలంగ నపర•దిక్కున కొరఁగెన్
రాజు కళంకియనారత
తేజోనిధి యాటకలదె • తీరుగ ధరణిన్. 209

చ॥ పరుఁడు బలాధికుండగుచు • వచ్చిన కాలవిధంబు గాంచి తాం.
దరపడి డాఁగ నేగఁ దరి•దప్పి యరాజకమైన దంచు నీ
ధరణి బరోపకారగుణ • తత్పరుఁ డెవ్వఁడో నిక్కయుక్కనం
గరిమ వహించుఁ గాదె రవి•కాంతులఁ జీకటి పారినట్లుగన్. 210

తే॥ పరుల నిష్కారణంబుగఁ ♦ బాధఁజేయు
వరుస నతితమోయుతులైన ♦ వార లస్త
మయమునందినఁ దత్తమో♦మయధరిత్రి
లోకభాంధవదీప్తి క♦ల్లోల మడఁగు. 211

తే॥ అతని గాంచియుఁ గౌసల్య ♦ యాసుమిత్రి
యన్యరాజాంగనామణు ♦ లంద ఱరసు
లందు మోదుకొంచును దుఃఖ♦మంది రందు
భూపురందరు చావు సం♦తాపకరము. 212

సీ॥ తనకు సౌఖ్యమటంచుఁ ♦ దలఁచి కేకయపుత్రి
వెతఁబెట్టె నని యేడ్చు ♦ వెలఁది యొకతె
తనకుఁ గీడొడఁగూడు ♦ నని యెంచకయ రాజు
వరము లిచ్చెనటంచుఁ ♦ బలుకు నొకతె
కైకయందలి ప్రేమ ♦ గలిగించె మన కిట్టి
పాటంచు నెదమోది ♦ పలుకు నొకతె
కటకటా యిటువంటి ♦ కఠిన వృత్తు లెటుండు
నని కుందు వాపోవు ♦ నబల యొకతె

తే॥ జనకనందని దురదృష్ట ♦ మను నొకర్తు
నన్యదూషణ లేల బూ ♦ ర్వార్జితాఘ
మెవరిదోకాని యిందఱ ♦ కేక కాల
మందె యావరించిన దంచు ♦ గుందు నొకతె. 213

మ॥ భవదీయంబగు సత్యవర్తనము ది ♦ వ్యత్కీర్తిసూర్యప్రభల్
భువి నాశాంత మనిందితస్థితిని సం♦పూర్ణంబుగా నిండి సం
స్తవనీయంబయి రాజశబ్దమున నీ ♦ సత్కీర్తిశంకాగతిం
దవిలెఁ భూధవ లోకబాంధవ కళా♦ధర్మంబు లవ్వాని కిం
పమ్రుగా రామవనప్రవాసమున మా♦కా ర్తిఁ జనింపించెడిఁ.

—♦ వసిష్ఠాదులు రాజనగరుకు వచ్చుట, భరతు బిలిపించుట ♦—

వ॥ అంత వశిష్ఠసంయమీంద్రుండు సచివసహితుండై భూనాథ సౌధంబుc బ్రవేశించి రాజదారల నాశ్వాసించి రాజకళేబరంబు తైల ద్రోణియం దుంపంజేసి దూతల నాహ్వానించి యిట్లనియె. 215

మ॥ తురగారూఢులు నాచు నందిపురికిన్ ♦ దూర్ణంబ మీరేcగుడీ
భరతుండచ్చట సోదరాన్వితుcడునై ♦ వర్తిల్లు మాయాజ్ఞచే
త్వరగా రావలెc గేకయాత్మజను మీ♦తండ్రింగనంగా ననం
గ రహింౘెల్పుcడి వెంటcబెట్టుకొని వే♦గన్ రండి పొండీ యిcకన్. 216

కం॥ అని గురువర్యుcడు దెలిపిన
జనియు యుధాజితు నగరికిc ♦ సత్వరమున నా
ఘను భరతమాతులుంగని
వినుతుల నొనరించి భక్తి ♦ వినయము లొప్పన్. 217

తే॥ భరతు సానుజు నీక్షించి ♦ పలికిరిట్టు
లావసిష్ఠుని యాజ్ఞచే ♦ నధిప యిటుల
వచ్చినారము మిమ్ముc స♦త్వరితగతి న
యోధ్యకును రమ్మనిరి వార♦లోజ మెయిని. 218

కం॥ అనవిని భయవిహ్వలుcడై
యనుజన్మునితోడcగూడి ♦ యాదూతల వెం
టనె యాచతుర్దశింజనె
జననీజనకులనుగాంచ ♦ సాకేతపురిన్. 219

ఆ శ్వా సాం త ము

శా॥ పాతాళాది నభస్స్థలాంతభువన ♦ బ్రహ్మాండ సంవిస్ఫురద్యో
తిస్స్ఫాటికలింగమౌళి విలస♦త్పూర్ణేందు వాతామృత
ప్రీతిప్లావన నిర్మలాంగ సుమన ♦ స్స్వీకార యోగ్యస్వయం
చేతః ప్రాభవకాల కాలభుజగ ♦ శృంగార భూషోజ్జ్వలా. 220

కం॥ శ్రీవెలుదుర్తి పురీచ్యా
శా విమలారణ్యవాస! సహజాదర స
ద్భావా! భావజవైరీ!
భావాతీతా! మృగధర! భవ! బ్రహ్మేశా!

దృతవిలంబితము

నిరత నిర్మల ♦ నిర్గుణ మండనా
సరస శారద ♦ శారద నారదా
వరద యాకర ♦ వాసవ వందితా
సురనరార్చిత ♦ శుద్ధపదాంబుజా!

గద్యము॥ ఇది...............శ్రీమదాంధ్రాధ్యాత్మ
రామాయణాంతర్గతంబగు నయోధ్యాకాండంబున
రామవనవాస దశరథనిర్యాణరూపక
తృతీయాశ్వాసము.





శ్రీ రా మ స హా య మ్

# శ్రీమదాంధ్రాధ్యాత్మరామాయణము

## అయోధ్యాకాండము.

### చతుర్థాశ్వాసము.



మద్యోగిజనావన
రామావనినాథహృదయ • రాజితనామా
నామాకార వివర్జిత
ధామా బ్రహ్మేశ్వర కలి•దర్పహరా!

మ॥ భరతప్రేషకదూతలుం జనిన త•ద్వార్తం గథాసంగతిన్
మురిపంబా వినఁ జెప్పవే హృదయస•మ్మోదంబు నందింపవే
కరమా కర్ణరసాయనంబుగదా • కంజాక్షుచారిత్రము
ర్వర రాకేందుకళాలలాట మునిహృద్రా•జీవ తేజోమయా! 2

— • మార్గమందు భరతుఁడు విచారించుచు, అయోధ్య జేరుట • —

ఉ॥ కారణమేమి లేక వడిగన్ • నను రమ్మని మద్గురూత్తముం
డారయ దూతఁ బంచుట ధ•రాధిపు నానతిలేక యుంట ని
ర్ధారణఁ జేయఁజాలని వె•తన్ మదిగుందఁగనాయె నక్కటా
వారల కేమి హాని బల•వంతముగం జనియించెనో కదా! 3

తే॥ దశరథాధీశు విషయంబు ♦ దలఁప మదికిఁ
బట్టరానట్టి దుఃఖంబు♦వచ్చుచుండె
నవని విలయంబునైనదా ♦ యనిన యటులఁ
గలఁతఁ బెట్టెడి నిది యేమి ♦ కాలవిధియొ? 4
క॥ అనఘుఁడు రాముని కేనై
నను వాటిలెనేమొ వెతలు ♦ నాడెందమునం
దున జెయివెట్టి కలియఁ బె
ట్టిన విధమున దాప ముబ్బె♦డి నిదే మకటా! 5
మ॥ అని చింతించుచు మార్గమందున నయో♦ధ్యం జేర శీఘ్రమ్ముగం
జనియెన్ దుందుభి చైత్రిపూర్ణిమ వెసం ♦ జన్నంత దత్పంచమీ
దిన సాయంతన వేళ నానగరమం♦దీభూతచైతన్యమున్
జనశూన్యంబును గాంచి దుఃఖహృతభు♦క్సంత ప్తచి త్తంబునన్. 6
చ॥ జనతతి గానరా దెచట ♦ సంపదలన్నియు వన్నెతప్పియుం
గనుపడె నుత్సవాది పరి♦కల్పిత మంగళతూర్యనాదముల్
వినఁబడ వేదెసన్ నగర♦వీధుల శోభనదృష్టికప్పె నా
మనమున కేదియో దిగులు ♦ మైకొనెనే యిదె చిత్రిమయ్యెడిన్.
తే॥ అనుచు యోచనాయత్తుఁడై ♦ యతిరయంబ
రాజ్యలక్ష్మీ వివర్జిత ♦ రాజభవన
సీమ కేగియు బలుమారు ♦ జిత్తమందుఁ
గలుగువెత నాపుకొనుచును ♦ గలవరమున. 8
సీ॥ సురనాథ విభవైక ♦ భరిత లక్ష్మీకమౌ
రాజగేహము కాంతి♦రహితమయ్యె
పార్థివశయనీయ ♦ వర హేమపర్యంక
శుభలక్షణంబెల్ల ♦ శూన్యమయ్యె
ప్రతినిమేష వినూత్న ♦ రాజ్యలక్ష్మీ గృహంబు
భ్రష్టలక్ష్మీకమై ♦ ప్రతిభదప్పె

ప్రత్యహస్నానమంత ♦ రాజ రాజిచరించు
రాజకూటములు నిర్జనములయ్యె

తే॥ జీవమణిగణకాంతి సుర్జీవమయ్యె
సేవకావళి మునివృత్తిఁ ♦ జెందుటయ్యె
జూతమని డాయ నన్నియు ♦ శోభదప్పె
నే యటంచును దోఁచు నా ♦ కేమొకాని. 9

క॥ అని మదిలోఁ బొగలుచుఁ జని
చని యేకాంతమున నొర్తె ♦ సద్రుచిమణిపీ
ఠిని నాసీనయయిన త
జ్జననీమణిఁ గాంచె భక్తి ♦ సహితుం డగుచున్. 10

తే॥ జనని పాదాబ్జములఁదాక ♦ తనదు శిరము
మ్రొక్కె సాష్టాంగముగ దల్లి ♦ పూజ్యురాలు
గాదె భువిలోన నెంతటి ♦ కఠిన వృత్తి
గలదియైననుసుతులకుఁ ♦ గాళికాంబ. 11

తే॥ వచ్చు భరతుని నీక్షించి ♦ భరతమాత
ప్రేమసంభ్రమచిత్తయై ♦ వేగవేచి
సరభసంబున సుతు బరి ♦ ష్వజమొనర్చి
స్వాంకసంస్థితుఁ గావించి ♦ యతిముదమున. 12

—* భరతుఁడు కైకనుగాంచుట. *—

మ॥ శిరముల్ మూర్కొని కైక వేగ స్వకుల ♦ క్షేమంబు భాషించి యో
భరతా! మా జనకుండు సేమముగదా? ♦ భద్రాత్మ మాతల్లి సుం
దరుఁడౌ సోదరుఁడున్ సుఖాన నట ను ♦ న్నారా? పురాభాగ్యసం
భరితంగావున గాంచఁగాఁ బడితివ ♦ ప్పా! పుత్ర చూడామణీ!

తే॥ ఉరుతరార్తిని బ్రశ్నింపు ♦ చుండ జనని
యతఁడు చింతాకులేంద్రియుం ♦ డగుచుఁ గాంచి
దూయమానైక హృదయుఁడై ♦ తొట్రువడెడు
పలుకు లొప్పంగఁ దల్లితోఁ ♦ బలికె నిట్లు 14

తే॥ ఈవొక ర్తవె యుంటి వీ ♦ వేల నిచట
నెచట నున్నాఁడు మాతండ్రి ♦ యెపుడుకాని
నిన్ను విడచి యుండఁగ లేఁడు ♦ నీదు చెంత
లేని కారణం బేమి యా♦లింపఁ దెలుపు.

క॥ జనకుని గాంచక యుండిన
మనమున దుఃఖంబు భయము మైకొనెనేమో
వినఁ దెల్పుమిపుడు వైళమ
జనకుం డున్నట్టిజాడ ♦ జననీ! నాకున్. 16

చ॥ అన విని కేకయాత్మజ ర♦యంబున, బుత్రక! దుఃఖ మేలనో
యనఘ! సదశ్వమేధ సవ♦నాదు లొనర్చిన యట్టివారికిన్
ఘనతరధర్మశీలురకు ♦ గౌరవ మొప్పఁగఁ గల్గునట్టిదై
మనియెడుచోటు నందె జన♦మాన్యుఁడు నీజనకుండు నాత్మజా! 17

తే॥ అనఁగ విని శోకవిహ్వలుం ♦ డగుచు ధరణి
బడియు భరతుండు గన్నీరు ♦ వరద బార
భోరు భోరన నేడ్చి హా ♦ పోయి నన్ను
విడచి వృజినార్ణవంబున ♦ వెడలి తెటకో? 18

మ॥ అనఘా! రాజగు రామచంద్రునకు న ♦ న్నర్పింపకుండంగ నే
జనినా వెచ్చటి కీవు సూర్యకుల♦విస్తారా ప్రియంభావుకా
జనకా! అర్భకులైన మమ్ము విడువన్ ♦ స్వాంతంబు నీ కెట్లు సం
జనితంబయ్యెను బట్టఁజాలను మన ♦ స్తాపంబు వారింపవే. 19

తే॥ ముక్తమూర్ధజుండయి పొంగి ♦ పొరలి పొరలి
యేడ్చు భరతుని వెసలేవ ♦ నెత్తి నేత్ర
బాష్ప విమృజంబు గావించి ♦ వ్యాకులంబు
బాఱఁదోలు మనుచు నిట్టు ♦ లూరడించె. 20

తే॥ నీకు భద్రంబు గలుగుత ♦ నియతి సకల
రాజ్యమును బ్రీతితోడ నా ♦ ర్జనముఁ జేసి

యున్న దానవ వెత వీడు ♦ మన్న మదిని
నీడులేని సౌఖ్యము భుజి ♦ యింపుమన్న. 21

క॥ అని యాదరించు గైకను
గని మాతండ్రి ♦ మరణించు కాలంబున నే
మనె నన భయవర్జితయై
తనయునితో నామె యిటుల ♦ దడయక పలికెన్. 22

క॥ హా రామ రామ రామా
శ్రీరామా రామ రామ సీతారామా!
హా రామ రామ లక్ష్మణ
హారామ యనుచు దివమున ♦ కరిగె విభుండున్. 23

క॥ ఓతల్లి రాముఁ డెచ్చట
నాతరిఁ జనినాఁడు లక్ష్మ ♦ ణాఖ్యుఁడు లేడా?
సీతా సతియున్ లేదా?
నా తాపము నావఁ దెలుపు ♦ నా యమ్మా! యనన్. 24

క॥ అన విని కేకయపుత్రియు
దనయా! యువరాజుఁ జేయ ♦ దండ్రియు రామున్
మనమున సంబరపడి నే
పనివడి విఘ్నంబొనర్చి ♦ పలికితి నిటులన్. 25

క॥ నీకు ధరాతలదానము
జేకొని యిప్పింపఁ దలఁచి ♦ చేసితి రాజ్య
స్వీకార మొనర్చియున
స్తోక సుఖంబుల భుజింపు ♦ సుతుఁడా! నీవున్. 26

క॥ మును నాకు రెండు వరములు
జనపతిచే నొసఁగఁబడిన ♦ సంగతి వినవా
మనమున నీపైఁగల ప్రే
మను యాచింపవలసె విను ♦ మా నీవవియున్. 27

చ॥ వరములరెండిటన్ భరత! ♦ భవ్యసమ స్థరితి నీకుగా
గరిమ నొసంగ వేడితి నిఁ•కన్ మరియొక్కటి నింపుమీరగా
నిరుపమరీతి రాముఁడు ము•నివ్రతమున్ ధరియించి కానలం
దిరుగఁగఁ గోరగాఁబడె సు•ధీరత రాజ్యము నేలు మేలుగన్. 28

ఉ॥ ఆవల సత్యసంధుఁడయి•నట్టి భవజ్జనకుండు బ్రీతి నీ
భావలయంబు నీకు సమ•బుద్ధి నొసంగియు రామచంద్రునిన్
భావమునందు మెచ్చి వన•వాసమె చేయఁగఁ బంపినాఁడు నీ
వీ విషయంబు గాంచి భరి•యింపుము సార్థకనామధేయతన్. 29

ఉ॥ సీత పతివ్రతాత్వమును ♦ జిత్తమునన్ సముపాశ్రయించి సం
ప్రీతిగ రాము వెంబడిని ♦ వెళ్లెను లక్ష్మణుఁ డన్నసోదర
ప్రీతినిజూప రాఘవుని• వెంబడి వేగఁ బ్రయాణమయ్యె వా
రాతరిఁబోవఁగా దశర•థావనిపాలుఁడు రాజరా జటన్. 30

ఆ॥ రామ రామ యనుచుఁ • బ్రిలపించి ప్రిలపించి
మరణ మొందె ననెడు•మాట యతని
శ్రవణపుటముఁ జొరగ • శతకోటి నిహతాగ
విధము ప్రిజ్ఞదప్పి • పృథివిఁ బడియె. 31

తే॥ తనయు నీక్షించి దుఃఖత•త్పరయు నగుచు
గేకయాత్మజ యోతండ్రి! • నీకు దుఃఖ
మేల ననె నేది కావింప ♦ నీషణంబు
ధరణి వెనుకంజ వేయ దీ•శ్వరునకైన. 32

తే॥ ఇట మహాద్రాజ్య సంప్రాప్తి ♦ నెనసియుండ
నవసరంబేమి దుఃఖింప ♦ ననుచునున్న
జనని దహింపజను వాని•సరణిఁ గాంచి
భరతుఁ డీరీతి భాషించె • గిరితనూజ! 33

సీ॥ పాపిష్ఠురాలవు ♦ భర్తృఘాతిని వీవు
క్రూరురాలవు మహా•ఘోరమతివి

భాషింపఁదగదు నీ • వదనంబు నీక్షింపఁ
గారాదు నేను నీ • గర్భమందు
బ్రభవించుటవలన • బ్రబలపాపిని నేను
విషమైన భక్షించి • విడుతు తనువు
వహ్ని నైనను దూకి • ప్రాణంబు విడచెద
నసిధారచేనైన • నాత్మహత్య
తే॥ జేసికొని నేను యమలోక•వాసి నగుదు
మగని జంపినదాన దు•ర్మార్గురాల
యరుగుమీవు కుంభీపాక • నరకమునకు
యమపురంబున నీరాక • నరయుచుండె. 34

తే॥ అనియుఁ గేకయభువినాథు•తనయఁ గాంచి
దూఱనాడియు వేవేగ • దొట్రుపడుచు
జనియె గోసలరాజాత్మ•జాత భవన
మునకు భరతుండు శాంతసం•పూజ్యరతుఁడు. 35

—* భరతుఁడు కౌసల్య యింటికిఁ జనుట *—

చ॥ తనయు వనప్రవాసజని•తవ్యథచే సగమైనమేన నా
థుని నిధనంబు కొంతపయి • దోడయి కుందెడు కోసలాధినా
థునిసుత యీతనిం గనిన•తోడనె భోరని వెక్కి వెక్కి యే
డ్చెను తనవారలం గనినఁ • జెచ్చెరదుఃఖము పొంగి పొర్లెడిన్.

తే॥ అప్పు డాయమ పాదాబ్జ • మంట నొరగి
శోక విహ్వల హృదయుఁడై • శోకవనధి
మునిఁగి దిక్కులు మార్మ్రోత • బుట్టనేడ్చు
చున్న భరతుండ గిరిపుత్రి! • యోర్మివినవె. 37

తే॥ మహితకీర్తిశాలిని రామ•మాత సాధ్వి
తనయు వనవాసజనిత సం•తాపకృశతఁ
జెంది యతిదీనవదనయై • చేరి భరతు
ననియె గాఁగిలించియు వేగ • సాశ్రునేత్ర. 38

తే॥ పుత్రికా ! నీవు దూరంబు ♦ పోయినపుడె
సర్వ మీవిధంబుగ నిందు ♦ సంభవించె
స్వీయజననియు భాషించు ♦ విధము నీవు
వినియె యుందువు సాంతంబు♦గను సుబుద్ధి ! 39

చ॥ వనితయు వెంటరాఁగఁ నతి♦భక్తిని లక్ష్మణుఁ డొర్మినుండ నా
తనయుఁడు రామమూర్తియును ♦ దద్దయుఁ బద్ధ జటాకలాపుఁడై
ఘనతర చీరధారియయి ♦ కానలకే చనె దుఃఖవార్ధిలో
మునిఁగిన నన్నువీడి మునిపూజ్యుఁడుగా భరతా,సుతా,హితా! 40

చ॥ అనఘ! పరాత్పరుండ వయి♦నట్టిడ వోరఘువంశనాథ నీ
వనుపమరీతి నాసుతుఁడ♦వై జనియించితివైన నన్నిటన్
ఘనతరదుఃఖమున్ విడువఁ♦గాదు బలీయము దైవమంచు నా
మనసున నెంతు నోదనుజమర్దన రామ జనార్దనప్రభూ! 41

క॥ అని యిటు విలపించెడు నా
మెను గాంచియు భరతుఁడు ♦ మేలుగ బలికెన్
జననీ నీపద మంటియు
వినుపించెద నేను వినుము ♦ విశ్వాసమునన్. 42

సీ॥ కైకేయికృత దుష్ట ♦ కర్మంబు శ్రీరామ
పట్టాభిషేచన ♦ భంగమేని
యితరకృత్యముగాని ♦ యే నెరింగియె యున్న
బ్రేరేపణము జేయ ♦ మారుకొనిన
బ్రహ్మహత్యాశతో♦ద్భవతాప మగుగాక
నాకు నో జననిరో ♦ నాకు గురుఁడు
సతి యరుంధతి సమ♦న్వితు వసిష్ఠుని ఖడ్గ
మున జంపినభవంబు ♦ బొందఁగలను

తే॥ నే నటంచును భాషించు ♦ నియత శపథ
వాక్యమును విని భరతుని ♦ వనటఁగాంచి

యుక్కనను జేర్చి యాక్రోసంలాత్మజాత
పలికెఁ దన్మనోగత దుఃఖ • పఙ్క్తిఁదొలఁగ॥ 43

తే॥ తనయ! యీవిధమెల్ల నీ • మనమునకును
దెలియఁగా లే దటంచును • దెలియు నాకు
దుఃఖమును జెందవల దింకఁ • దూలఁదగదు
వసుధ గతగోష్ఠి యోచింప • ఫలముగలదె? 44

క॥ భరతుని నూరటఁ బుచ్చఁగ
కరుణను వెతనాపి నీతి,గరపెను గద యీ
తరుణీమణి శాంతముతో
సరిపోల్పఁగ నామె కామె • సరిలేరెవరున్.

—• వసిష్ఠుడుఁ భరతు నూరడించుట, తత్త్వోపదేశము •—

కం॥ భరత సమాగమమును విని
గురుఁడు వసిష్ఠుండు మంత్రిఁ•గూడియు నృప మం
దిరమునకుం జని యేప్చెదు
భరతుని గని సాదరముగఁ • బల్కె నతండున్. 46

సీ॥ జ్ఞానియు వృద్ధుండు • సత్యప్రభావుండు
మర్త్యసౌఖ్యము లెల్ల • మహిభుజించె
విపులదక్షిణలచే • వెలయుచుండెడి దివ్య
దశ్వమేధాదుల • నాచరించె
సురల నారాధించి • హరియైన శ్రీరాము
బ్రియపుత్రుగాఁజేసి • వెలసినాఁడు
వరదానకలన భూ•సురతుష్టి గావించి
యానేతుహిమనగ•ప్రాంత మేలె

తే॥ తరణికలశాబ్ధి చంద్రుండు • దశరథుండు
నంతమందునఁ ద్రిదివంబు•నందు నింద్రు
నర్ధసింహాసనాసీనుఁ • డగుచునుండె
వృథగ శోకింపవల దింక • వినుము భరత! 47

ఆ॥ అతనిగూర్చి నీవు ♦ నార్తి నందఁగనేల
మోక్షభాజనుండు ♦ పూజ్యగుణుఁడ
శోచ్యుఁడైనవాఁడు ♦ శుద్ధుండు దశరథ
చక్రవర్తి తెలియు ♦ స్వాంతమునను. 48

తే॥జన్మనాశాది వర్జిత ♦ స్వామి యాత్మ
నిత్యుఁ డవ్యయుఁ డాద్యుండు ♦ నిర్మలుండు
జడము దేహంబు నత్యర్థ ♦ సంజ్ఞగలది
యపరిశుద్ధంబును వినశ్వ♦రాభిదంబు. 49

క॥ కాన విచారము సేయఁగ
మానసమున దుఃఖమందు ♦ మాటయె లే దెం
దేనియు నవకాశమె లే
దో నియతాత్మ భరత! విను ♦ మోర్మిమెయిన్. 50

క॥ జనకుఁడో తనయుఁడో గతుఁడై
చన మృత్యువశుండయి యిలఁ♦జచ్చిన వానిం
గని మూఢులు నెద మోదుక
మనమున దుఃఖింతురు గద ♦ మాన్యచరిత్రా! 51

తే॥ సార హీనమైనట్టి సం♦సారమందు
జ్ఞానులకు వియోగం బది ♦ కలిగినపుడె
సరస వైరాగ్యహేతువై ♦ శాంతిసౌఖ్య
ములనొసంగుచు నుండు సం♦పూర్ణ గరిమ. 52

క॥ జననమునందిన వానికి
గన మృత్యువు వెంటనంటి ♦ కాచియె చను గా
వున జన్మవతుల కెప్పటి
కనివార్యము తోఁచి పుచ్చ ♦ నయ్యది ధరణిన్. 53

క॥ తనకర్మవశత జంతువు
జనియించును జచ్చునంచు ♦ స్వజనాప్తులగాం

చిన సజ్జానికె వెతలె
దన విద్వాంసుండు నార్తి ♦ నందుట లెటులన్. 54

తే॥ కాంచ బ్రహ్మాండములు పెక్కు ♦ గడచి చనియె
సృష్టి విషయంబు లెన్నియో ♦ చెలఁగి పోయె
సాగరము లన్ని శుష్కించె ♦ సరవి ధరణి
నాత్మ క్షణజీవితంబున ♦ కాస్థ యేల? 55

తే॥ చలన మందెడి పత్రాంత♦జలలవంబు
గతిని క్షణభంగురం బౌచు ♦ గడచునాయు
వెప్పుడై నను దానియం ♦ దిందు నీకు
బ్రత్యయం బేమి భాషింపు ♦ భరత ! వినఁగ. 56

సీ॥ దేహియుఁ బ్రాక్తన♦దేహార్థ కర్మచే
జనియించి దేహియై ♦ సర్వకర్మ
లాచరించుచు దేహి♦యై పుట్టు జీవున
కీరీతి దేహంబు ♦ లెనయుచుండు
ప్రాచీన సంజీర్ణ ♦ వసనంబుఁ ద్యజియించి
క్రొత్త వస్త్రము మెచ్చి♦కొనినయటుల
జీర్ణ దేహము వీడి ♦ జీవుండు నూతన
దేహంబు భజియించి ♦ తిరుగుచుండు

తే॥ నవసరం బేమి దుఃఖింప ♦ నందు నాత్మ
చావ దెప్పుడు పుట్టదు ♦ సరవి వృద్ధి
నందఁబోవదు నీయాత్మ ♦ నరయుమయ్య
భవ్య గుణరత ! ధర్మ సం♦భరిత ! భరత ! 57

తే॥ ధరణి షడ్భావరహితుఁడై ♦ తిరుగువాఁడు
ధర్మ సత్య విజ్ఞానావ♦తార మూర్తి
లయవివర్జితుం డానంద ♦ లక్షణుండు
సాక్షియై యురఁడు బుద్ధ్యాది ♦ సమితి కెపుఁడు. 58

తే॥ ఆత్ముఁడొక్కండు సమవర్తి ♦ యద్వితీయుఁ
డనియుఁ బరుఁడంచు నీయాత్మ ♦ నరసిశోక
మవలఁ బోఁదోలి దృఢబుద్ధి ♦ ననుసరించి
కర్మ జేయంగ మొదలిడ ♦ గడగు మీవు. 59

ఆ॥ దశరథాఖ్యు తనువు ♦ తైల కటాహంబు
నందు నుండుదాని ♦ నవలఁదీసి
పైతృకం బొనర్పఁ ♦ బ్రారంభమును జేయు
వంశనందనుండ ♦ భరత! యింక. 60

మ॥ అని బోధింప పసిష్ఠుఁ డంత భరతుం ♦ డజ్ఞానసంజాత శో
కనిరోధం బొనరించి తాను విధివ♦త్కర్మానుసారంబుగా
జనకాంత్యక్రియ లాహితాగ్నికముగా ♦ సంస్కారముం జేసె నిం
పున శత్రుఘ్న వసిష్ఠ మంత్రియుతుఁడై ♦ పుత్రోక్తి సార్థంబుగన్.

—♦ దశరథ సంస్కారము. ♦—

తే॥ చైత్ర బహుళ షష్టియు మొదల్ ♦ శ్రుతియాన్వ
యవిధమున నమావాస్య స♦మాప్తిఁ జేసి
శుద్ధపాడ్యమి నాశౌచ ♦ శుద్ధిఁదనర
విదియ సాపిండ్య మొనరించె ♦ విధియుతముగ.

తే॥ వేదపారగ బ్రాహ్మణ ♦ బృందములట
సంతసింపంగ భక్ష్యభో♦జనము లొసఁగె
శతసహస్రంబు లయుతముల్ ♦ సరవిమించ
దనర నేకాదశాహ్నిని ♦ జనకతృప్తి. 63

క॥ జనకుని నుద్దేశించియు
ధన కనకచిరత్న గో వి♦తానముల నొసం
గెను సాలగ్రామాంబర
ఘనతర గ్రామముల బ్రహ్మ♦గణసంతృప్తిన్. 64

తే॥ అంత భరతుండు స్వీయగే♦హంబునందు
రామచింతనచే సహ♦భ్రాతృ మంత్రి
కులగురు పరివారితుఁడౌచు ♦ గొందలమున
జనకుమృతి పుత్రసంతాప♦జనకముగద! 65

సీ॥ జానకీసహితుఁడై ♦ సౌమిత్రితోఁగూడి
రామమూర్తి యరణ్య♦రాజ్య మేలఁ
జనుట ఘోరముగదా! ♦ జనని కేకయపుత్రిఁ
గాంచిన రాక్షసిఁ ♦ గన్న విధము
మానసంబు దహించు ♦ మహీవీడి యఖిలంబు
స్థిరమతిఁ గానన♦సీమఁ జేరి
సీతాసమేతుని ♦ స్మితరుచిరాస్యుని
శ్రీరామమూర్తి సం♦సేవఁ జేసి
తే॥ కాలమచ్చట వెళ్లింపఁ ♦ గలను నేను
నిలువనోపను విభు వీడి ♦ నిముసమైన
ననుచుఁ జింతించుచుండె నా ♦ యనఘుఁ డవని
స్వీయ సుఖవాంఛ కులమెల్లఁ ♦ జెరుపగలదు. 66

—♦ భరుతునకు పట్టాభిషేకంబు గట్టనెంచుట ♦—

తే॥ మంత్రి పరివారితుం డయి ♦ మహీవసిష్ఠు
రాజసభఁ జేరె మునుల ద♦న్నోజమెయిని
నావరింపంగ వేవేగ ♦ దేవసభను
బోలె నపరచతుర్ముఖుఁ ♦ బోలె నుండె. 67

తే॥ ఆసనంబునఁ గూర్చుండి ♦ యమివరుండు
భరతు శత్రుఘ్నయుక్తు స♦త్వరితగతిని
సభకు రావించి యట సుఖా♦సనుని జేసి
దేశకాలోచిత స్థితిఁ ♦ దివిరి పలికె. 68

తే॥ వత్స! త్వత్పితృశాసన • బద్ధులమయి
యిపుడు రాజ్యాభిషేకంబు • నింపుమీరఁ
జేయగా నెంచినారము • చేరిరాజ్య
భారమును బూని పాలింప • వలయునయ్య. 69

మ॥ పురుషశ్రేష్ఠుఁడ! కేకయాత్మజయు నా•భూమీశు యాచింప నీ
కొఱకై రాజ్యము సత్యసంధుఁడట నీ•కున్ బుద్ధిపూర్వంబుగా
ధరణిన్ సర్వము ధారవోసెను గదా! • తద్రాజ్యపట్టంబు నిం
పరయం గట్టఁదలంచినాము కొనుమ•య్యా మంత్రిపూతంబుగన్ 70

మ॥ మునివాక్యంబుల నాలకించియును నే•ర్పున్ మీర నీరాజ్యముం
బని లేదేమి ప్రయోజనంబిచట ని•ల్వన్ మాకు రాజాధిరా
జన శ్రీరాముఁడె వానికింకరుల మ•య్యా! మానిచంద్రోత్తమా
యని తన్నిశ్చయసూక్తులం దెలిపె న•త్యంతార్తితో నంతటన్. 70

తే॥ నేను మీరలు రేపె యా • నీరజాక్షు
పురికిఁగొనిరాగ జనవలెఁ • బూజ్యచరిత!
తక్కరాక్షసి కైకేయి • తక్కినట్టి
తల్లులందఱుఁ గూడియుఁ • దరలనెంతు. 72

తే॥ మాతృగంధిని కైకేయి • మస్తకంబుఁ
ద్రుంపఁగా నెంతుఁగాని యా•తోయజాక్షుఁ
డాత్మ నెఱిఁగిన స్త్రీహంత • యనియు నన్నుఁ
గనియు క్షమియింపఁ డను భీతి • దనరునాకు. 73

మ॥ చనెదం దమ్మునితో నరణ్యమున క•స్మద్వంశనాథోదయం
బునకున్ మున్నె రఘుప్రవీరుఁ బిలువన్ • భూజాత సౌమిత్రిలం
గొనిరా మీరలు రండు మానుఁడు ననుం•గుం రాముఁ దోడ్తేర నం
చనె దత్సోదరభక్తిఁజూచిన నెటన్ • సత్కీర్తనీయంబగున్. 74

చ॥ వనముల గామచంద్రుఁడును • వర్తిలుచందమె వల్కలాంబరా
జినముల నేను గైకొనియుఁ • జెచ్చెరఁ దమ్మునితోడ నుందు నిం
దున ఫలమూలభక్షణముతో • దృఢబుద్ధిని భూమిశయ్యగాఁ
గొని వ్రతినై చరింతు నిట•కున్ రఘురాముఁడు వచ్చునంతకున్

—♦ భరతుఁడు రాము గననెంచి చనుట ♦—

చ॥ అని తన నిశ్చయంబు సభ♦నందఱుఁగాంచ వచించి మానినా
గను నటనున్న నాభరతుఁ ♦ గన్గొని వారు ముదాన్వితాత్ములై
రని వచియింపఁగా వలెనె ♦ రాజసబుద్ధియె వానికున్నచో
వనమున కేగు యత్న మన♦వశ్యము తత్క్షమ యెట్టిదో కదా. 76

తే॥ అంత నా షష్ఠినుదయాన ♦ నరుగ భరత
సహచరులగుచు సాశ్వకుం♦జరులు సర్వ
సైనికులు మంత్రిబ్రేవఁ ♦ గాననమున
కేగఁ దరలిరి ముందు ముం♦దే నటంచు.

సీ॥ కౌసల్య మొదలైన ♦ కాంతాశిరోమణుల్
బ్రాహ్మణప్రముఖులు ♦ వారిగురుఁడు
ముందు వెన్కను పార్శ్వ♦ములమూగి భరతుని
భూమి నాచ్ఛాదించి ♦ పోయిపోయి
శృంగిబేర పురంబుఁ ♦ జేరి గంగా కూల
మున సేనలెల్లను ♦ విడిసియుండ
పరివార సహితుఁడై ♦ భరతుండు వచ్చినాఁ
డని విని సందేహ ♦ మలరి గుహుఁడు

తే॥ నవిదిదాత్ముఁ డైనట్టి రా♦మాఖ్యునకును
బాప మొనరింప బోవునా? ♦ పాపికాడో
వాని హృదయంబు దెలియంగ ♦ వలయు దుష్టుఁ
డైన సురనది దరియింప ♦ నప్పఁ డతడు. 78

—♦ గుహసందేహము భరతవిలాపము ♦—

తే॥ అనియు నావను దూరంబు♦నందు నుంచి
యాయుధంబులతోఁ గూడ ♦ నన్నిదిశల
సావధానులై చూచుచు ♦ నరయుఁ డనుచు
నాత్మ బంధువులకు నెల్ల ♦ నానతిచ్చె. 79

సీ॥ నానావిధోపాయ♦నంబులఁ గైకొని
వివిధాయుధంబులఁ ♦ వెలయునట్టి
జ్ఞాతివర్గముతోడఁ ♦ జనుదెంచి భరతాగ్రి
మందున దదుపాయ♦నాళినుంచి
యనుజుతోఁ దనమంత్రి♦జనులతోఁ గూడియు
నాసీనుఁ డైనట్టి ♦ యనఘచరితు
జీరాంబరాన్వితు ♦ శ్రీఘనశ్యామాంగు
ధృత జటామకుటు దేవసముని
తే॥ రామరామేతివాదను ♦ బ్రేమమీరఁ
గాంచి శిరము భూమినిగాక ♦ నంచితాప్తి
వందనంబుల నర్పించి ♦ పరమభక్తి
గుహుఁడ నే నని భరతుతోఁ ♦ గోరిపలికె. 80
తే॥ గుహుని వేగంబ లేవంగ ♦ నెత్తి ప్రీతి
గాఢముగఁ గౌఁగిలించియుఁ ♦ గరము కుశల
మడిగి సాదరంబున మిత్రుఁ ♦ డైనవాని
గనియు నవ్యగుప్తిఁడై యిట్లు ♦ లనియె నతఁడు. 81
తే॥ అనుజ! రామునితోఁగూడి ♦ యలరినావు
సార్ద్రినయనుండు నమలాత్ముఁ ♦ డైనరాము
కౌఁగిలిని బొందినాఁడ వు♦త్కర్ష మెఱయ
ధన్యుఁడవు కృత కృత్యత ♦ దనరినావు. 82
తే॥ అనఘు జానకీసహితుని ♦ వనజపత్ర
నేత్రు లక్ష్మణాన్వితు రాము ♦ నెమ్మిఁగాంచి
భాషణంబులఁ గావించి ♦ వరలినాఁడ
వేమటందును నీపుణ్య ♦ మిద్ధచరిత. 83
తే॥ రాముఁడెచ్చట నీచేతఁ ♦ బ్రేమమీరఁ
గాంచఁబడియె నచ్చోటునఁ ♦ గాంచఁజేయు

మయ్య సీతాసమేతుఁడై ♦ యధివసించి
నిదురఁజెందిన చోటు, నియతిఁ జెల్వు. 84

ఉ॥ నీరజపత్త్రనేత్రునకు, నీవు ప్రియుండవు తత్సుభక్తి నిం
పారినవాఁడవౌట సుఖ,లాన్వితభాగ్యవదుత్తమస్థితిన్
గౌరవ మంది యుంటివి, యికన్ విభుదర్శన భాషణ స్పృశ
స్ఫారిత రీతు లబ్బినవి, జన్మ ఫలించె నటంట శంకయే! 85

తే॥ వనజనాభుని దలఁచుచు, భరతుఁడంత
సాశ్రు లోచనుం డౌచు, నానిషాద
సహితుఁడై యట శ్రీరామ ♦ చంద్రుఁడు నిశి
వాస మొనరించె నాపుణ్య ♦ వసుధఁ జనియె. 86

మ॥ భువిజాభూషణ కాంచనాంచిత రజః, పూర్ణ ప్రభాపీతద
ర్భ విశాలాస్తృతణంబునై చెలగు త,త్పర్యంకవిభ్రాజమా
నవనిం గాంచియు శోకతప్తహృదయుం,డై కైకయీపుత్త్రుఁ డెం
తో వగంగుందె మదిం బ్రతిధ్వని వనిం, దోపంగ దీనంబుగన్.

సీ॥ కనకమంజులరత్న, గణవినిర్మితసౌధ
పరిభాసితోద్యాన,వాటి చంద్ర
కాంతవేదికయందు, ఘనరత్న పర్యంక
మున బూలసెజ్జను, మోదమలర
శ్రీరామసహితమై, చెలఁగుచుండినయట్టి
యతిసుకుమారి యీ, యబలసీత
జనకనందని మృదు,సందోహ నిమ్నోన్న
తావని నిట్టి ద,ర్భాసనమున
వనజనాభునితోడఁ, బవళింపవలసి వ
చ్చెనుగదా? నాదోష,మునసె యెట్టి
తే॥ వెతలు సమకూరె హారహా, వినము మ్రింగి
నటుల నావఁదాప్రవినయట్టు, లాత్మ కనలి

పోవు అంపకోతవిధాన ♦ బొక్కుచుండె
నీదురాత్మునిఁ డిద్ధాత్రి నిం కేల బ్రతికి? 88

మ॥ వనజాతంబున భూతలంబున సుధా♦వారాశి శేషాహి శ
య్యను వైకుంఠపురస్థలంబునను భ♦ద్రాకార మేపారి స
జ్జన వాంఛామరభూజమై తనరి యా♦సాకేతమందొప్పి రా
మునితో నేటికి గాన దర్భశయనం♦బుం జేయ వాటిల్లెగా. 89

మ॥ జనకాధీశున కీవనుంగుసుతవై ♦ సాకేత సామ్రాజ్యనా
థునకుం గోడలివయ్యు మాధవధను ♦ ర్దర్వనిర్వాపకుం
డని కీర్తిం గొనినట్టి వాని లసద♦ర్ధాంగంబు గైకొన్న యో
జననీ నీవె వనప్రవాసదురవ♦స్థం జెందితే? జానకీ! 90

ఉ॥ పాపపుఁ బోవునాఁ బరగు ♦ భూమిని గేకయరాజపుత్రి యా
పాపపుగర్భమందున భ♦వంబయి పాపుఁడ నేను గూడ ఛీ
యీపరితాప మెల్ల జని♦యించుట రాఘవ నానిమిత్త మో
హోపరమాత్మ యిట్టిభవ♦ మొప్పనె నన్ను దహింపకుండఁగన్.

మ॥ వని రాముల్ వెనువెంట నంటి నిజ♦భక్త శ్రేణి నగ్రత్వముం
గొని సౌమిత్రియు జన్మసార్థకము జే♦కూర్చెన్ మహాత్ముండునా
దనరెన్ నే నన రామదాసు లెవ రు♦న్నారో సదా వారిదా
సునకున్ దాసుఁడనైన జన్మఫలియిం♦చున్ సత్య మీమాటయున్.

క॥ అనుజా రాఘవుఁ డెట నీ
వని యున్నాఁడో యెఱుంగ ♦ వచ్చిన నీకున్
మన మొప్పఁ దెల్పు మంతయు
వనజాక్షుని బిల్వరాగ ♦ వచ్చితి నేనున్. 93

క॥ గురుతు నెఱింగిన సంగతి
నరమర లేకుండఁ దెల్పు ♦ మన్నా నీ వీ
భరతుఁడు గైకయిసుతుఁ డని
పరమార్థము విడువఁదగదు ♦ భవ్యచరిత్రుల్. 94

చ॥ అని వచియించుమాట విని ♦ యాగుహుఁ డీతఁడు దోషమేమియుం
బనిగొనినట్టుఁ దోప దని ♦ భావమునందున నిశ్చయించి ప్రే
మను వచియించె రామునెడ ♦ మానిని సీత ధరిత్రిజాతపై
దనరెను లక్ష్మణాఖ్యునెడ ♦ ధన్యుఁడ వీవె సుభక్తినిల్పితే. 95

ఉ॥ రాముఁడు లక్ష్మణుండును ధ♦రాసుత గంగసమీపమందునన్
ప్రేమను సంయమిప్రవర ♦ విస్ఫురదుత్తమ చిత్రకూటికా
రామమునన్ వసింతు రిక ♦ రాముని లక్ష్మణసేవితాంఘ్రి సం
ధాముని గాంచ నర్హుఁడవు ♦ ధాత్రిసుతాహృదయాభిరామునిన్.

చ॥ మనమున సంశయంబు విడి ♦ మానితబుద్ధి గుహుండు వీడు రా
ముని కడకుం జనందగిన ♦ పూజ్యుఁడె యౌ నని యెంచి యంచితా
ప్తిని భరతుం గనుంగొనియు ♦ వేగమ గంగ దరింప నర్హుఁ డం
చని చని యైదునూర్ల బహు♦శోభనపునావల దెచ్చె నచ్చుగన్.

చ॥ అగణిత సేనలెల్లను ర♦యంబున నావలయందు వేగ నె
క్కఁగ దన సేవకావళులఁ ♦ గాంచి యనుజ్ఞ నొసంగి తా నె మె
చ్చుగ నట రాజయోగ్యమగు ♦ సొంపగు నావను దెచ్చె బుద్ధిపా
రగులు కులీనులం దనఁగ♦రా దెటనైన జనింపకుందురే! 98

తే॥ భరత సౌమిత్రులను ముందుఁ ♦ దరణి నెక్కఁ
జేసి శ్రీరామమాతను ♦ గోసలాత్మ
జాత నధిరోహితను జేసి ♦ సంయమిని వ
సిష్ఠు నెక్కించె వేవేగఁ ♦ చిత్త మలర. 99

తే॥ అన్యరాజయోషితల దా ♦ నవలఁ గేక
యాత్మజను నావపై నెక్క ♦ నటులఁ జేసి
యాజ్ఞ నొసఁగెను కోలంబు♦లన్ని నడువ
రాజనావను నడపె దా ♦ నోజమెయిని. 100

తే॥ భవవిభంగను గంగను ♦ భవ్యలీల
నవతరించి భరద్వాజు♦నాశ్రమంబు

కడ మహాసైన్యమును నిల్పి ♦ కడురయంబ
సానుజుండయి భరతుండు ♦ మౌనిఁగాను. 101

మ॥ చని యాసీను జ్వలదగ్నానల సుతే♦జస్స్ఫారు మౌనీంద్రునిం
గని సాష్టాంగనమస్కృతుల్ సలిపె వే♦డ్కన్ భక్తిదీపింప నా
మునినాథుండు గ్రహించి దాశరథి నా♦మోదంబునం బూజలం
దనరం జేసెను పూజ్యులెయ్యెడఁగడున్ ♦ ధన్యుల్ గదా! ధాత్రిలోన్.

క॥ భారద్వాజమునీశ్వరుఁ
డారసి కుశలంబు బ్రీతి ♦ నట మునియోగ్య
స్ఫారమృగాజినవల్కల
చీరజటాన్వితు భరతునిఁ ♦ జెచ్చెరఁ గనియెన్. 103

ఉ॥ రాజపదంబు వీడి ముని♦రాజపదంపు టరణ్యభూమి వి
భ్రాజితలీల వచ్చితివి ♦ రాఁ బనియేమిట నారచీర వా
సాజినధారివౌచు భువ♦నాథ్యుఁడవే జననీసహాయకో
త్తేజుఁడవే మహావిభవ♦దీప్తుఁడవే భరతా! పురంబువీడియున్. 104

శా॥ భారద్వాజవచఃప్రకాండము మనో♦భారంబుగాఁదోఁచి వి
స్తారార్తిన్ మది సాశ్రులోచనుఁడునై ♦ సంభాషణన్ జేసె నో
ధీరా! మీరు సమస్తజీవహృదయో♦ద్దీప్తిన్ భువిన్ సర్వమున్
కారుణ్యామృతదృష్టిఁ గాంతురుగదా ♦ ఘర్షింపఁగా నేలకో. 105

శా॥ కైకేయీకృత ఘోరకార్యమిది దు♦ష్కార్యంబు మీబోటు ల
స్తోకప్రాభవ చిత్తకోటరములం♦దుం గాంచి వాస్తవ్యమున్
లోకఖ్యాతి నెఱుంగుచుండియు గదున్♦లోపైక భూయిష్టమౌ
లోకంబౌ మముబోంట్లనిట్టులని క♦ల్లోలింపఁగా బాడియే? 106

మ॥ వనవాసాదిక రామరాజ్యకలనా♦భంగంబు కైకేయియే
యొనరించెన్ గదు పాపకృత్యమిదియే ♦ నన్నట్టి కాలంబునం
దున గానోపునె నాదుచిత్తమున నా♦దుర్మార్గకార్యంబు రా
మునకుం జేయఁగ నెంతునే విదితమౌ♦పూజ్యుల్ విమర్శించినన్. 107

తే॥ ఐన నీ వేదిపశ్నింతు ♦ వదియె దేవ!
భవదనుగ్రహ మిట నాకుఁ ♦ బరగినట్టుల
నేది యుద్దేశపూర్వక ♦ మిందుఁ జేయఁ
బడియె నదియెఱుంగనుగదో ♦ భవ్యచరిత! 108

తే॥ భరతుఁ డత్యంతతాపసం♦భరితుఁ డగుచు
నాభరద్వాజుఁడు విన న♦త్యంతభక్తిఁ
బలికె నెటులేని యపకీర్తి ♦ పైనిబడిన
వాని సమ్మతింపరు దేవ♦వంద్యులైన. 109

వ॥ అనఘ భవత్పదాబ్జయుగ ♦ మారయ నిందుఁ బ్రమాణమందు నా
కని వచియించి దుఃఖహృద♦యంబున నిట్లనె నన్నుగాంచఁగా
మునివర మీర లర్హులగు ♦ పొందుగ శుద్ధుఁడనో బలీయుదో
పినా మది గుర్తెఱుంగఁదగు ♦ శ్రీహృదయంబులు లోకవిజ్ఞముల్.

మ॥ పనియేమున్నది నాకు రాజ్యములతో ♦ భవ్యాత్ముఁడౌ వాఁడు భూ
మిని బాలించుచునుండ రామునకు స్వా♦మీ! నిత్యదాసుండ గా
వున నేబోయి తదీయపాదవనజం♦బుల్ బట్టి ప్రార్థించి యి
చ్చనుభక్తిం బ్రియమొప్పనిచ్చెదను రా♦జ్యప్రాజ్య సంభారముల్.

చ॥ సదయ వసిష్ఠుఁడాదిముని♦చంద్రులు మీరలు పౌరులెల్లరున్
ముదమున నున్నవార లిటఁ ♦బూని రమాపతి రాముఁ డుర్విభృ
త్పదము గొనంగఁ జేయుదు గ♦దా యభిషేక మయోధ్య కిప్పుడే
సదమలరీతి రాముఁగొని ♦ చయ్యన నేగెద నీచదాసుఁడన్. 112

చ॥ అని వచియించుమాట విని ♦ యామునిచంద్రుఁడు మించు సంతసం
బున సుపరిష్వజం బొసఁగి ♦ మూర్కొని మూర్ధము విస్మయుండునై
ఘనత బ్రశంసజేసె నతి♦గౌరవనీయము ధర్మబాహిరం
బను నెడ నిశ్చయంబు దెలి♦యందగువారలు గల్గుచోటులన్. 113

తే॥ వత్స! మునుముందె దెలియంగఁ ♦ బడియె నిదియు
జ్ఞానదృక్కులచేత రాఁ♦గలుగు విధము

నీవు దుఃఖింపవలదు శ్రీ ♦ నీరజాక్షు
నెడల భక్తి లక్ష్మణునకంటె ♦ నెక్కుడయ్యె. 114

క॥ పరివార యుతమ్ముగ నో
భరతా! యాతిథ్యమీయ ♦ వాంఛించితి నిం
పరయ భుజించియు రేపే
సరసిజదళనేత్రుఁ గాంచఁ ♦ జనఁదగు ననఘా! 115

క॥ అన నీ వాజ్ఞాపన జే
సిన విధముగ నౌనుగాక ♦ చెల్వుగ ననె రా
మునియనుఁగుం దమ్ముఁడు నా
మునినాథుఁడు వేగలేచి ♦ మోద మెలర్పన్. 116

ఉ॥ వారిస్పృశించి హోమగృహ♦వర్తిని కామద గామవర్షిణిన్
వారనిభక్తిఁ గొల్వ మృదు♦పాయస భక్ష్య సదన్న భోజ్యముల్
కోరిక లూర వారి జన♦కోటికి నిచ్చె నలౌకిక క్రియన్
భూరిగ నీధరిత్రి నెటఁ ♦ బొందఁగరాని పదార్థజాలముల్. 117

క॥ భరతుని సైన్యము లెల్లను
బరితృప్తిని జెందు భరత♦వాంఛా విధిగా
సురుచిరగతి వర్షించెను
సురసురభి మనోరథంబు ♦ సొరిది నొసఁగదే. 118

క॥ మునిరాజు భరద్వాజుఁడు
ఘనతరమగు శాస్త్ర దృష్ట♦ కర్మలను వసి
ష్ఠుని బూజించియు నట భర
తుని సైన్యసహితుని దృప్తిఁ ♦ దోఁపఁగఁ జేసెన్. 119

తే॥ స్వర్గ సన్నిభాశ్రమమందు ♦ భరతుఁ డొక్క
దివసము వసించి యుదయాన ♦ దివిరి మ్రొక్కి
యా భరద్వాజునకును స♦హానుజుఁడయి
రాముకడకుఁ గృతానుజ్ఞ ♦ ప్రేమమీర, 120

—♦ భరతుఁడు చిత్రకూటముఁ జేరఁబోవుట ♦—

చ॥ చనిచని రత్నసానువిల♦సన్నవ నందన చందనాగ శో
భన వర పుష్పపల్లవ వి ♦ భాసుర దివ్యలతాపరీతమై
మునిజన వాసయోగ్యమయి ♦ పుణ్యనదీతట గంధవాహ పా
వనతమమైన వాటమును ♦ వచ్చిరి చేరఁగ జిత్రకూటముౕ. 121

తే॥ చిత్రకూటంబునందున ♦ సేనలెల్ల
నిలువ దూరంబుగా నాజ్ఞ ♦ నియతి నొసఁగి
రామ సందర్శనాకాంక్ష ♦ రయమ నాగాను
స్వయమె చనసెంచె నష్టమి ♦ భరతవిభుఁడు. 122

మ॥ అల శత్రుఘ్నుఁడు వెంటరాఁగ గుహునితో ♦ నా మంత్రితో పావకో
జ్వల తేజస్వి తపస్విమండలముతో ♦ సవ్యాపసవ్యాశలుం
జెలఁగౕబోవుచు వేపరంతపుఁడు నా ♦ చిత్రాఖ్యకూటంబునం
దుల నన్వేషణ మాచరించె నచటం ♦ దోయేజపత్రేక్షణుౕ. 123

ఉ॥ కానక రాము నాశ్రమము ♦ కానలనుండియు వెన్కకేగఁగా
నూనియు మౌనివర్గముల ♦నోర్మినిగాంచి వచించె నిట్టులో
మౌనివతంసులార యిట ♦ మాన్యుఁడు రాముఁడు సీతతోడుతౕ
సానుజుఁడై వసించునెట ♦ నాభువిఁజూపి యనుగ్రహింపరే. 124

తే॥ అనిన ముందున్న పర్వత♦మునకు నవల
జాహ్నవికి నుత్తరాశను ♦ సరిగ గంగ
దరిని యేకాంతదేశంబు ♦ దనరియుండు
నమలమునిజనవాసయో♦గ్యము వనంబు. 125

సీ॥ పనస తిందుక బిల్వ ♦ పారిజాత కపిత్థ
ఫలజాల సురసాల ♦ భాసురంబు
పున్నాగ చంపక ♦ భూర్జర కదళికా
జంబు జంబీర వి♦స్ఫారితంబు

కోవిదార రసాల ♦ కువలయ ఖర్జూర
మాకంద సంతాన ♦ మండితంబు
వకుళ సారస కృష్ణ ♦ వర రామ ధరణిజా
లక్ష్మణ సముదాయ♦లక్షితంబు
తే॥ చంద్రమాలతీకాంత వా♦సంత శక్ర
వరుణ కర్బుర శాంత నే♦పాళ మత్స్య
విజయ పటపాండురానీక ♦ విశ్రుత వని
సంచరింతురు వార లా♦శ్రమములందు. 126
క॥ వరమునిదర్శితుఁడై యట
భరతుఁడు సంతోషమంది ♦ పయనంబయ్యెఁ
సరసిజదళనేత్రుని గన
బరిశుద్ధుల హృదయదీక్ష ♦ పరగకయున్నే! 127

— ♦ భరతుఁడు రాముఁగాంచుట ♦ —

సీ॥ కౌండిన్య కౌశిక ♦ శాండిల్య గాలవ
పిప్పలాది మునీశ ♦ విలసితంబు
ఐరావతేంద్రాణి ♦ నారాయణ శివాది
కమఠ వామన దేవ ♦ కాంతిదంబు
బలమహోమంజుల ♦ వరకాంతగోపికా
వల్లవశ్యామవి♦భ్రాజితంబు
వరతరుసంలగ్న ♦ పరిధానవల్కల
రాజి సంధ్యారాగ ♦ రంజితంబు
తే॥ ఐన రఘురాము నాశ్రమం♦బంతఁగాంచి
దూరమున నుండి తనదు సై♦దోడు వెంట
నడువ భరతుండు చనుదేరి ♦ నడచి వేగ
రాము గుణధాము రామాభి♦రాముఁ గనియె. 128

మ॥ వరవజ్రాంకుశ పారిజాత సుధనుః ష్పాదాబ్జరేఖాకళా
పరిసందీపిత మంగళాయితమునై । భవ్యంబునై మాని రా
డ్భరితానంద సదాశ్రయంబుగని సం। భావించెఁ దా నాత్మలోఁ
చరితార్థోస్మి యటంచు రామచరణా। స్థానంబులంగొల్చుచున్.
మ॥ అరవిందాసనుఁ డాది దేవత లనం। తానందసంధాయక
స్ఫురితామోదతఁ బ్రత్యహంబు మదిలోఁ। సొంపొప్పఁగాంక్షించు నా
చరణాంభోజరజఃకణావృత ధరా। చక్రంబు దృగ్గాల భా
సుర పుణ్యంబున గంటి కంటి నికఁ। శ్రీ శుక సోమసూర్యేక్షణున్.

—। రామ సందర్శనము ।—

మ॥ కలితానంద సుహర్షబిందువులు వక్షంబందు జీరాడ ని
శ్చల చిత్తంబున మెల్ల మెల్లన రమా। సౌదామినీవిభ్రమో
జ్జ్వల నీలాభ్ర శరీరభాసితు జటా। బద్ధోత్తమాంగాంగదున్
విలసద్వల్కలధారు రాము గనియెన్। విశ్వాత్ము నాసీనునిన్.
సీ॥ తరుణారుణద్యుతుల్ । దళిత దూర్వాంకుర
శ్యామదేహమునందు । నావరింప
దరహాసచంద్రికా । దంతపంక్తుల కాంతి
పల్లవాధరముపై । పర్విలు గప్ప
కరకంజరాగంబు । వరపీత పరిధాన
పాండురచ్ఛాయ దిక్ప్రమలనీన
విలస దపాంగముల్ । పృథివీతనూజపై
యంగరాగంబుగా । నావరింప
సౌమిత్రికరలగ్న । చరణాబ్జయుగళంబు
వివిధకాంతులు దిశల్ । విస్తరిల్ల
తే॥ స్థిరతరాసీనుఁడౌ రాముఁ। జేరి కాంచ
నమిత దుఃఖంబు తనుదానె । యావరింపఁ
గంటి రాముని నను హర్ష। మంటితోఁ బ్ర
ణామపాదాబ్జములఁ బట్టె। రతుఁ డమె యతేఁడు. 132

చ॥ భరతుని లేవనెత్తి రఘు♦వర్యుఁడు వేగమె దోర్యుగంబులన్
నిరతపరిష్వఁజంబొసఁగి ♦ నిర్మలనేత్రజలాభిషేచనం
బురుగతిఁ జేసి యంకమున ♦ నుంచి మరిన్ మరి కౌఁగిలించుచున్
గర మనురక్తిఁ జూపె ఘన♦కాయుఁడు సోదరుపైని రాముఁడున్.
తే॥ రామసందర్శనాపేక్ష ♦ రాజిలంగఁ
దల్లు లంపజు జనిరి స♦త్వరలు నగుచు
గోపితానము తృష్ణార్తిఁ ♦ గూడి వేగ
జలము ద్రావంగఁ జన్నట్టి ♦ సరణి దరుణి! 134
క॥ తన తల్లి కౌసలాత్మజుఁ
గని వేగమ లేచి పాద♦కంజంబులపై
దనశిర ముంచియు మ్రొక్కఁగఁ
దనపుత్రుని కౌఁగిలించెఁ ♦ దగిదుఃఖమునన్. 135
క॥ తదితరమాతృవితతికిన్
ముదమున నభివాద మిచ్చి ♦ పూజ్యులతోడన్
సదయత వచ్చిన సుజ్ఞా
నదు మునిపుంగవుఁ గనియు జ♦నస్థితిరంగున్. 136
క॥ గురునకు సాష్టాంగముగా
గర మొప్ప నమస్కరించి ♦ కడుధన్యుఁడ నం
చురు హర్షంబున బలికెను
సరసిజనయనుండు రామ♦చంద్రుం డంతన్. 137
క॥ వారి యథాయోగ్యముగా
గౌరవ్యసుఖాసనులను♦గా నొనరించెన్
వారిజగర్భుఁడు గనియున్
వారలతో నిట్టు లనియెః ♦ బర్వతతనయా! 138
క॥ మునివర! కుశలమెకా? మా
జనకుఁడు కడు దుఃఖవహ్ని ♦ సంతప్తుఁడుగా

ఘనులరు తమత్రో నా కే
మని సెలవిచ్చిరో వచింపుఁ ♦ డనఘచరిత్రా! 139

చ॥ తనయ వియోగవహ్ని పరి♦తప్త హృదబ్జుఁడు నై కృశించి నీ
జనకుఁడు రామరామ యని ♦ సచ్చరితాగ్రచరిష్ణుఁ డైన నిన్
మనమున నెంచుకొంచు జన♦మాన్య సుమిత్రజు నెంచి భూ
తనయఁ దలంచి మాటికిని ♦ దా మృతి బొందె నిఁకేమి చెప్పుదున్.

—♦ రామాదివిలాపము ♦—

చ॥ చెవులకు శూలరోగ మనఁ♦జెల్లు వశిష్ఠుని వాక్యజాలముల్
తవిలిన తత్క్షణంబె తన♦తమ్మునితోడుత నేడ్వసాగె హా
భువనపతీ! హతోస్మి రఘు♦పుంగవ భూషణ విస్మయోస్మియం
చవిదిత పితృమృత్యువిష♦యాగత దుఃఖనిమగ్నుఁ డయ్యెడిన్
సీ॥ హా తండ్రి! హాహా ద♦యానిధీ! భూనాథ
యాజానుబాహూ! బు♦ధానుకూల!
యే ననాథుఁడ నైతి ♦ నెట కేగినాడవు
ననువీడి ఘోరకా♦ననములందు
నిక మీఁద నన్నెవ్వ ♦ రిట లాలనముఁ జేయు
వార లున్నార లో♦భానుదీప
యని విలపించెఁ దా♦నాత్మ పితృనికయ్యు
సీతా సుమిత్రాత్మ♦జాతలంత
తే॥ కన్న దుఃఖింపసాగిరి ♦ మిన్నుముట్టఁ
దల్లు లురముల మోదు కొం♦చల్లనల్ల
భోరుభో రంచు నేడ్చిరి ♦ వారిజాక్షి
గడవ తరమానె తనవారి ♦ కాలగతము. 142

క॥ గురువరుఁడు రామచంద్రుని
గరమొప్పఁగ దుఃఖశాంతిఁ♦గలుగన్ జేసెన్

స్ఫురితాస్త్రగతుల గురుఁడం
చరయంగ నతండెకాక ♦ యొందురె యితరుల్! 143

తే॥ సాంపరాయిక కృత్యంబు ♦ జక్క జేయ
నావసిష్ఠుండు రాఘవు ♦ నతిరయంబ
గొనియు మందాకినింజేరె ♦ మునిఁగినారి
వారు వీతకల్మషులైరి ♦ వరుసనంత. 144

—* దశరథునకు రాముఁ డుత్తరక్రియలొనర్చుట. *—

క॥ జలకాంక్షియైన భూపతి
కల వారలు జలము నిచ్చి ♦ రతిభక్తిమెయిన్
లలితజలావాపనఁ బిత
రులు దరియింపఁగ దనూజులుగదా ధరణిన్. 145

తే॥ ఇంగుదీఫల పిణ్యాక♦వృత్తరచిత
ములును మధుసంప్లుతంబులు ♦ పొందుగాను
పిండముల నిచ్చెఁ బితృసం♦ప్రీతిమెయిని
సరసిజాక్షుండు లక్ష్మణ♦సహితుఁ డగుచు. 146

తే॥ మనము భుజియించునట్టి యో♦దనమె భక్తి
పితల కివ్వంగవలెనంచు ♦ శ్రుతులు దెలుపు
చున్న వని యుశ్రీనయనుఁడై ♦ యోర్మి నతఁడు
స్నానమొనరించి చనియె నా♦శ్రమముఁజేర. 147

తే॥ బంధువర్గంబులందఱుఁ ♦ బట్టరాని
దుఃఖమున వేగ జలములం♦దున మునింగి
యతనివెంటనె జనిరి క♦ష్టాఘమెంత
వారికెందైనఁ దప్పింప ♦ వశముగాదు. 148

తే॥ ఆదినంబున నుపవాస ♦ మభ్యసించి
గడపి రచ్చట వారలు ♦ కమలహితుఁడు

నాత్మబాంధవాశుచి వాప ♦ నపరవార్ధి
కరిగె నన నేగె వేవేగ ♦ నంత వారు. 149

తే॥ నాటి దుందుభి వైశాఖ♦శుద్ధ దశమి
విమల గంగను స్నానంబు ♦ వెలయఁ జేసి
యట సుఖాసీనుఁడై నట్టి ♦ యనఘు రాముఁ
జెంత భరతుండు భాషించెఁ ♦ జేరి మ్రొక్కి. 150

—* భరతప్రార్థన *—

తే॥ రామ రామ మహాభాగ ♦ రాజచంద్ర
యిపుడె స్వాత్మాభిషేచనం♦బింపుమీఱ
జేసికొనుమయ్య నామాట ♦ జిత్తగించి
యంచితాప్తిని సాకేత ♦ మనుభవించు. 151

మ॥ ధరణిన్ బాలనఁ జేయఁగాఁదగు నయో♦ధ్యం జేరి నీపిత్ర్యమా
నరయన్ నాకును బెద్దవాఁడ విట మ♦మ్మా తండ్రి మర్యాదగన్
గరిమన్ గాంచదగున్ సదా రవికుల♦త్స్మానాథ సత్కీర్తియో
త్కర ధర్మంబు ప్రజాధిపాలనమగుం♦గాదే రమానాయకా!

మ॥ నవనానేక సహస్రముల్ సలిపి రా♦జ్యంబేలి పుత్రోత్సవై
క వినోదంబును గన్నులారఁ గని లో♦కఖ్యాతి నీపుత్రు నీ
భువి బట్టంబునుగట్టి ధర్మముల సం♦బోధించి యాపైని మా
నవ ధర్మంబగు నేగఁగా వనికి వా♦నప్రస్థవేషంబునన్. 153

క॥ వనవాస యోగ్యకాలము
వనజోదర ! యిపుడుకాదు ♦ భావింపఁగ మా
జననీ కృతాపరాధము
మనమున దలఁపంగరాదు ♦ మన్నింపు మమున్. 154

క॥ అని పలికి భక్తి మీఱఁగ
ననుజన్మూఁడు రామపాద ♦ మంటియు నభివా

దన మొఁగరించి సాగిలఁబడఁ
దన పాదాగ్రమున భరతుఁ ♦ దద్దయు గనియెన్. 155

క॥ రాముఁడు భరతుని వేగమె
ప్రేమను లేవంగనెత్తి ♦ స్వీయాంకమునం
దామోదత నుంచి ధరా
రాముఁడు సస్నేహనయన ♦ రాజీవుండై. 156

తే॥ వత్స భవదుక్తియుక్తంబె ♦ భద్రమగును
వినుము నామాట నొక్కింత ♦ వీను లలర
పూజ్యచరితుండు జనకుండు ♦ మోదమొప్ప
నిడినయాజ్ఞను పుత్రుండు♦ నడుపవలదె? 157

తే॥ ఐన జనకుండు నాతోడ ♦ ననియె నిటుల
నైదుతోమ్మిది వర్షంబు ♦ లాత్మ నలర
దండకారణ్యభూములఁ ♦ దగవసించి
యవల బురమును జేరుమా ♦ యనియె నన్ను. 158

క॥ ఈ రాజ్యమెల్ల భరతున
కారయ నే నిచ్చినాడ ♦ నని భాషించెన్
ధారుణి నాథుఁడు భరతా
ధీరగుణరతా! ప్రశాంత ♦ తేజోఽభిరతా! 159

మ॥ అవనిన్ సర్వము నీకుగా నిడుట సు♦వ్యక్తం బగుం దాన న
ల్లి విశాలంపు టరణ్యరాజ్యమిడె ♦ దా నింపొప్ప ప్రేమించి యో
యవనీనాయక! పితృవాక్యపరి పా♦లాపేక్ష నీయిర్వురిన్
దనిలెంగాఫున యత్నకార్య మిది చి♦త్తంబందు నూహింపుమా. 160

తే॥ జనకు వచనముల్లంఘించి ♦ చనునెవండు
ధరస్వతంత్రత నాతండు ♦ విరివిఁగాంచ
బ్రతికియుండిన జీవచ్ఛ♦వంబు చచ్చి
నిరయమును జెందు వినవయ్య ♦ భరత నీవు. 161

తే॥ కాన నీవు రాజ్యము నేలు ♦ ఘనతమీర
దండకారణ్య రాజ్యంబు ♦ ధర్మబుద్ధి
నియతిఁ బాలించువారమై ♦ నెగడఁగలమ
టన్న భరతుండు భాషించె ♦ నధికభక్తి. 162

ఉ॥ వనితలఁ జిక్కి మూఢుడయి ♦ భ్రాంతుఁడు నున్మదుఁడై ధరిత్రినిం
గన నతికాముకుండయి వి♦కారము కన్నులఁగప్పి చెప్పినం
తనె జనకాజ్ఞ యంచుఁ జన♦ధర్మమె పండితులట్టి భ్రాంతచి
త్తు నిల నిరాకరించి వెలిఁద్రోయరె ద్రోసమె త్రోసిపుచ్చినన్? 163

తే॥ అమ్మృదూక్తుల విని రాముఁ ♦ డనుజుతోడ
బలికె నిట్టుల నిగ్రహా♦వ్యక్తరీతి
ధర్మవిషయైకకార్య వి♦స్తారరతులుఁ
బాహ్యసుఖముల గలనైన ♦ వాంఛపడరు.

ఉ॥ కామియుగాడు స్త్రీజితుఁడుగా డతిమూఢుఁడుగాడు భ్రాంతితో
ప్రేమను జెప్పలేదు మును ♦ పెగ్గెయు గేకయరాజపుత్రితో
నీమముతోడఁ జేసి యది ♦ నీల్గు నటన్న భయంబుబుట్టియు
ద్దామత నాజ్ఞ నిచ్చె విది♦తంబుగ భూపతి సత్యవాదియున్. 165

చ॥ కనఁ గన సత్యభీతి యధి♦కంబుగదా మహనీయరాజి కెం
దుల నరకంబు కన్న నిది♦తోన నొనర్చెద నంచు నామెతో
నొనరిచె యే ప్రతిజ్ఞ యిపు ♦ డొప్పనె నే రఘువంశమందునన్
జననమునంది సత్యము న♦సత్యము సేయఁగఁ జాలు దెట్టులన్. 166

క॥ అనిమెదు రాముని వాక్యము
విని భరతుఁడు పల్కెనిట్లు ♦ వినవే గిరిజా
వనజాయతదళనయనా
కనవే రఘురామమూర్తి ♦ ఘనతర శక్తిన్. 167

చ॥ తమవలె నారచీరలను ♦ దాల్చి చతుర్దశ వర్షముల్ వనిన్
విమలమతిన్ వసింతుఁ గడు♦వేడుక నీవు యథాసుఖ ప్రమో

దమునను రాజ్య మేలఁదగు ♦ ధర్మమునిమ్మహి నిల్పఁగాఁదగున్
గమలదళాయతాక్ష! ఘన♦కాయ విభాస విలాస సువ్రతా! 168

తే॥ జనకుచే నివ్వఁ బడియె నీ ♦ సకలరాజ్య
తలమునీకు నాకు వనము ♦ దగ నొసంగె
దాని వ్యత్యయం బొనరింపఁ ♦ దలఁపఁ బూర్వ
విధ మసత్యంబు స్థిరముగా ♦ వెలయుఁ గాదె. 169

తే॥ అనఁగ సౌమిత్రివలె నేను ♦ వనులఁ దమకి
సేవఁ జేయుచు వాసంబుఁ ♦ జేయఁ దలఁతు
నటులఁ గాదేని వినుఁడు దే♦హంబు విడుతు
నిపుడె ప్రాయోపవేశంబు ♦ నెనసి యనియు. 170

తే॥ నిశ్చయించియు దర్భల ♦ నియతిఁ దెచ్చి
పఱచి పూర్వాభిముఖముగా ♦ భరతుఁ డచట
జిత్త నిశ్చలవృత్తి నా♦సీనుఁ డయ్యె
ననుజుపై భక్తి యేమి జే♦యంగఁ జనదు. 171

—*భరతున కా రహస్యమును దెలుపుమని రాముఁడు గురునకు సంజ్ఞ జేయుట, వసిష్ఠు దేవగుహ్యమును దెలుపుట.*—

ఆ॥ నియతుఁ డైన భరతు♦నిర్బంధమును గాంచి
పొందు మీఱఁగ రఘు♦నందనుండు
విస్మయంబు నంది ♦ వేగంబ నేత్రాంత
సంజ్ఞఁ జేసె గురుని ♦ సరవినరసి. 172

తే॥ భరతు నేకాంతముగ బిల్చి ♦ సరసగతిని
జ్ఞానవంతుల నుత్తముఁ ♦ డైన యా వ
సిష్ఠుఁ డా రహస్యము నెల్లఁ ♦ జెప్పఁబూని
వత్స! గుహ్యంబు వినుమంచుఁ ♦ బలికె నిట్లు. 173

క॥ నామాట నిశ్చయంబగు
నామోదత నీ రహస్య ♦ మాకర్ణింపన్
రాముఁడు నారాయణుఁడని
నీ మదిఁ దెలియంగవలయు ♦ నిర్మల బుద్ధిన్. 174

క॥ తొలి నలువ వేడ రావణుఁ
బొలియింపఁగ దశరథాత్మ ♦ పుత్రుఁడనంగన్
లలి జనియించె ధరిత్రిని
గలభారము నాపఁగా విను మన్నా! 175

తే॥ యోగమాయయు సీతయై ♦ యుద్భవిల్లె
జనకనందిని యనఁగ ల ♦ క్ష్మణుఁ డనంగ
నాదిశేషుండు శ్రీరాము ♦ ననుసరించి
సంచరించుచునుండు వి ♦ స్తారగతుల. 176

క॥ రాముఁడు సీతాసతియును
సౌమిత్రియు రావణాఖ్యుఁ ♦ జంపఁగ నీ యా
రామవిహార మొనర్పఁగ
నేమంబున వచ్చిరిపుడు ♦ నిశ్చయమిదియే. 177

మ॥ వరదానాదికనిష్ఠురోక్తులిట సం ♦ భావింపఁ గైకేయి యే
కరణిన్ విఘ్నమొనర్చె దైవకృత మీ ♦ కార్యంబు గాకున్న నా
తరుణీరత్నమి టేల విఘ్నవచన ♦ త్రస్తాత్ముఁ గావించు భూ
వరు నిందం బడనెంతురే పతుల ని ♦ ర్బంధించి సాధ్వీమణుల్. 178

తే॥ వదలు మాగ్రహంబును నీవు ♦ భరత రామ
నాథువనవాస వినివర్త ♦ నంబొనర్చు
నట్టి పట్టును మానుము ♦ వ్యవధిలేక
మరలు పురిఁజేర సుఖముగా ♦ మహితరీతి. 179

ఉ॥ నీమహనీయసేనలును ♦ నీజననీమణికాండమిప్పుడే
నేమముతోడ నీపురికిఁ ♦ జెచ్చెర నీవును నేగఁగాదగున్

రాముఁడు బంధువర్గపరి◆రాజితు రావణు 'జంపి వే యయో
ధ్యామహిఁ జేర రాఁగలఁ డ◆తంద్రితవృత్తి సతీయుతంబుగన్. 180

చ॥ అన విని తద్గుహోక్తులకు ◆ నాతఁడు విస్మయమంది భక్తితో
గొనకొని రామచంద్రుకడ◆కుం జని వేగమ విస్మయాత్ముఁడై
యనియె భవత్పదాబ్జముల◆నంటి పవిత్రములైన పాదుకల్
ఘనతరరాజ్యమేల నిడఁ◆గావలె నీవట వచ్చునంతకున్. 181

క॥ అని మణిపాదుకలను రా
మునిచరణాబ్జంబులంటి ◆ పొందించెను భ
క్తిని గని రాముఁడు భరతా
ఖ్యున కిచ్చెను పాదుకలను ◆ గొమరొప్పంగన్. 182

చ॥ భరతుఁడు రత్నభూషితపుఁ ◆ బావలజేతులనుంచి యంచిత
స్థిరతరభక్తి రామునకుఁ ◆ జేరి ప్రదక్షిణవందనంబులన్
సురుచిరలీలఁ జేసె శ్రుతి ◆ సూక్త విధానత మాటిమాటికిన్
వరగురుభక్తియుక్తులగు ◆ వారలకున్ సహజంబు లివ్వియున్. 183

చ॥ మరల వచించె నాతఁడు ర◆మాపతి గాంచియు నీరెలుంగునన్
ధర పదునాల్గువర్షములు ◆ దాటిన నెల్లి పురంబు జేరఁగా
నరసియు రాకపోయినను ◆ నగ్నినిజొచ్చుట వాస్తవంబు శ్రీ
ధరయన వల్లెయంచు వసు◆ధాపతి రాముఁడుబంపె నాతనిన్. 184

చ॥ భరతసుధీవరుండు పరి◆వారముతోడ వసిష్ఠుతోడ సో
దర! జననీయుతంబుగను ◆ దత్సచివాళియుఁగూడ వేగమే
యరుగుచునుండు నంతటనె ◆ యాతనితల్లియు కైక యొంటిగా
వరదుని చెంతకుం జనియుఁ ◆ బల్కెను కన్నులనీరు నించుచున్. 185

—* కైక రామునితో భాషించుట *—

సీ॥ ప్రాంజలి బద్ధయై◆రామచంద్రునితోడ
భాషించె నీరీతిఁ ◆ బ్రస్తుతించి

మాయావిమోహిత • మానసంబున నేను
దుష్టబుద్ధినిబూని • తోయజాక్ష
శ్రీకరరాజ్యాభి•షేకభంగముఁ జేసి
కొలపాపమొడిగట్టి • కొంటినయ్య
నళినగర్భ ! క్షమింపు • నా దుస్స్వభావంబు
క్షమసారులరు గదా • సాధుజనులు
తే॥ నీవె పరమాత్ముఁడవు రామ•నిర్మలాంగ
విష్ణుఁడవు నీవె యవ్యక్త • విషయి వీవె
మాయచే మానుషాకృతి • మైకొనియును
నఖిలజగములు మోహించు•నటులనుంటె. 186
తే॥ మంచి యైనను చెడుగైన•నెంచి చూడ
నీవె ప్రేరేప లోకంబు • నియతిఁ జేయు
నీ యధీనము విశ్వంబు • నిన్ను విడచి
చేయ నోపెడి వచియించు • శ్రీనివాస. 187
సీ॥ కృతిరిమలగు నర్త•కీ జనంబులు మెండు
గుహ కేచ్ఛ నాట్యంబు • గోరి చేయు
వడుపున నీ ధాత్రి • బహురూపములఁ జెంది
త్వదధీన యగుచుండి • ముదము మీర
చెలఁగు మాయానాట్య•లలితాంగి నృత్యంబు
గావించుచున్నది • కమలనాభ
దేవకార్య మొనర్ప • భావించి ప్రేరేప
నీవె నన్నిట బాప•భావితాత్మ
తే॥ నగుచు నతిపాపకార్యంబు • నాచరించి
యుంటినో యరిందమ! నేనె • కంటి నిన్ను
దెలిసికొంటిని దేవతా•వళి కగోచ
రుఁ డని మాం పాహి విశ్వేశ! • లోకవినుత. 188

క॥ వరద జగన్నాథ కృపా
కర సుర వినుతా! యనంత • కమలాక్ష రమా
వరకుచకుంకుమపంకా
కరవక్ష మునీశ రక్ష•కా! వందనముల్ • 189

తే॥ పుత్ర విత్తాది గోచర ♦ పూజ్యమైన
స్నేహమయపాశమును దెగ్రింపు ♦ నిర్మలమగు
జ్ఞానఖడ్గంబు చేఁ బూని ♦ కమలనాభ
నిన్ను శరణంబు బొందితి ♦ నియతబుద్ధి. 190

చ॥ దరహసితాననుండగుచు ♦ దద్దయుఁ గైకవచించు వాక్యము
ధురగతిఁ గాంచి పల్కె నిటుఁ ♦ దోపఁగఁ జేసినదేనె సత్య మీ
వరసితి వమ్మ పేర్చితిని ♦ యంబరవాణి త్వదీయ వక్త్రగ
ద్వారమున నుద్భవిల్లుగతి ♦ భాసురదైవహితార్థసిద్ధికిన్. 191

క॥ నీవలనదోష మించ్చుట
నేవిధి జనియించునమ్మ ♦ హృదయప్రీతిన్
భావించు మహార్నిశమున్
దేవీవరభాగ్యశాలి•నీ కైకేయీ! 192

మ॥ విగతస్నేహవిధిన్ మదీయ మగు సం•విద్భక్తి నిత్యంబునై
తగ నీ చిత్తమునందు నెందు నచిరో•ద్యన్మోక్షసంప్రాప్తి నీ
కగు నే నన్నను శత్రు మిత్ర సమతన్•వ్యాపించి యీదృక్ప్రపం
చగతిన్ నన్ను భజించువారలకు మో•క్షం బివ్వ సంసిద్ధుఁడన్.

సీ॥ భ్రాంతి రాగద్వేష • వర్తులౌ జనుల నే
ననుసరించి చరించి ♦ యవని మిథ్య
నిశ్చయం బని కాంచి • నెమ్మివారలరీతి
నన్యోన్య విధంబుల ♦ నభినయింతుఁ
గాని వాస్తవబుద్ధి • గాదేని యందును
ద్వేషప్రియంబులు • వెలయబోవ

దైంద్రజాలికుభ్రాంతి • ననిశంబు సర్వత్ర
సమదృష్టి నుండు నిశ్చయము మెఱింగి
తే॥ తల్లి! నామాయచే మోహ • ములమందుఁ
దగిలి మనుజాకృతినిఁగాంచఁ • దలఁచి నన్ను
జనులు నతిసుఖ దుఃఖాది • సంగతునిగ
నెఱింగి యుందురు తత్త్వంబు • నెఱుఁగ రెవరు. 194
మ॥ భవనిర్వాపక మస్మదీయమగు దివ్యజ్ఞానభాగ్యంబు సం
భవమయ్యెన్ జననీపురాకృత తపోభవ్య ప్రభావంబుచే
భవనంబందున సంస్మరింపుచు నిటే • వర్తిల్లు కర్మంబులన్
దవులంజాలవు నిన్ను నెప్పటికి సత్తామాత్రసంసిద్ధియా. 195
తే॥ అటుల బోధింప శ్రీరాముఁ • డామె యపుడు
విమలసానందహృదయయై • విస్మయముగ
సప్రదక్షిణశత నమ • స్కారములను
నేలఁబడిచేసి ముదమొప్ప • లీలఁ జనియె. 196
తే॥ అంత వైశాఖసితపక్ష • మందు దశమి
భరత భూమీశుఁ డచ్చోటు • వాసి రాము
నాజ్ఞగొని యయోధ్యను జేర • నరిగె తనదు
విపులపరివారయుక్తుఁడై • వేగవేగ. 197

—* భరతుఁ డయోధ్యకు నేగుట. *—

మ॥ తనవెంటన్ గురుఁడున్ సహోదరుఁడమాత్య శ్రేణియా వెన్కఁ త
జ్జననీకాండము భృత్యవర్గము లటన్ • సైన్యావళిస్యందనా
శ్వనికాయంబు గజాళి కాల్బలములున్ • సాకేతవాస్తవ్య స
జ్జనులున్ జానపదుల్ చనం జనె నయోధ్యం జేర శాంతక్రియన్. 198
ఉ॥ అందఱయోధ్యఁజేర భరతాఖ్యుఁ డుదారుఁడు డించి వారలన్
నందిపురంబునుం జనియె • నందితచిత్తుఁడు రామపాదసం

క్రందిత దివ్యపాదుకయుగంబు మణిస్ఫురితప్రపీఠమం
దుం దగనుంచి కొల్చె భరతుండు నితాంత సుభక్తియుక్తుఁడై. 199

సీ॥ సింహాసనంబున శ్రీపాదుకద్వయి
నుంచి నిత్యము పూజలంచితముగ
శ్రీరామమూర్తిఁ బూజించునట్టి విధంబు
గంధపుష్పాక్షత కరణములను
సద్భక్తి రాజోపచారముల్ గావించు
నియతవ్రతంబున నిత్యమతఁడు
ఫలమూలకందాది భక్షణ మొనరించు
నారచీరలు గట్టి నయముమీర
జడలను ధరియించి శత్రుఘ్నసహితుఁడై
యింద్రియనిగ్రహం బెనయుచుండ

తే॥ బ్రహ్మచర్యవ్రతంబున వసుధపైని
బవ్వళించుచు దద్రాజభక్తి నెగడ
నవని గల రాజకార్యంబు లమలపాదు
కలకె లెస్స నివేదించు లలితగతుల. 240

తే॥ పూని దినములు గణియించు మానసమున
మహిత రామాగమనకాంక్ష నహరహంబు
రామపాదార్పితహృదబ్జ ధాముఁడగుచు
నతఁడు నిర్మల బ్రహ్మర్షి యయ్యె సూవె. 201

—* శ్రీరాముఁ డత్రిసంయమాశ్రమంబుఁ జేరుట *—

చ॥ మునిపరివేష్టితుండగుచు పొల్పుగ రాముఁడు చిత్రకూటమం
దున ధరణీజతో ననుజుతో నటనుండి చతుర్దశీదినం
బున బయనంబుగట్టె పురపూజ్యులు రాముని గాంచు నిచ్చతో
ననిశము వచ్చుచుండిరట నాతఁడు నుండుటంచు నెంచియున్.

మ॥ తన కర్తవ్యము జిత్తకోటరమునం దర్కించుచున్ దండకా
వన సంచార మొనర్పనెంచి భువిజా భద్రాంగి సైదోడు రా
జనసంబాధ వివర్జితామలసుఖస్థానంబు నాయత్రి మౌ
ని నివాసాశ్రమభూమిఁ జేరఁ జనియెన్ నీరేజపత్రాక్షుఁడున్.

చ॥ చనియుఁ దపోవనంబునను సంయమివర్యుని భాసమాను నా
మునిని సుఖాసనాన్వితుని పూజ్యుని యోగిజనాధినాథునిం
గనియు నతండు సాంగకముగాఁగ నమస్కృతు లాచరించి యో
మునివర! యేను రాముఁడను మ్రొక్కెదనంచు వచించె నించుకన్.

మ॥ జనకానుజ్ఞఁ బురస్కరించుకొని నా స్వాంతంబునన్ దండకా
వనవాసంబన నొప్పునట్టి మిషయొ ప్పన్ నాపూర్వపుణ్యంబుచే
నిను గన్నాఁడను నేను ధన్యుఁడగదా నీపాద కంజాత సే
వ నలభ్యంబగు నెట్టివారలకు దే వా! యత్రిమౌనీశ్వరా! 205

క॥ విని రామేరిత వాక్యము
ముని చంద్రుఁడు రామచంద్రుఁ బురుషోత్తముగా
మనమున దెలిసి పరాత్పరుఁ
డని పూజించెను సభయు నయామలభక్తిన్. 206

క॥ వనఫల కృతాతిథిసుపూ
జన మిచ్చి ధరిత్రిజాత సౌమిత్రులతో
డను సదుపవిష్టు రాముని
గని మునిసంతుష్టుఁడగుచు గడువడిఁ బలికెన్. 207

ఆ॥ ఆశ్రమంబునందు నతివయో వృద్ధయై
తప మొనర్చుచుండె ధర్మకుశల
నాదు ధర్మపత్ని నయధర్మవత్సల
సుప్రసిద్ధయె యనసూయయనఁగ. 208

క॥ అనసూయను సీతాసతి
గని రావలెనన్న మౌని కమలాక్షుఁడు భూ

తనయను గాంచియు నిట్లనె
జనితానందైకహృదయ • సందీపితుఁడై. 209

క॥ చని దేవి జానకీ సతి !
యనసూయను గాంచి మ్రొక్కి • యతివేగముగా
జనుమా యనె సాధ్వీమణు
లన సామాన్యలె సురేంద్రు • లైన భజించున్. 210

క॥ విని రామవచన మాయమ
చనె సతి మునీశ్వరాశ్రమ • మంతర్భాగం
బునకు సపాంసురుద్య
ద్ఘన కీర్తిపరులు ధరిత్రి • గౌరవ్యలుగా. 211

సీ॥ పలిత దేహమునందు • వరతపఃఖద్యోత
ములు మిన్కు మిన్కని • వెలుగుచుండఁ
దలతలలాడుసుం • దరవదనంబున
సుధజిల్కు చిరునవ్వు • సొంపునింప
ఘనవాత కంపిత • కదళీవిధంబున
వేపమానాంగియై • వెలయుచుండ
మూడుమూర్తులశక్తి • పుంజంబు నొక్కటై
మూర్తిభవించిన • పుణ్యచరిత

తే॥ జలజముఖులకుఁ బతిభక్తి • సరసగతులఁ
దెలుప నిర్మించెనలువయం • చలర ధరణి
సతియమిపుంగవాశ్రమ • మందు నిందు
వదన ననసూయఁ గాంచె భూ • సుదతిపుత్రి. 212

తే॥ కాంచి సాష్టాంగవందనం • బంచితముగఁ
జేయ యనసూయ సీత నీ • క్షించి మించు
హర్షమున ప్రేమ యిగురొత్త • నాదరమున
గౌఁగిలించెను సీత! రాఁ • గదె యటంచు. 213

తే॥ విశ్వకర్మ నిర్మితములై ♦ వెలుఁగునట్టి
దివ్యకుండలయుగళంబు ♦ దేజ మొప్ప
నిచ్చెను దుకూలముల రెంటి ♦ నింపొసంగ
నమలమగువాని భక్తి నా♦యమకు నామె. 214

చ॥ విమలతరాంగరాగ మిదె ♦ విశ్రుతలీలగ నో శుభానవా!
ప్రియుదముతో నొసంగితిని ♦ రమ్యతరంబుగ నుండఁగల్గు నో
కమలదళాక్షి దేహవర♦కాంతులు మాయవు తగ్గిపోవ వీ
సుమములు వాడిపో వని వ♦సుంధరపుత్రికి నిచ్చె మెచ్చుగన్. 215

చ॥ అవనిఁ బతివ్రతాత్వమును ♦ నాత్మసుభక్తిఁ బురస్కరించి నీ
ధవుఁడగు రామచంద్రునెడఁ♦దప్పక రాముని వెంబడించి ఘో
మ్మవనికి నేమ మొప్పఁగను ♦ బొందుగ నూరికి వచ్చునంత కో
యువిదరో! కీర్తనీయ వయి ♦ యుండవె యుండజయాన జానకీ!

తే॥ అనుచు సీతాసమ♦న్వితు ♦ ననఘచరితు
రాము సౌమిత్రి భుజియింపఁ ♦ బ్రేమ మీరఁ
బెట్టె నతిథిపూజావిధి ♦ వెలయ లోక
విహిత కార్య ధురంధరుల్ ♦ ప్రియులు గారె. 217

చ॥ నళినదళాక్ష! నీవు భువ♦నంబుల జేసి తదీయ రక్షణన్
దలకొనియున్నవాఁడవు గ♦దా! సుర మానుష తిర్యగాది రూ
పుల ధరియించి దేహ గుణ♦పుంజములం దగులంగరావు నీ
విల భవదీయ మాయయును ♦ నాత్మను భీతిలు నీదుమాటకున్.

ఆశ్వాసాంతము.

చ॥ నిరయ ఘనప్రవాత! రజ♦నీచర పన్నగ వైనతేయ! ని
ర్జర మనుజాధినాథ! గిరి♦జాకుచ కుంకుమపంకలిప్త భా
సురవరవక్ష! చంద్రధర! ♦ సూర్య శశాంకదహనలాక్ష! శం

భుజంగ ప్రయాతమ్.

భుజంగాధినాథప్ర భూషోజ్వలాంగా
రజస్సత్తమో యోగి రాజీవ భృంగా
నిజాత్మ ప్రభావా సునీతి క్రియాంగా
భజన్మోక్షదాత్మ ప్రభావానుషంగా!

క॥ ధీరా రాధీ! మారా
కారా! గంగాధర! విభు! కారుణ్యనిధీ!
సారాచారా! వేదా
ధారా! బ్రహ్మేశ్వర! వసుధారమరమణా!

—గ ద్య ము—

ఇది శ్రీ మదుమామనోరమణచరణ సేవాధురంధర పవిత్రాప
స్తంబసూత్ర కౌండిన్యగోత్ర వేలమూరివంశ పయఃపారా
వార రాకాసుధాకర మహానందీశపౌత్ర శర్వుడుదార
కోటీశ్వరమనీషిపుత్ర శేషమాంబా గర్భశుక్తి
ముక్తాయమాన శ్రీ పరమేశ్వర కరుణాకటాక్ష
లబ్ధ కవితా వినోద సూరి జనవిధేయ శ్రీ
మ దుభయకవిసమాశ్రయ జానకీ
రామ ప్రణీతంబగు శ్రీ మదాంధ్రా
ధ్యాత్మ రామాయ ణాంతర్గతం
బగున యోధ్యాకాండంబున
సర్వంబును చతుర్థాశ్వాసము.